# చతుర ప్రపంచం

## అక్కడన్నీ తొలిచూపు ప్రేమలే...

ప్రేమించి పెళ్లి చేసుకోవాలనుకునే వారు మధ్యప్రదేశ్ ఝుబువా జిల్లా భాగోరియా గ్రామానికి వెళ్లాలి. 'హోలీ' కి ముందు వారం రోజులపాటు జరిగే ఈ పండుగ ఉత్సవాలు ప్రేమకు వేదికలుగా మారుతుండడం గమనార్హం.

ఈ సంబరాలలో పాల్గొనేందుకు యువతీ యువకులు ఎంతో ఉత్సాహం చూపిస్తున్నారు. వారి అభిరుచులకు తగిన జీవిత భాగస్వాములు అక్కడే లభిస్తారని వారి విశ్వాసం. అబ్బాయిల కవ్వింతలు అమ్మాయిల వాలు చూపుల విసుర్లతో ఈ సంబరాలు కొత్త అందం సంతరించుకుంటాయి.

నిజానికి ఇక్కడన్నీ తొలి చూపు ప్రేమలే అని చెప్పవచ్చు ఉదాహరణకి ఓ అబ్బాయికి ఓ అమ్మాయి నచ్చింది. మామూలుగా అయితే చాలామంది ఆ విషయాలన్నీ వెంటనే అమ్మాయికి చెప్పరు. కానీ ఇక్కడ అలా కాదు. అబ్బాయి తనకు నచ్చిన అమ్మాయి దగ్గరకు వెళ్లి ఓ కిళ్లీ ఇస్తాడు. ఆ అమ్మాయి కూడా ఆ అబ్బాయి నచ్చితే వెంటనే కిళ్లీ తీసుకుని తింటుంది. అనంతరం ఆ అబ్బాయి ఆమె మీద రంగులు చల్లితే




ఇద్దరూ ప్రేమలో పడినట్టే. సాయంత్రం దాకా వేచి ఉండి రాత్రవగానే ఆ ఇద్దరూ ఎటైనా వెళ్లిపోవచ్చు.

ఆ తర్వాత పాత్ర అమ్మాయి స్నేహితురాళ్లది. వాళ్లు వెళ్లి అమ్మాయి తల్లి తండ్రులని సంప్రదించి జరిగిందంతా వివరంగా చెప్తారు. అప్పుడు వాళ్లు అబ్బాయి తల్లిదండ్రులను సంప్రదించి పెళ్లి ఎప్పుడు చేయాలనే దాని గురించి చర్చిస్తారు.



ఇంత తేలికగా ప్రేమ వివాహాలు అయిపోతాయన్నమాట. అని అప్పుడే సంతోషించకండి. ఇక్కడో మెలిక ఉంది. అదేంటంటే ఒకవేళ కూతురు ఇష్టపడ్డ అబ్బాయి అమ్మాయి తల్లితండ్రులకి నచ్చ లేదనుకోండి ఇక ఆ అబ్బాయి జేబుకి చిల్లు పడ్డట్టే. ఎందుకంటే అలాంటప్పుడు గ్రామ పెద్ద నిర్ణయించిన డబ్బు మొత్తాన్ని అమ్మాయి తల్లితండ్రులకి చెల్లించాల్సి ఉంటుంది. అంటే ఇది కూడా ఒకరకమైన కన్యాశుల్కం లాంటిద న్నమాట. ఒకవేళ అబ్బాయి కనక అంత డబ్బు చెల్లించలేనని చెప్తే పెళ్ళి కూతురి ఇంట్లో పనివాడుగా చేరాల్సిఉం టుంది. అప్పుడు వాళ్లు చెప్పే పనులన్నీ చేయాల్సిందే.

అంత డబ్బు చెల్లించలేక ఇక్కడి అబ్బా యిలు అలాంటి పరిస్థితి ఏర్పైనా వస్తే రెండో మార్గాన్ని అంటే పెళ్ళికూతురి ఇంట్లో పని చేయడానికే ఇష్టపడుతున్నా రన్నమాట.

---

# విచిత్ర వృక్షాలు

ఈ సృష్టిలో ఎన్నో వింతలు, విచిత్రాలు మనల్ని అబ్బుర పరుస్తుంటాయి. మరి సర దాగా విచిత్ర వృక్షాల గురించి చెప్పుకుం




దామా?

వీనస్‌ఫ్లైట్రాప్, ఉట్రిక్యులేరియా, ఫీచర్ ప్లాంట్ అనే మొక్కల ఆహారం పురుగులే. ఈ మొక్కలనుంచి ఊరే కొన్ని రకాల రసా యనాలు విష సంబంధమైనవి. వీటి ఆధా రంగా ఈ మొక్కలు పురుగుల్ని చంపి వాటి లోని రసాల్ని పీల్చి జీవిస్తుంటాయి.

చెట్లలో కూడా నరమాంసభక్షకం ఉంది. దీనిపేరు మూపన్ను. ఈ వృక్షజాతులు జావా సముద్ర తీరంలో పెరుగుతాయి. నరుల నుంచి ఏనుగులదాకా ఎవ్వరూ దీని దగ్గరగా వస్తే ముళ్ల కొమ్మల బారినుంచి తప్పించుకోలేరు.

ఇకపోతే 'మంకినిల్' అనే చెట్టు పాలు ఒక్క చుక్క నెత్తిన పడినా కళ్లు పోతాయిట. అదే 'ఉపన్' అనే చెట్టు పాలు శరీరం మీద

పడితే ప్రాణం పోవడం ఖాయం.

మరి ఇవికాక పాలు, నీళ్లు ఇచ్చే చెట్లు కూడా ఉన్నాయి. దక్షిణ అమెరికాలో కనిపించే కొన్ని రకాల చెట్లనుంచి వర్షం పడుతున్నట్టుగా ఆకులనుంచి నీళ్లు కారుతూ ఉంటాయి.

అదే జావా ప్రాంతానికి వెళితే కొన్ని రకాల చెట్లు బోదెపై గంట్లు పెడితే అవి గొట్టం నీటిని చిమ్మినట్టుగా నీటిని బయటకి విరజిమ్ముతాయి. పాలవంటి ద్రవాలు ఇచ్చే చెట్లు చూడాలంటే దక్షిణ అమెరికా వెళ్లాల్సిందే.

చూశారా? చెట్లు కూడా ఎన్నిరకాల పోకడలు పోతున్నాయో?

## గెలిస్తే స్పేస్‌లోకి...

మీరు ఏదైనా క్విజ్ ప్రోగ్రాంలో పాల్గోవాలని అనుకుంటున్నారా? అయితే హాలెండ్ వెళ్లండి... ఏంటి అక్కడి ప్రత్యేకత అంటారా? ఇక్కడ అంటే మనదేశంలో మీరు ఏదైనా క్విజ్ ప్రోగ్రాంలో పాల్గొని చివరికంటా జవాబులు చెప్తే మీకొచ్చేది లక్షల్లో, కోట్లో అంతే. అదే హాలెండ్ వారి క్విజ్ షోలో పాల్గొంటే హాపీగా అంతరిక్షంలోకి వెళ్లచ్చు. భలే బావుందికదూ!

క్విజ్‌లో భాగంగా అభ్యర్థులు అంతరిక్షానికి సంబంధించిన ప్రశ్నలకు జవాబు చెప్పాల్సి ఉంటుంది. మొత్తం నాలుగు వేల మందిలో కేవలం ఎనిమిది మందిని మాత్రమే స్పేస్‌లోకి పంపుతారు. ఇలా అంతరిక్షంలోకి పంపేముందు అభ్యర్థులకి పూర్తిస్థాయిలో శిక్షణ కూడా ఇస్తారు. అనంతరం వీరు స్పేస్‌లోకి వెళతారు. ఈ ఎనిమిది మందిలో ఎవరు బెస్ట్ అనేది ప్రేక్షకుల నిర్ణయానికి వదిలిపెడుతున్నారు.




అంటే ఓటింగ్‌లో వారు పాల్గొవచ్చన్న మాట. మొత్తానికి స్పేస్‌లోకి పంపుతారనగానే అభ్యర్థులు ఉత్సాహంగా పాల్గోవడమే కాదు చకచకా స్పేస్‌కి సంబంధించిన పుస్తకాలు కూడా నమిలేయడం, అదే చదివేయడం మొదలుపెట్టారట. మరి ఆలస్యమెందుకు? ఆసక్తి ఉన్నవారు హాలెండ్ బయలుదేరండి. ★




# గిన్నిస్‌కెక్కిన ఘనవృద్ధుడు

శామ్‌గాడ్లెస్ వయసు 91. రిటయిరయిన వారిలా ఇతడు ఇంట్లో గడపక పరుగుపందేల్లో పాల్గొంటాడు. ఫ్లారిడా రాష్ట్రం లోని బొకారేటన్ అనే ఊరికి చెందిన ఇతను మారథాన్ (పరుగుపందెం) లలో పాల్గొంటాడు. 80 ఏళ్ల వయసుపైబడ్డ వారు పరుగుపందేల్లో పాల్గొనకూడదన్న రూలుంది. కానీ శామ్‌కది వర్తించదు. అఫీషియల్‌గా కాక అనఫీషియల్‌గా పాల్గొంటాడు. ఓ 5 కిలోమీటర్ల రేసులో ఇతను మిగిలినవారిని ఓడించి వరల్డ్‌రికార్డును స్థాపించాడు, 80 ఏళ్లు పైబడ్డ కారణంగా ఇతని విజయాన్ని ఆ రేసు అధికారులు గుర్తించలేదు. గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డ్స్ గుర్తించింది.



# 'రంగుల కల' పై సమీక్షలు

జనవరి చతురలో ప్రచురితమైన ఆదెళ్ల శివకుమార్ నవల 'రంగుల కల' పై మా కందిన ఉత్తమ సమీక్షలు

## 'సినీ మాయా ప్రపంచం'

(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

జనవరి 2002 'చతుర' లో ప్రచురింపబడిన ఆదెళ్ళ శివప్రసాద్ నవల 'రంగుల కల' ఈనాటి సినిమా ప్రపంచాన్ని కళ్ళకు కట్టినట్లుగా చూపెట్టటంలో సఫలీకృత మైంది. ఈ నవలని ప్రచురించిన 'చతుర' సంపాదకవర్గం అభినందనీయులు.

సామాన్య మధ్యతరగతి రైతు కుమారుడయిన శంకర్‌ద్వారా మారుమూల పల్లెటూళ్లకుసైతం ఈ సినిమా మాయ ఎలా జనాల్ని వెర్రెత్తిస్తున్నదో, ముఖ్యంగా యువతీయువకులు ఈ మాయాలోకపు జిలుగువెలుగులకు ఎలా ఆకర్షింపబడి శలభాలుగా మారుతున్నారో రచయిత చాలా చక్కగా వివరించారు.

దేవీబాబు, మహేష్, స్వామీజీల ద్వారా ఆ మాయా ప్రపంచంలో సైతం మంచిని చూపించారు. కష్టపడి పనిచేసేవారికి ఏ రంగంలో అయినా గెలుపు సాధ్యం అని స్వామీజీ, శంకర్ పాత్రల ద్వారా అత్యద్భుతంగా చిత్రీకరించారు రచయిత.

సురేంద్ర, రాజేంద్ర లాంటి మనుషులు అన్నిచోట్లా వున్నారు. సినిమా ప్రపంచంలో ఇంకా ఎక్కువ మంది వున్నారు. దివ్య లాంటి ఆడపిల్లలు అన్నిరంగాల్లో వంచింపబడుతున్నారు. సినిమా తారలు అవటానికి సైతం అండదండలు, ఆత్మస్థైర్యం వుండాలి. ఆడ పిల్లలు అమాయకంగా తమ అందంమీద నమ్మకంతో, తల్లిదండ్రులనుసైతం విస్మరించి, చుట్టూ వున్న మెరమెచ్చు మాటలకు ప్రభావితులై దీపం చుట్టూ తిరిగే శలభాల్లా ఆహుతి అవుతున్నారు.

తప్పు చేయనప్పుడు ఎందుకు భయపడాలి అని శంకర్‌ను పోలీసులు దొంగనోట్ల కేసులో పట్టుకుని పదేపదే హింసించినా ఆత్మవిశ్వాసం కోల్పోకుండా చాలా సంయమనంతో 'బోగస్ ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్' సంగతి చెప్పి, చాలా జాగ్రత్తగా కేసునుండి బయటపడటంతో ఆ పాత్ర మరింత ఎలివేట్ అయింది. పీతాంబరం లాంటి స్ట్రిక్టు నిర్మాత అసహన దశలో వున్న టైములో కథ చెప్పే విధానంతో ఆయనను ట్రాన్స్‌లోకి తీసుకువెళ్ళగలగడంతో కొంతమందయినా మంచి నిర్మాతలున్నారన్నది నిజం అనిపిస్తుంది.

కోట్లాది రూపాయల ప్రాజెక్టులతో పగలు, రాత్రి తలమునకలుగా వుండే విశ్వనాథం, రెండు ఫ్లాపుల సినిమా నిర్మాత అని అందరిచేత అన్పించుకునే విశ్వనాథని కన్విన్సు చేసి, అహోరాత్రులు కృషి చేసి, సక్సెస్‌ఫుల్‌గా శంకర్ సినిమా నిర్మాణం పూర్తిచేయడం బాగుంది. రాత్రికి రాత్రే విజయం సాధించినట్లుకాక నీతినిజాయితీలని నిలబెట్టుకుంటూనే కేవలం టేలంట్‌తోనే ఎంతో కష్టపడి పైకి రావాలనే ప్రబోధం జరిగింది శంకర్ పాత్ర ద్వారా. క్రియేటివిటీ కోసం ఎన్నో నిద్రలేని రాత్రులు గడిపి, సక్సెస్‌కోసం నిరంతరం తపించిపోయే రామ్‌గోపాల్‌వర్మ, మణిరత్నం, శేఖర్‌కపూర్ లాంటి మేధావులు పుడ్తూనే వుంటారు అంతటా అన్ని రంగాలలో. ఈ నిరంతర ప్రవాహం ప్రవహిస్తూనే ఉంటుంది.

– మిసెస్ మూర్తి
హైద్రాబాద్ 500062.

## సుదీర్ఘ ప్రయాణం

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

"కచ్చెత్తి, పిచ్చెత్తి, పర్గెత్తి, నిస్సత్త్వమౌగాక, గర్భంబుతోనైన, బిడ్డున్న చంకన్, పసందైన బొజ్జున్నగానీ, మరేమైన నౌగాని, ఆనందహేలావిలాసాల తేలంగ నింజూతురమ్మా! సినీమా!" అంటూ ఓ కవి రాసిన సినీమా దండకం అక్షర సత్యం!

సినిమా చూడటం ఒకరకం పిచ్చి అయితే ఆ సినిమాల్లో చేరి పేరూ, డబ్బూ సంపాదిద్దామనుకోవడం మరో రకం పిచ్చి ఆ మోజులో పడి బంగారు భవిష్యత్తు ఉన్న నేటి యువత తప్పుదోవ పడుతోంది. సినీమా యాలోకంలో ఉండే ఆనుపానులు, లోటుపాటులూ తెలియక కొందరు యువతీయువకులు సదరు రంగుల ఊబిలోకి దిగిపోవడం, తమ మేథస్సునూ, సామర్థ్యాన్నీ పక్కనపెట్టి ఊడిగం చెయ్యడం, లేదా తిరిగి రావడానికి ముఖం చెల్లక ఎక్కడో అక్కడ అనామకుల్లా బతకడమో, నుయ్యోగొయ్యో చూసుకోవడమో జరుగుతున్నది. అలాటి వారికి ఓ హెచ్చరిక 'రంగుల కల'! కల నిజం కావడానికి సంభావ్యత అత్యల్పం. కల్లగా మారే ఘటనలే అనల్పం. అలాంటి రంగుల కలను నిజంచేసుకొనే యువకుని ప్రయత్నానికీ, అతనికి ఎదురైన అనుభవాలకీ ప్రతిరూపమే శివకుమార్‌గారి 'రంగుల కల', కథనం, శైలిలో రచయిత పరిణతిని తెలియజెప్పే ఈ నవలలో అన్ని పాత్రలూ సజీవమే, సందేశాత్మకమే.

కథానాయకుణ్ణి భ్రష్టు పట్టించడం నవలా తత్వానికి విరుద్ధం కనుక, ఈ నవలలో కథానాయకుడైన శంకర్ చివరికి తన ప్రయత్నంలో సఫలీకృతుడైనట్లు చెప్పబడింది కానీ, నేటి సినీ ప్రపంచంలోకి అడుగుపెట్టి ఉన్నత శిఖరాలు అందుకోవాలని ప్రయత్నించడం వీచికలలో మరీచికల్ని వెతికి పట్టుకోవటమే. అయితే కష్టపడి పనిచేసే వారికి మంచి వ్యక్తులు తారసపడటమే కాకుండా, తోడుగా నిలుస్తారని స్వామీజీ, విశ్వనాథ్‌వంటి వారి పాత్రలు చెప్తాయి. 'కృషితో నాస్తి దుర్భిక్షం' అన్నది ఎల్లెడలా అనువర్తితం.

పట్టుదలా, దీక్షా ఉంటే సినీరంగంలోనే కాదు, ఏ రంగంలోనైనా రాణించవచ్చనే నిజాన్ని అన్యాపదేశంగా ఈ నవల చెప్తుంది. అది నేటి యువతకి స్ఫూర్తి కావాలి.

సక్సెస్ గమ్యం కాకుండా అది ఓ సుదీర్ఘ ప్రయాణం కావాలనుకోవడం ముదావహం. ఆచరణీయం. ఒక మంచి నవలను అందించిన ఘనత రచయితకి చెందిందని చెప్పవచ్చు

గోదావరి పద్మావతి
సోంపేట -532284

## నిద్దురలేపిన సందేశం

*(తృతీయ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

ప్రతి మనిషికి పదిమందిలో గుర్తింపు తెచ్చుకోవాలని, తనకిష్టమైన రంగంలో గొప్ప పేరు తెచ్చుకోవాలని కోరికైతే బలంగా ఉంటుంది. కానీ దానికి తగ్గ కృషి చేయడానికి మాత్రం భయపడతారు. ఎందుకంటే విజయం సాధించాలనుకున్నవారికి కొన్ని ఎదురుదెబ్బలు కూడా తప్పవుకాబట్టి.

ఓటమిలోనుంచి కూడా విజయానికి మెట్టు వేసుకోవచ్చని, జీవితాన్ని ఒక ఛాలెంజ్‌గా తీసుకుని నిరంతర కృషితో తన లక్ష్యాన్ని సాధించుకోవచ్చని మొద్దుబారిన యువత మెదళ్ళను నిద్దురలేపిన సందేశాత్మక నవల రంగులకల.

శంకర్ పాత్రను ఉత్తమంగా తీర్చిదిద్దినందుకు రచయిత శివప్రసాద్‌గారిని అభినందిచాల్సిందే. చందు చేసిన ధనసహాయంతో హైదరాబాద్ చేరుకున్న శంకర్‌తో బాటు మనమూ వెళ్తున్నామన్నట్లనిపిస్తుంది. అతను సక్సెస్ అయ్యేటైంలో నవల చదువుతున్న పాఠకుడు కూడా శంకర్ పాత్రతో





తాదాత్మ్యం చెంది ఆనందంగా ఉండి అతను ఫెయిల్‌కాగానే బాధపడేంత సున్నితంగా ఉంది రచన.

రాజేంద్ర దివ్యను ప్రొడ్యూసర్ ఉన్న గదిలో వదిలి డోర్ లాక్ చేసినప్పుడు చవక బారు శృంగారపు వర్ణనలు చేయకుండా పాఠ కుల ఊహకే వదిలేయటం రచయితకు స్త్రీల పట్ల ఉన్న గౌరవానికి నిదర్శనంగా చెప్పుకో వచ్చు నీతీనిజాయితీలకు నిలువుటద్దంలా, అన్యాయాన్ని ఎదిరించే ధీశాలిగా, తల్లిదం డ్రుల్ని గౌరవించే తనయుడుగా శంకర్ పాత్ర పాఠకుల హృదయాల్లో నిలిచిపోతుంది. ప్రతి మనిషి శంకర్‌లా పట్టుదలతో కృషిచేసి విజయం సాధించిన రోజున మనదేశంలో నిరుద్యోగ సమస్య నీడ కూడా పడదనేది నిర్వివాదాంశం.

–కర్నాటి శివరామకృష్ణ
విజయవాడ- 520010.

## తెర వెనుక సత్యం

*(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

ఆకెళ్ళ శివకుమార్‌గారి 'రంగుల కల' నవల యువతకు సందేశాత్మకమైనదిగా భావించవచ్చు వెండితెరమీద కనిపించే మెరు పుల్ని, వారిని ఆరాధ్యదైవాలుగా కొలిచే ఫాన్సు హడావిడిని చూసి తాము ఆ ప్రపంచంలోకి అడుగుపెడితే ఏదో అయిపోతామనే భ్రమలో పడి తమ భవిష్యత్తునీ, కన్నవాళ్ళనీ పట్టించు కోకుండా కలల్లో విహరించడం నేటి యువతీ యువకులకు సాధారణమైపోయింది. తమ రంగుల కలల్ని నిజం చేసుకొనేందుకు లోతు తెలియని అగాధం వంటి ఫీల్డు లోకి అడుగు పెట్టి నానా కష్టాలు పడటం, జీవితలక్ష్యం నెరవేరకపోగా దుర్భరమైన జీవితాన్ని గడ పడం తెరవెనుక సత్యాలు. అటువంటి యువ తీయువకులకు కనువిప్పు కలిగించడానికి ఎంతైనా తోడ్పడుతుంది 'రంగుల కల' నవల.

సినిమాలోకంలో ఉండే మోసాలు, అవి నీతి, పరాన్నభుక్త జీవనం మొదలైనవి కళ్లకు కట్టినట్లుగా చూపించారు రచయిత. చక్కని శైలితో సజీవమైన పాత్ర చిత్రణతో వినోదాత్మ కంగా నవల సాగింది. అంతేకాకుండా పట్టు దలతో అనుకున్న లక్ష్యాన్ని సాధించవచ్చనే నిజాన్ని శంకర్ పాత్ర చెప్తుంది. బంగారాని కైనా గోడ చేర్పు అవసరం అన్నట్లు మంచిత నానికీ ముగ్ధులై స్వామిజీ వంటి వారు సహా యపడతారని తెలుస్తుంది.

ఈ నవల వలన కనువిప్పు కలిగి యువత పెడత్రోవ పట్టకుండా కొంచెమయినా ఆలో చించగలిగితే రచయిత ప్రయత్నం సఫలమై నట్టే. ఒక మంచి నవలను అందించిన చతు రకు అభినందనలు.

ఎన్. పద్మప్రియాశాస్త్రి,
విశాఖపట్నం.

## క్షీరసాగర మథనం

*(అయిదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

'రంగులకల' నవల మొదటినుంచి చివరి దాకా ఆపకుండా చదివించింది. ఈ నవల ద్వారా యువత ఎలా పట్టుదలతో తమ లక్ష్యాన్ని సాధించుకోవచ్చో స్పష్టంగా తెలియజే సింది. జీవితం ఒక క్షీరసాగరమథనం అని అమృతం సొంతం కావాలంటే ముందుగా విషాన్ని కూడా ఆస్వాదించాలని, ఈ నవల సూచిస్తుంది.

శంకర్‌లా ముళ్లబాటలో నడవడానికి సిద్ధ పడాలని, మనం కార్యదీక్షతో పనిచేస్తుంటే, రామ్మోహనరావు, సురేంద్రలాంటి విషస ర్పాలు అడ్డువచ్చినా చందు, స్వామిజీ లాంటి వాళ్ల సహాయంతో నిచ్చెన ఎక్కి విజయం కైవసం చేసుకోవచ్చని ఈ నవల నిరూపిం చింది.

సినిమా జీవితం స్వర్గానికి రహదారి అను కునే వారికి ఈ నవల కనువిప్పు కలిగి స్తుంది.

ఇలాంటి మంచి నవల అందించిన చతు రకు, రచయితకు నా ధన్యవాదాలు.

పి. భాగ్యలక్ష్మి
కాజీపేట -506003

సంపుటి: 25 సంచిక: 2 మార్చి - 2002
290వ సంచిక

ఆమె జీవితం ఓ ముళ్ళబాట.
అయినా అందులోనే ఓ సౌరభ భరితమయిన పువ్వులా గుబాళిస్తూ... అందరికీ ఆనందాన్ని, ఆప్యాయతనీ పంచిందామె.
రక్త సంబంధీకులే ఆమె జీవనారణ్యంలో క్రూరమృగాలై పంజాలు విసిరాయి.
అయినా మొక్కవోని మానవత్వం ఆమెకు చివరిశ్వాస వరకూ అండగా నిలిచింది. తనవాళ్ళే తన పాలిట కాలసర్పాలని తెలిసినా ఆమె వారికి అందించిన అద్భుత ప్రతిఫలం ఎలాంటిది?
కేవలం ఆమె డబ్బును ప్రేమించిన రాబందుల్లాంటి బంధువులు... ఆమెను పెట్టిన హింసలు ఎలాంటివి?
మనిషి కేవలం మనిషిగా నిలబడడానికీ, మనీషిగా మన్నన పొందడానికీ... ఎదురయ్యే ఆటుపోట్లకి అక్షరరూపం... కంట తడిపెట్టించే సంఘటనల సమాహారం...

తంగెళ్ళ శ్రీదేవిరెడ్డి రచన

# వీటనామా

ఈ నెల చతుర సమగ్రనవల.

ప్రకృతి సౌందర్యం అంతా అక్కడే నెల కొని వున్నట్టుగా ఆ వూరి పరిసరాలు నిండుగా వెలిగిపోతున్నాయి. అద్భుతమైన శోభ ప్రకృతిలో కృతిలా కదలాడుతుంటే... 'సుజలాం సుఫలాం' అనే మాటలు సజీవంగా సాక్షాత్కరిస్తున్నాయక్కడ.

వెచ్చని పల్లెగుండెలో వొదిగి ఉన్న జనం ఎవరి పనుల్లో వారు తిరుగాడుతున్నారు.

ఊరి చివరగా వున్న పాతకాలపు గచ్చు బంగళాలో ఒక పక్కగా వేసివున్న వాలుకు ర్చీలో నిర్వికారంగా కూర్చునివుందొకామె. ఆమె పేరు పరిమళాదేవి.

శిధిలమైన అంతఃపురంలో మిగిలిన ఒంటరి మహారాణిలా తోస్తున్న ఆమె వయసు అరవైదాకా వుంటుంది. అయితే పేరును నిరర్ధకం చేసుకున్నట్టుగా వున్న ఆమె తీరు, తులసీవనంలో దగ్ధమైన మూర్తీ త్వంలా వుంది. ఆమె అందం ఎండిన కల్ప వృక్షంలా కనబడుతోంది.

ఇంటినిండా ఒద్దికగా అమర్చివున్న పాత కాలపు సామగ్రి, గోడలకు అక్కడక్కడా వ్రేలాడదీసిన పూర్వీకుల నిలువెత్తు చిత్రప టాలు ఆ ఇంటి దర్పాన్ని చాటి చెబుతు న్నాయి.

రంగులు చెదిరిన గోడలు గతకాలపు వైభవానికి తార్కాణాలుగా తోస్తుంటే, మధ్య హాల్లోని గోడకు ఒక పక్కగా ప్రత్యేకంగా తగిలించి వున్న ముగ్గురి ఫోటోలు... భగ్న మైన మహాతపస్సుకి సాక్షాత్కారాలుగా తోస్తున్నాయి.

ఏకాంతాన్ని యధేచ్ఛగా అనుభవిస్తూ వెంటిలేటర్లలో కూర్చుని... కువకువమని అరుస్తున్న పావురాళ్ళు, ఇంటి చిరకాల మిత్రుల్లా వున్నాయి.

"అమ్మమ్మా"

కాసేపటి తర్వాత బయటినుండి పిలుస్తూ ఆమెవున్న గదిలోకి వచ్చింది ఓ పదేళ్ళ అమ్మాయి.

"వూ..." ఆ అమ్మాయివైపు చూడకుండానే నిర్లిప్తంగా పలికింది ఆమె.

ఆమె తీరుకు ఆ అమ్మాయి ఒకమారు నిట్టూర్చి, "మళ్ళీ బాధపడుతూ కూర్చు న్నావా? నువ్వు ఎప్పుడూ ఇంతే..." అంది గడుసుగా

"..."

"అమ్మమ్మా! నువ్వు ఇలా బాధపడుతూ కూర్చుంటే నేను అసలు నీ దగ్గరకే రాను" చూపుడువేలు చూపిస్తూ భయపెట్టినట్టుగా అంది ఆ అమ్మాయి.

ఆమె ముఖంలో ఈసారి సన్నని చిరు నవ్వు.

"ఆ... అదీ! అలా వుండాలి మరి" అంటూ ఆమెకు చేరువగా వచ్చిందా అమ్మాయి.

ఆమె అదే చిరునవ్వుతో ఆ అమ్మాయిని చూస్తూ... "కస్తూరీ! ఉదయంనుండీ మీ అమ్మ రాలేదు ఎందుకమ్మా?" అనడిగింది.

"అక్కకు పెళ్ళిచూపులు! కాకపోతే అమ్మ నీతో ఈ విషయం చెప్పవద్దంది" అంది కస్తూరి.

ఆ మాటలు వినగానే ఆమె కనుబొమ్మలు ముడిపడ్డాయి.

"కావేరికి పెళ్ళిచూపులా? పైగా ఈ విషయం నాతో చెప్పవద్దని అందా?" నమ్మ లేకపోతున్నట్టుగా అంది.

"అవును" ఆరిందాలా అంది కస్తూరి.

పరిమళ ఇంకేం మాట్లాడలేదు.

"కావేరికి అప్పుడే పెళ్ళా?" అనుకుంది తనలోతను.

ఆమె మనసు గ్రహించినదానిలా వెంటనే అంది కస్తూరి.

"పెళ్ళికొడుకు నాకేం నచ్చలేదు"

కస్తూరి మాటను ఆమె పట్టించుకోలేదు. కావేరి పెళ్ళి విషయమై తనలో తనే కలవ రపడిపోతూ "కస్తూరీ" నెమ్మదిగా పిలి చింది.

"ఏంటీ?"

"నాకు కొద్దిగా ఆసరా పట్టమ్మా"

అంటూనే కుర్చీలోంచి లేచే ప్రయత్నం చేసింది. కస్తూరి వెళ్ళి ఆమెకు ఆసరా పట్టింది.

"కస్తూరీ" అదే సమయంలో హడావిడిగా పిలుస్తూ లోపలికి వచ్చింది కస్తూరి తల్లి శకుంతల.

ఇద్దరూ ఒకేసారి శకుంతలవైపు చూశారు. పరిమళాదేవి చూపుల్లో శకుంతల మీద కోపం స్పష్టంగా కనబడుతోంది.

ఆ విషయం గమనించగానే "ఈ పిల్ల అంతా చెప్పేసినట్టుందే" అని మనసులోనే అనుకుని తడబాటుగా నీళ్ళు నమిలింది శకుంతల.

"ఏంటి శకుంతలా! అమ్మాయి ఏదో చెప్తోంది. నిజమేనా? "

కస్తూరి ఆసరాతో నెమ్మదిగా అడుగులు ముందుకువేస్తూ సూటిగా అడిగింది పరిమళాదేవి.

శకుంతల వెంటనే సమాధానం చెప్పలేక పోయింది. కాసేపు అటూ ఇటూ తటపటాయించి, "ఏంలేదు పెద్దమ్మా! వచ్చినవాళ్ళు కొత్తవాళ్ళుకాదు. ఆయన ప్రాణమిత్రుడు ఒకాయన తనంతటతనే మనమ్మాయిని తన ఇంటి కోడలిగా చేసుకోవాలంటేనూ..." చెప్పింది శకుంతల.

"అతడు ఎవరైనా కానీయ్, ఏమైనా అనుకోనీ! అతడు ఏదో అనుకున్నాడని మీరు కూడా అతడి ప్రకారం వెళ్తారా? కావేరి వయసు ఎంతని? పద్నాలుగేళ్ళు! ఇప్పుడే దానికి పెళ్ళిచేయడం సబబుగా వుంటుందా? ఆ ప్రాణమిత్రుడు ఎవరోగాని, ఇదే అభిమానాన్ని ఓ ఆరేళ్ళ తర్వాత చూపించమని నా మాటగా చెప్పు" పరిమళాదేవిలో కొద్దిగా ఆవేశం కదలాడింది.

"నువ్వు అనవసరంగా కోప్పడవద్దు పెద్దమ్మా! దానికి ఇప్పుడే పెళ్ళిచేసే ఉద్దేశం నాకుగాని, ఆయనకుగాని అస్సలు లేదు" సౌమ్యంగా సర్దిచెప్పుకోబోయింది శకుంతల.

"ఉద్దేశ్యం లేకపోతే పెళ్ళిచూపుల కార్యక్రమం దేనికి? " పరిమళాదేవిలో అదే ఆవేశం.

"ఏదో వాళ్ళు అడిగారు కాబట్టి" అంత కంటే చెప్పలేక నసిగింది శకుంతల.

"వాళ్ళు గడ్డి తినమంటే తింటావా? " వెంటనే అడిగింది పరిమళాదేవి.

సమాధానం చెప్పలేకపోయింది శకుంతల.

"పెళ్ళంటే బొమ్మలాటకాదు. వేర్వేరుగా వున్న రెండు జీవితాలు ఒకటి కాబోతున్నాయంటే అది సామాన్యమైన విషయంకాదు. కానీ మీ మొగుడూ పెళ్ళాలు ఇద్దరూ కల్సి పెళ్ళంటే ఏదో సులువు అనుకుంటున్నట్లున్నారు. అందుకే ఇంత తొందరపడుతున్నార్లా ఉంది.

"ఆడపిల్లకి పెళ్ళి చేయగానే బాధ్యత తీరిపోదు శకుంతలా! కొన్నిసార్లు బాధ్యతలు పెరుగుతాయి కూడా! ఎందుకంటే... ఏదో పెళ్ళిచేసి పంపించడమే తమ బాధ్యత అనుకునే చాలామంది తల్లిదండ్రులు, వెనకా ముందూ సరిగా ఆలోచించడంలేదు. ఆడపిల్లకు మొగుడు అనే ఒక మగవాడు తోడుగా వుంటే చాలు అనుకుంటున్నారు.

"మొగుడు అంటే కేవలం మగవాడై వుండటంకాదే! వాడు అన్నివిధాలా యోగ్యుడైవుండాలి. కానీ ఇప్పుడు మన కస్తూరికి పెళ్లంటే పెళ్ళికొడుకు ఇరవైలోపులో వుండి వుంటాడు. ఆ వయసులో అతని యోగ్యతలు నీకేం తెలుస్తాయి. రేపొద్దున వాడు వెధవగా మారితే, అమ్మాయి బాధ్యతతోపాటుగా అల్లుడి బాధ్యత కూడా మీ నెత్తిమీద పడవచ్చు.

"అసలు ఏ వయసులో పిల్లలకు పెళ్ళి చేస్తే శారీరకంగా, మానసికంగా ఆరోగ్యంగా వుండగలుగుతారు. ముఖ్యంగా పెళ్ళి చేసుకునే వాళ్ళ ఇష్టాఇష్టాలు ఏమిటి?

"ఇవేమీ పరిగణనలోకి తీసుకోకుండా మీ ఇష్టాన్నే వాళ్ళ ఇష్టంగా భావించి పెళ్ళి జరిపిస్తే ఆ పెళ్ళికి ఒక అర్థం అంటూ



వుంటుందా?" నిలదీసినట్టుగా మాట్లాడుతూ పోయింది పరిమళాదేవి.

'ఇట్లాంటి ఉపన్యాసాలు వినీవినీ బోర్‌కొట్టింది.' పైకి మాట్లాడలేదుగానీ లోపల గొణుక్కుంది శకుంతల.

"చూడు శకుంతలా! నేను మాట్లాడిన మాటలన్నీ అల్లుడితో కూడా చెప్పు! మర్చిపోవద్దు! అల్లుడు నీమాట వినకపోతే నేను వచ్చి పెళ్ళి వాయిదా వేయిస్తాను" ఖచ్చితంగా అంది పరిమళాదేవి.

శకుంతల మౌనంగా ఉండిపోయింది. పరిమళాదేవి కూడా ఇంకేం మాట్లాడలేదు. కస్తూరి ఆసరాతో పడకగదివైపు నెమ్మదిగా నడిచివెళ్ళింది.

"కోపం వచ్చిందా అమ్మమ్మా?" పడకగదిలోకి ప్రవేశించగానే అడిగింది కస్తూరి.

"అవును" అన్నట్టుగా మూలిగి, "నా ఆరోగ్యం బాగోలేదు కాబట్టి సరిపోయింది. లేదంటే ఇప్పుడు మీ అమ్మకు బడితెపూజ చేసేదాన్ని" కాసింత కసిగానే అంది పరిమళాదేవి.

కస్తూరి కిసుక్కున నవ్వుతూ బయటికొచ్చి, బయట నిల్చున్న తల్లివైపు కొంటెగా చూసింది.

అసలే కోపంతో వున్న శకుంతల, కస్తూరి తనవైపు చూడగానే రెట్టింపు కోపంతో పళ్ళు నూరింది.

"చూడు అమ్మమ్మా..." ఫిర్యాదుగా అంది కస్తూరి.

"ఏంటే?" ప్రేమగా అంటూ పక్కన కూర్చుంది పరిమళాదేవి.

"అమ్మ నామీద పళ్ళు నూరుతోంది"

"ఎందుకు నూరదు?" పరిమళాదేవి అంటుండగానే పడకగదిలోకి వచ్చింది శకుంతల.

"ఏంటీ? పిల్లమీద పళ్ళు నూరుతున్నావట?" అడిగింది పరిమళాదేవి.

"పెద్దమ్మా! దీనికి రాను రాను గారాబం ఎక్కువైపోతోంది. అందుకే లేనిపోని మాటలు చెప్తోంది" కూతురివైపు కొరకొరా చూసింది శకుంతల.

"సర్లేగాని, పెళ్ళిచూపుల గురించి నాతో చెప్పవద్దన్న మాటకూడా అబద్ధమే అంటావా?" సమయానుసారంగా అడిగింది పరిమళాదేవి.

ఆమె ఈమాట అనగానే శకుంతల గొంతులో పచ్చి వెలక్కాయ పడినట్లయింది.

శకుంతల పరిస్థితికి పరిమళాదేవి చిన్నగా నవ్వి, "నేను పెళ్ళి వద్దంటానన్న భయంతో చెప్పవద్దన్నావు. ఈరోజు నా ఆరోగ్యం బాగోలేదు కాబట్టి కస్తూరి విషయం చెప్పకపోయి వుంటే నాకళ్ళు కప్పేదానివి? కానీ రేపొద్దున్న ముహూర్తాలు పెట్టుకున్నప్పుడు విషయం నాకు తెలీకుండా వుంటుందా? పిచ్చిదానా?" అంది.

"సరేలే పెద్దమ్మా! అంతా నీమాట ప్రకారమే జరుగుతుంది. ఇక అనవసరంగా నువ్వు కలవరపడొద్దు. అసలే ఆరోగ్యం బాగోలేనిదానివి" చేరువగావచ్చి పరిమళాదేవి భుజాల్ని పట్టుకుని పరుపుమీద పడుకోబెట్టబోతూ అంది శకుంతల.

"నా ఆరోగ్యం సంగతి అటుంచు! రేపొద్దున నేను చనిపోయినా కూడా ఒక్క విషయాన్ని మర్చిపోవద్దు. నువ్వే కాదే, ఆడపిల్లలు వున్న ఏ తల్లిదండ్రులూ ఈ విషయాన్ని మర్చిపోకూడదు.

ఏంటంటే... ఆడపిల్లకుగానీ, మగపిల్లాడికిగానీ యోగ్యత అవసరం. ఒకవేళ ఆడపిల్లను కొంతవరకు చదివించి మానిపించినా, ఆమె అభిప్రాయాలకు, ఇష్టాలకు విలువ ఇవ్వాలి. అంతేకానీ ఏ బరువూ బాధ్యతా తెలియని బాల్యాన్ని, పెళ్ళి అనే గుదిబండకు కట్టివేసి, గుండెలమీద భారం తగ్గిందనుకోవడం పెద్ద పొరపాటు. ముఖ్యంగా జీవితం గురించి ఆలోచన, అవగాహన అనేవి ఏర్పడ్డప్పుడు తమ జీవితభాగస్వామి ఎలా ఉండాలన్నది పిల్లలకు పరిపూర్ణంగా తెలిసి వస్తుంది. ఈ దశనే 'వివాహ వయస్సు'





అంటారు!" చెప్పుకుపోయింది పరిమళాదేవి.

"నాకు అవన్నీ తెలుసు" అంది శకుంతల.

"తెల్సినందుకే పసిగుడ్డుకు పెళ్లిచేయాలనుకుంటున్నావు" నిష్కర్షగా అంది పరిమళాదేవి.

"అనుకోలేదు పెద్దమ్మా! అడిగినవాళ్ల మనసు నొప్పించకూడదని పెళ్ళిచూపులు ఏర్పాటు చేశాం అంతే! ఒకవేళ అమ్మాయి అబ్బాయికి నచ్చినా మీరు అడిగినంత కట్నం మేం ఇచ్చుకోలేమనో... లేక మరేదో కారణం చెప్పి, గౌరవంగా తప్పించుకుంటాం. ఆయన కూడా ఇదేమాట అన్నారు. నువ్వేమో దీని మాటలు నమ్మి ఏదేదో మాట్లాడుతున్నావు" చివరిమాటల్ని అలవోకగా అంది శకుంతల.

"సరేలేవే! అట్లా అనుకుంటే మంచిదే కదా" చిన్నగా నవ్వింది పరిమళాదేవి.



రాత్రి పదిగంటలు కావొస్తోంది. శకుంతల, ఆమె భర్త వరప్రసాద్, ఆమె తల్లిదండ్రులు జానకీదేవి, సూర్యప్రకాశరావులు డాబామీద వేసివున్న ప్లాస్టిక్ కుర్చీల్లో కూర్చుని కావేరి పెళ్ళి విషయమై దీర్ఘంగా చర్చించుకుంటున్నారు.

"మంచి సంబంధం! అబ్బాయి కూడా బాగున్నాడు. పైగా కట్నం కూడా ఎక్కువ అడగడంలేదు. ఓ నాలుగేళ్ళు పోతే ఇదే అబ్బాయికి నాలుగులక్షల కట్నం కళ్ళు మూసుకుని ఇస్తారు ఎవ్వరైనా. అట్లాంటిది అమ్మాయి బాగుంది కదాని లక్షన్నరకే ఒప్పుకునేట్టున్నారు. కానీ మన ముసల్ది ఒక అడ్డంకిలా తయారయ్యింది. ఇప్పుడేం చెయ్యాలి? " శకుంతల గొంతులో విచారం.

"ఇంకేం చేస్తాం? సముదాయించి చెప్పి ఒప్పించాలి? " అంది జానకీదేవి.

"మీ అక్క సామాన్యమైన మనిషికాదు. చెప్పినా అర్థం చేసుకోని మూర్ఖురాలు. తనకు నీతులు చెప్పడం తప్ప మరొకటి తెలీదు. తోడబుట్టి తోడబుట్టినవాళ్ళకే మనువు వచ్చారు గానీ... మీ అక్కాచెల్లెళ్ళ బుద్ధులు మాత్రం ఒకటిగా లేవు. ప్చ్.. నీలా అర్థం చేసుకునే శక్తి ఆ మూసల్దానిలో వుండివుంటేనా? అబ్బా... మనకు ఎంత అనుకూలంగా వుండేదో? " నిష్ఠూరంగా అంది శకుంతల.

"అబ్బాయికి పద్దెనిమిదేళ్లకంటే ఎక్కువ వయసులేదు. ఇంత చిన్న వయసులోనే తండ్రికి చేదోడువాదోడుగా వుంటూ బుద్ధిగా డిగ్రీ చదువుతున్నాడు.

ఏదో వాళ్ళ నాన్నమ్మకు ఆరోగ్యం బాగోలేదని అబ్బాయికి పెళ్ళి చేయాలనుకుంటున్నారు. ఇలా అనుకోవడం మన అదృష్టమే అనుకోవాలి. కానీ ఏం చేస్తాం? పరిస్థితులు ఇలా తగలడ్డాయి" వరప్రసాద్‌లోనూ విచారం.

"అసలు మన అమ్మాయి పెళ్ళి విషయమై ఒకరికి భయపడాల్సిన అవసరం రావడం నిజంగా బాధనిపిస్తోంది" బాధగా అని తల్లిదండ్రులవైపు చూస్తూ, "అంతా మీ కారణంగానే. మొదట్లో ఇద్దరికీ ఆస్తిపాస్తులు సమానంగా వుండేవి. వాళ్ళు తెలివిగలవాళ్ళు కాబట్టి, ఉపాయంతో లక్షల ఆస్తిని అదనంగా సంపాదించుకున్నారు. మీరేమో ఉన్న ఆస్తినే కరగదీశారు.

మీక్కూడా ముందు ఆలోచన వుండి వుండుంటే మనకు ఈరోజు ఒకరిపైన ఆశ పడే ఖర్మ ఉండేదికాదు.

ఆ ముసల్దేమో తన చాదస్తంతో మన ప్రాణాల్ని తింటోంది. మన పిల్లలు ఒక్కొక్కరికి మూడు లక్షల రూపాయలు ఇస్తాను అన్నందుకే ఈరోజు ఈ అవస్థ. ఇచ్చే ఆ డబ్బులు ఎప్పుడో ఒకప్పుడు ఇచ్చేస్తే మన పిల్ల అదృష్టం అనుకున్నదానికంటే ఎక్కువ బాగుపడుతుంది. కానీ ఇప్పుడేం చేయాలి?" కోపంతో అంటూ నిస్సహాయంగా తలకొట్టుకుంది శకుంతల.

'తోడుగా గతిలేనివాడ్ని ఇల్లరికం తెచ్చుకున్నాం' కూతురి బాధను దీనంగా చూస్తూ మనసులో అనుకుంది జానకీదేవి.

"మీరెవ్వరూ ఏమీ బాధపడొద్దు. బాధపడడంవల్ల ప్రయోజనంలేదు. నేను వెళ్ళి ఆ ముసల్దానికి సముదాయించి చెబుతాను. మరిదిగా నామాట వింటుందనే నమ్మకం నాకుంది" అందరివైపు చూస్తూ అన్నాడు సూర్యప్రకాశరావు.

"మరిదిగా నీకు విలువ ఇస్తుంది. కానీ అన్ని విషయాల్లో నీ మాటను గౌరవిస్తుందని నేను అనుకోవడంలేదు. ఎందుకంటే మొదట్నుంచీ ఆమె గుణం తెలిసినదే కదా" అంది జానకీదేవి.

"మొత్తానికి ఇప్పుడేమంటావు? " కల్పించుకుంది శకుంతల.

"అందరూ మౌనంగా వుండండి. అంతా సవ్యంగా జరిగేట్టు నేను చూస్తాను" అన్నాడు సూర్యప్రకాశరావు.

"అంతకన్నా కావల్సింది ఏముంది? " అంది జానకీదేవి. అంతలోనే కిందినుండి కస్తూరి గొంతు వినబడింది.

"అమ్మా... పెద్ద అమ్మమ్మ వచ్చింది"

"ఈ ముసల్ది ఇక్కడికి ఎందుకు తగలడ్డట్టు? " విసుగ్గా శకుంతల గొణగ్గానే...

"ఇంకెందుకు? లెక్చర్ ఇవ్వడానికి" వంత పాడాడు వరప్రసాద్.

ఆ మాటలో పెద్ద హాస్యమే కనబడిందో, పరిహాసమే బోధపడిందో తెలీదుగానీ, ఆ వెంటనే అందరినుండీ నవ్వులజల్లు కురిసింది.

"ష్!... ముందే కస్తూరి ఆకాశవాణి తాకట్ల కేంద్రం" ఉలిక్కిపాటుగా నవ్వును ఆపుకుని, డాబా మెట్లవైపు చూస్తూ, హెచ్చరింపుగా అంది శకుంతల. అందరూ నవ్వడం ఆపేశారు. కస్తూరి డాబామీదకు వచ్చేసింది.

"ఆ... కస్తూరీ! అమ్మమ్మను వాలుకుర్చీలో కూర్చోబెట్టి, బాదంపాలు ఇవ్వు" ఆ వెంటనే పురమాయిస్తూ లేచినిల్చుంది జానకీదేవి.

"అట్లాగే..." అంటూ ఆలస్యం చేయకుండా వెనుతిరిగి వెళ్ళిపోయింది కస్తూరి.

"ఆరోగ్యంగా వున్నప్పుడే ఈ ముసల్ది మన ఇంటికి రావడం తక్కువ. ఇక ఇప్పుడు పనిగట్టుకుని వచ్చిందంటే ఎవర్ని ఎన్ని చివాట్లు పెట్టడానికో? " రాగం తీసింది జానకీదేవి.

"ఎవర్నో ఎందుకు? అందర్నీ!" పెడసరంగా అంటూ తను కూడా కుర్చీలోంచి లేచి ముందుకు నడిచింది శకుంతల.

ఆమె వెనకే అందరూ నడిచారు.

వాళ్ళు డాబా మెట్లు దిగి కిందికి వెళ్ళేసరికి, మధ్య హాల్లో వాలుకుర్చీలో కూర్చుని కావేరి అందించిన బాదంపాలు తాగుతూ కనబడింది పరిమళాదేవి. ఆమె పక్కనే నేల మీద కూర్చుని వుంది బుచ్చమ్మ.

వాళ్ళందర్నీ ఆపాదమస్తకం పరిశీలనగా చూస్తూ "అమ్మాయి పెళ్ళి గురించి మాట్లాడుకుంటున్నారా? " ఆరా తీసినట్టుగా అడిగింది పరిమళాదేవి.

'డబ్బులు ఇస్తున్నంత మాత్రాన ఇంత అధికారం పనికిరాదే ముసల్దానా' మనసులో కసిగా అనుకుని, "అదే పెద్దమ్మా! నువ్వు చెప్పావుగా... ఈ వయసులో పిల్లకు పెళ్ళి వద్దని! అదే విషయం మాట్లాడుకుంటున్నాం" అంటూ పరిమళాదేవికి సమీ




పంగా వెళ్ళింది శకుంతల.

జానకీదేవి, సూర్యప్రకాష్‌రావు, వరప్రసాద్, ముగ్గురూ వెళ్ళి అక్కడవేసి వున్న కుర్చీల్లో ఆసీనులు అయ్యారు. శకుంతల మాత్రం, వెళ్ళి పరిమళాదేవి కూర్చున్న కుర్చీని ఒక పక్కనుంచి పట్టుకుని నిల్చుంది. కావేరి ఒక పక్కగా వెళ్ళి కూర్చుని తన పుస్తకాలు తిరగేసుకోసాగింది.

"నేనూ అదే విషయాన్ని మరొక్కసారి గుర్తు చేద్దామని వచ్చాను" అంది పరిమళాదేవి.

అందుకు ఎవ్వరూ ఏమీ అనలేదు. ఖాళీ గ్లాసును బుచ్చమ్మకు అందిస్తూ... మరిది సూర్యప్రకాష్‌రావువైపు చూస్తూ పరిమళాదేవే మాట్లాడింది.

"సూర్యా! నీవు మొదట్నుంచీ నా అభిప్రాయాల్ని వింటున్నావు. గౌరవిస్తున్నావు! నా చెల్లెలు జానకీదేవి కూడా నీ బాటలోనే నడుస్తోంది. కాని ఈ రోజు మీరిద్దరూ నా మాటను, నన్నూ, నిర్లక్ష్యం చేసిన భావన నాలో కలుగుతోంది.

అమ్మాయి, అల్లుడూ చిన్నవాళ్లు. వీళ్ళు నా మాటను కాదని ప్రవర్తించినా, తెలియక చేశార్లే అని సర్దిచెప్పుకోగలను. మంచి మాటలతో నా దారిలోకి తెచ్చుకోగలను. ఈ విషయంలో నాకు బాధ వుండదు. కాని చిన్నతనం నుండి నేనేంటో తెల్సికూడా, మీరిద్దరూ ఈరోజు ఇలా ప్రవర్తించడం నేను భరించలేకపోతున్నాను"

పరిమళాదేవి ఆవేదన ఆమె మాటల్లోనే స్పష్టంగా కనబడింది. అందుకే సర్దిచెప్పుకోబోయాడు సూర్యప్రకాష్‌రావు.

"అది కాదు వదినమ్మా"

"ఇంకేంటి సూర్యం? మీ అన్నయ్యతో నా పెళ్ళి జరిగినప్పుడు నా వయసు ఏడు సంవత్సరాలు. పెళ్ళిలో పెళ్ళికూతురిగా కాకుండా లాలిపాపగా వున్నాను. తలంబ్రాల సమయంలో నేను నిద్రబోతూవుంటే, మా మేనమామ నన్ను తన చంకలో ఎత్తుకుని కళ్యాణవేదిక మీదకు వచ్చాడుట! కాగా అప్పటికే మీ అన్నయ్య వయసు ఇరవై సంవత్సరాలు. తోడుగా లోకజ్ఞానం తెలియని అమాయకుడు.

పేదవాళ్ళయిన మా కన్నవాళ్ళు, కూతురిగా కేవలం నాకు మగతోడు వుంటే చాలు అనుకున్నారు. అందుకే నా మనసును వాళ్ళూ అర్థం చేసుకోలేదు. అసలు మనసంటే ఏమిటో తెలియని వయసులోనే ఈ ఇంటికి మనువొచ్చాను. నాకూ మనసు వుందని తెలిశాక, ఆశలు ఎదిగాక, మీ అన్నయ్యపట్ల అయిష్టత పెరిగింది.

అందుకు ఈ లోకం నన్ను నిందించింది. కట్టుకున్నవాడు ఎవడైనప్పటికీ వాడే నీ దేవుడు అంటూ కన్నవాళ్ళు సైతం నన్ను కష్టపెట్టారు. ఆడదానిగా పుట్టిన పాపానికి ఇక నా జీవితం వ్యర్థం అనుకున్నాను.

నాకు ఊహ తెలియని వయసులో, నా తల్లిదండ్రులు చేసిన పెళ్ళి నా జీవితాన్నే కాటేసిందని చెప్పవచ్చు. ఎందుకంటే వైవాహిక జీవితంలో అసంతృప్తి కంటే నరకం మరొకటిలేదు.

అందుకే... అందుకే... పిల్లల మనసు తెల్సుకుని పెళ్ళిళ్ళు జరిపించాలి. అప్పుడే పిల్లల వైవాహిక జీవితం ఆనందంగా సాగుతుంది. కానీ మన కావేరి వయసు ఎదగలేదు. ఈ వయసులో అది ప్రకటించుకునే ఇష్టాఇష్టాలు అనేవి అపరిపక్వమైనవి. కాబట్టి దాని పెళ్ళి విషయంలో మీరు బాగా ఆలోచించాలి" చెప్పుకుపోయింది పరిమళాదేవి.

"ఆలోచిస్తున్నాం" ఏదో ఒకటి అనాలి కాబట్టి అన్నట్టుగా అంది శకుంతల.

"నా పరిస్థితి మీ అందరికీ తెలుసు. అయినప్పటికీ మళ్ళీ చెప్పాను. నాలా మరే ఆడపిల్లా బాధపడకూడదు. కాబట్టి నామమాత్రం అన్నట్లుగా కాదు, గుండెలోతుల్నుంచి ఆలోచించండి. రాబోయే కాలాన్ని

ఇప్పుడే ఊహించండి. పిల్ల భవిష్యత్తును వాస్తవకోణంలోంచి పరిశీలించి చూడండి" వణుకుతున్న గొంతుతో స్థిరంగా మాట్లాడింది పరిమళాదేవి.

పోవే... ముసల్దానా మనసులో కసిగా అనుకుంది శకుంతల.

పరిమళాదేవి ఇంకేం మాట్లాడలేదు. నేలను చూస్తూ సాలోచనగా కూర్చుండిపోయింది.



ఉదయం ఆరుగంటలు కావొస్తోంది. బయటి హాల్లో తన పని తాను నిశ్శబ్దంగా చేసుకుపోతోంది బుచ్చమ్మ.

అప్పుడే తలంటు స్నానం చేసి, నొసటన సింధూరం పెట్టుకుని, తెల్లపంచా చొక్కా ధరించి, ఏదో పాత సినిమా పాటను తనలో తనే చిన్నగా పాడుకుంటూ, నెమ్మదిగా లోపలికి వచ్చి, గుమ్మందగ్గరే నిల్చుని అటూఇటూ చూశాడు సూర్యప్రకాష్‌రావు.

"రండి బాబూగోరూ" పని చేస్తున్నదల్లా ఆపి, అతడికి గౌరవపూర్వకంగా ఎదురొచ్చింది బుచ్చమ్మ.

"వదినమ్మ ఎక్కడుంది? " అడుగుతూ ముందుకు నడిచాడు సూర్యప్రకాష్‌రావు.

"పూజ గదిలో వున్నారు" చెప్పింది బుచ్చమ్మ.

"ఇంత జరిగినా వదినమ్మకు దైవభక్తి చెదిరిపోలేదు. ఆ దేవుడు ఏ వరం ఇచ్చాడని ఇంత ఇదిగా వాడ్ని పూజిస్తుందో? " నిట్టూర్పుగా అంటూ వెళ్ళి హాలు మధ్యలో వేసివున్న కుర్రకుర్చీలో కూర్చున్నాడు అతడు.

బుచ్చమ్మ లోపలికి వెళ్ళింది. కాసేపటి తర్వాత "సూర్యం..." పిలుస్తూ వెలుపలికి వచ్చింది పరిమళాదేవి.

వచ్చి అతడికి ఎడంగా వున్న మరో చెయిర్‌లో కూర్చుని "ఎంతో అవసరం వుంటే గాని, మరిదిగారు ఈ ఇంటి గడప తొక్కరు. మరి విశేషం ఏమిటో? " అంది పరిమళాదేవి.

"ఆ..." అంటూ కొన్ని క్షణాలు తటపటాయించి, "ఒక బాధాకరమైన విషయం" చెప్తుంటేనే అతడి వదనంలో బాధాతరంగాలు ముసురుకున్నాయి.

"ఏంటి? " ఆమెలో కంగారు.

"అవును వదినమ్మా! ఇలా జరుగుతుందని మేము ఎవ్వరం అనుకోలేదు" విచారంగా చెప్పాడు అతడు.

"అసలు ఏం జరిగింది సూర్యం? " ఆమెలో కంగారు పెరిగిపోయింది.

"అమ్మాయి సంబంధం విషయంలో మనం మోసపోయాం"

"అంటే? "

"అబ్బాయి తండ్రి, అల్లుడూ ఇద్దరూ స్నేహితులు అనే మాట వాస్తవం! అయితే అతడు కేవలం ఒక స్నేహితుడి కూతురిగా మాత్రమే మనమ్మాయిని తన కోడలిగా చేసుకోవాలి అనుకోలేదు"

"మరి? "

"చదువుకోసం పిల్లల్ని పక్క టౌన్‌కి పంపించడమే మనం చేసిన పెద్ద పొరపాటు! ఎందుకంటే... అబ్బాయి వాళ్లది కూడా పక్క టౌను. అక్కడే మన కావేరి, ఆ అబ్బాయి ఇద్దరూ ఒకర్ని ఒకరు ఇష్టపడ్డారు. ఈ చిన్న వయసులో దీనికి ఈ ప్రేమా





దోమా అనే విపరీత బుద్ధి పుట్టిందంటే, ఇంకేమాత్రం ఆలస్యం చేసినా అది మనచే తికి అందకుండా పోతుంది"

"అంటే అమ్మాయికి పెళ్ళి జరిపించేయాలి అంటున్నావు"

"ఈ వయసులో అమ్మాయికి పెళ్ళి చేసి, దాని బాల్యాన్ని బందీగా మార్చడం నాకు మాత్రం ఇష్టమా? ఏదో సంబంధం వచ్చింది... నామమాత్రానికి అమ్మాయిని చూపించి, ఆ తర్వాత ఏదో ఒక కారణం చెప్పి తప్పిద్దాం అనుకున్నాం అందరం! అందుకే అసలు విషయాన్ని నీకు చెప్ప కుండా పెళ్ళిచూపులు ఏర్పాటుచేశాం.

కావేరి కూడా నీ ముందుగాని, మా ముందుగాని, ఏం మాట్లాడలేదు. పైగా ఎంతో బుద్ధిమంతురాలిగా నీవు చెప్పిన ట్టుగా వింది. కాని అసలు విషయాన్ని రాత్రి నీవు వెళ్ళిపోయాక బయటపెట్టింది"

"..."

"మనమ్మాయి అబ్బాయి కుటుంబ సభ్యులందరినీ బాగా ఆకట్టుకున్నట్టుగా వుంది. అందుకే పిల్లల ప్రేమ విషయాన్ని బయటపెట్టకుండా, అబ్బాయి తండ్రి కేవలం సంబంధం నెపంతో మన ఇంటికి వచ్చాడు.

అబ్బాయి నాన్నమ్మ అనారోగ్యంతో బాధ పడుతోంది. రేపోమాపో అన్నట్టుగా వుంది. అందుకే అబ్బాయికి వీలైనంత త్వరగా పెళ్ళి జరిపించాలనుకుంటున్నారు వాళ్ళు. వాళ్లేదో అనుకున్నారని మన అమ్మాయిని బలిచే యడం మనకు మాత్రం ఇష్టమా? కానీ..!" అంటూ పరిమళాదేవివైపు చూస్తూ, ఆ తర్వాత ఇక ఏం మాట్లాడలేనట్లుగా ఆగిపో యాడు అతడు.

"అర్థమయ్యింది సూర్యం!" అని కొన్ని క్షణాలు ఆగి, "అటు ముసలమ్మకు అనా రోగ్యం, ఇటు పిల్లల ప్రేమ! కాబట్టి పెళ్ళి జరుగక తప్పదు అంటారు" అంది పరిమళా దేవి.

"తప్పదు అని నేను అనడం లేదు వది నమ్మా! మీరు ఇప్పటికికూడా వద్దంటే... అమ్మాయిని భయపెట్టి చదువు మాన్పిద్దాం! కనీసం ఇంటిదగ్గర వుండి ఏదో ఒక పని నేర్చుకున్నా, రేపొద్దున్న ప్రయోజకురాలు అవుతుంది" అన్నాడు అతడు.

"ఇది పాతకాలం కాదు. అభివృద్ధి చెందిన ఆధునిక కాలం! అందరికీ చదువు అవసరం. అప్పట్లో అక్షరజ్ఞానం వుంటే చాలు అనుకునేవాళ్ళం! కాని ఇప్పుడు కావా ల్సింది అక్షరజ్ఞానం మాత్రమే కాదు, తన కాళ్ళమీద తను ధైర్యంగా నిలబడగలిగే శక్తిని అందించే విద్యాసంపద కావాలి. కాబట్టి అమ్మాయిని చదువు మాన్పించే ఆలోచన మానుకోండి" సూటిగా మాట్లా డింది పరిమళాదేవి.

"మరి ఇప్పుడు ఏం చేద్దాం వదినమ్మా?" నిస్సహాయుడిగా అడిగాడు.

ఆలోచనగా తల పంకిస్తూ చూపుల్ని నేలకు వాల్చి దీర్ఘంగా తనే నిట్టూర్చింది పరి మళాదేవి.

"మీరు ఏ నిర్ణయం తీసుకుంటే మా అందరిదీ అదే నిర్ణయం" తనే అన్నాడు.

ఆమె ఆలోచనగానే కూర్చుండిపోయింది.

"ఏదో... జరిగిపోయిందేదో జరిగిపో యింది. కేవలం ప్రేమించడం తప్పుకాదు. ప్రేమ పేరుతో తప్పు అడుగువేయడమే తప్పు. ఆ తప్పు మన కావేరి చేయలేదు. కాబట్టి దాని మనసును అర్థంచేసుకుని, దాని ప్రేమను మన్నిద్దాం" నిండు హృద యంతో అంది పరిమళాదేవి.

"అంటే మీ అభిప్రాయాన్ని మార్చు కుంటారా వదినమ్మా?" తట్టుకోలేనట్టుగా అన్నాడు అతడు.

"నా విషయం తర్వాత. ముందు అబ్బాయి ఎలాంటివాడు? ఎలా వున్నాడు? ఈ విషయాలు నాక్కావాలి!" అందామె.

"అబ్బాయి మాత్రం వజ్రం! ఇప్పుడు పెళ్ళి చేసినంత మాత్రాన వాడి చదువుకు

ఆటంకం కలగదు. వాడు ఎప్పటికైనా మంచి ప్రయోజకుడు అవుతాడు. ఆస్తిపాస్తులు కూడా బాగున్నాయి.

ముఖ్యంగా అబ్బాయి తండ్రి తెలివైన వ్యక్తి. అతడికి ముందు ఆలోచన పుష్కలంగా వుంది. కాబట్టి తన కొడుకు భవిష్యత్తును బంగారంలా తీర్చిదిద్దగలడు" చెప్పుకుపోయాడు అతడు.

ఆమె వెంటనే ఏమీ మాట్లాడలేదు. కొన్ని క్షణాల మౌనం తర్వాత గుండె లోతుల్నుంచి అంది,

"నీ మాటల్లో వాస్తవం వుంటే అమ్మాయి కోసం నా అభిప్రాయాన్ని తప్పకుండా మార్చుకోగలను"

"వ...ది...న...మ్మా" నమ్మలేకపోయాడు అతడు.

ఆమె మరేం అనలేదు. చిరునవ్వుతో చిన్నగా తల పంకించింది.

"వదినమ్మా! ఎందుకైనా మంచిది. నువ్వు కూడా ఒకసారి వచ్చి కావేరితో మాట్లాడు" చెప్పాడు సూర్యప్రకాశరావు.

"మాట్లాడ్తాను" అంది పరిమళాదేవి.

"నేను వస్తాను వదినమ్మా" చెప్తూ అక్కడ్నుంచి ముందుకు కదిలి, గుమ్మం దాటగానే ఒకమారు ఓరగా వెనక్కి చూసి తర్వాత తనలో తనే చిద్విలాసంగా చిరునవ్వు నవ్వుకుంటూ,

'మా పథకం నెరవేరింది. నువ్వు బోల్తా పడ్డావు ముసల్దానా...' మనసులో అనుకున్నాడు సూర్యప్రకాశరావు

★ ★ ★

"అమ్మగోరూ..." మెల్లగా పిలిచింది బుచ్చమ్మ.

మధ్య హాల్లో చెక్క ఊయలపై కూర్చుని వున్న పరిమళాదేవి, "ఊ..." అంది.

"సిన్నబాబు వాళ్ళ ఇంటికి ఎల్తానన్నావు గదమ్మా" గుర్తు చేస్తున్నట్లుగా అంది బుచ్చమ్మ.





"వెళ్ళాలి" బుచ్చమ్మవైపు చూడకుండానే అంది పరిమళాదేవి.

బుచ్చమ్మ ఇంకేం అనలేదు. ఆలోచనగా కూర్చుని వున్న పరిమళాదేవివైపు అర్థంకానట్లుగా చూస్తూ అక్కడ్నుంచి వెళ్ళబోయింది.

"బుచ్చమ్మా" పిలిచింది పరిమళాదేవి.

"అమ్మగోరూ..." పలుకుతూ ఆగిపోయింది బుచ్చమ్మ.

"నువ్వు ఈ ఇంట్లో ఎన్ని సంవత్సరాల నుండి పనిచేస్తున్నావే?" బుచ్చమ్మవైపు అప్పటికిగానీ తలెత్తి చూడలేదు పరిమళాదేవి.

"అదేం ప్రశ్న అమ్మగోరూ! నేను ఈ ఊరికి పదో ఏట మనువొచ్చాను. గప్పటి నుండి నేను ఈ ఇంట్లో పనిమడిషినేగదా! కాపోతే అప్పట్లో ఇల్లు ఇట్లా వుండేదా?" అంటూ తలెత్తి శూన్యంలోకి చూస్తూ, "పెద్దబాబుగోరూ... తమరు, సిన్నబాబుగోరూ... జానకమ్మగారు, పెద్దయ్య, పెద్దమ్మగోర్లు, అబ్బో ఆ వయిబోగమే ఇప్పుడు లేదు" బాధపడిపోయింది బుచ్చమ్మ.

"ఊ..." అనునయంగా మూలిగింది పరిమళాదేవి.

"గప్పట్లో పొద్దున్నే వొచ్చి పనిజేసుకుని ఎల్లిపోయేదాన్ని. నిజంగా ఈ ఇల్లు దేవాలయం. పనిమనుషుల్ని ఇంటి మనుసులు సెడామడా తిడతారని అందరూ సెప్తారు. కానీ మునుపటినుండి గట్లాంటి కట్టమే నాకు ఎదురు కాలేదు. కానీ అమ్మగోరూ... ఒక్క ఇసయంలో మాత్రం నాకు కట్టం ఎదురయ్యింది" బాధ ఆమె ముఖంలోనే కాదు, మాటతీరులో కూడా ప్రస్ఫుటమయ్యింది.

ఏంటి అన్నట్లుగా చూసింది పరిమళాదేవి. ఆ చూపుల్లో కనిపించని ఆశ్చర్యం.

"పెద్దయ్యా, పెద్దమ్మగోర్లు ఈ లోకంనుండి ఎల్లిపోయాక, అన్నదమ్ముళ్ళు ఇద్దరూ వేరు పడ్డారు. అప్పుడు నా బాధ అంతా ఇంతా కాదు. పెద్దబాబుగోరు సిన్నపిల్లగాడిలాంటివోడు. గప్పట్లో ఆ బాబుగోరిమీద తమరికి

ఇట్టం వుండేదికాదు. కానీ రఘుబాబుగోరు పుట్టాక తమరిలో బాగా మార్పొచ్చింది. దేవుడే మార్సినట్టున్నాడు..." బుచ్చమ్మ అంటుంటేనే పరిమళాదేవి తనలో తను నిర్లిప్తంగా ఇలా అనుకుంది.

కొడుకు పుట్టాక కాలంతో రాజీపడ్డాను. కానీ నా వైవాహిక జీవితంలోని అసంతృప్తి నన్ను బాధపెట్టడం తగ్గిపోలేదే.

"రఘుబాబుగోరు పుట్టిన రెండేళ్ళకు సిన్న బాబుగోరి పెళ్ళయ్యింది. తమరి తోడబుట్టువే తమరికి తోటికోడలిగా వొచ్చింది. మరి ఇట్లాంటప్పుడు ఏరుబడ్డం దేనికి? ఈ ఇసయం గురించి నేను యిపరీతంగా ఆలోచించాను. తమరికి ఒక కొడుకు, జానకమ్మగోరికి ఒక బిడ్డ, ఇంకేం? ఒక కొడుకూ ఒక బిడ్డ లెక్కన ఎంత బాగుండేది? " బుచ్చమ్మ మాట్లాడుతూ పోతుంటే

"అవ్వా..." పిలుస్తూ వచ్చింది బుచ్చమ్మ కొడుకు కూతురు పదేళ్ళ రామలక్ష్మి.

"ఏందమ్మా? " ప్రేమగా అడుగుతూ లేచి నిల్చుంది బుచ్చమ్మ.

"అమ్మ నన్ను కొడుతుందే..." ఏడుస్తున్నట్లుగా చెప్తూ చేరువగా వచ్చింది రామలక్ష్మి.

"ఎందుకు" గాభరాపడింది బుచ్చమ్మ.

"నేను ఇస్కూల్ కి ఎల్లొద్దంట" ఈసారి నిజంగానే ఏడ్చింది రామలక్ష్మి.

"అబ్బబ్బా... మీ అమ్మానాన్నకు ఎంత చెప్పినా తెలివి రానట్టుంది..." కోపంగా అని, "నువ్వు ఏడ్వొద్దు బిడ్డా! నీవు ఇస్కూల్ కి ఎల్లువుగానీ..." సముదాయింపుగా మనవరాలి బుగ్గలు నిమిరింది బుచ్చమ్మ.

"ఎవరూ? " అదే సమయంలో లోపల్నుంచి అడుగుతూ వచ్చింది పరిమళాదేవి.

"నా మనవరాలు అమ్మగోరూ" తిరిగి చూస్తూ చెప్పింది బుచ్చమ్మ.

"ఎందుకో ఏడుస్తున్నట్టుగా వుంది" అక్కడే గుమ్మందగ్గరే నిల్చుని అడిగింది పరిమళాదేవి.

"అదే అమ్మగోరూ! పాత సుద్ది! ఇస్కూల్ కి ఎల్లొద్దంట" చెప్పింది బుచ్చమ్మ.

"అయ్యయ్యో! పిల్లను స్కూల్ కు పంపించకుండా ఏం చేయాలనుకుంటున్నారు? "

"నీ పెద్ద మనవరాళ్ళు ఇద్దరికీ తొట్లెల్లోనే పెళ్ళిళ్ళు జరిపించారు. నీ మనవడికి పదహేనేళ్ళ వయసులో పెళ్ళాన్ని తీసుకొచ్చారు. వాడికి ఇప్పుడు ఇరవైఏళ్ళు కూడా నిండలేదు, అప్పుడే బిడ్డకు తండ్రిగా మారాడు. ఇక దీన్ని కూడా బలిచేయాలనుకుంటున్నారా? " ముందుకు వస్తూ పౌరుషంగా అంది పరిమళాదేవి. ఆ సమయంలో ఆమె ముక్కుపుటాలు అదిరాయి.

"మీరైనా సెప్పండి అమ్మగోరూ!" ప్రాధేయపూర్వకంగా అంది బుచ్చమ్మ.

"ఎందుకు చెప్పను? చెప్తాను. ఇన్నిరోజులూ మంచి మాటలతో చెప్పాను. ఈసారి గదమాయించి చెప్తాను" అంటూ వచ్చి వాలుకుర్చీలో కూర్చుంది పరిమళాదేవి.

"మీరు నిజంగా చెప్తారా? అయితే నా సేతిలో సదువుగీత వున్నట్టే" ఆనందంగా కళ్ళు పెద్దవిచేసి తన అరచేతుల్ని చూసుకుంది రామలక్ష్మి.

ఆ పిల్లతీరుకి ముచ్చటగా చిరునవ్వు నవ్వింది పరిమళాదేవి.

బుచ్చమ్మమాత్రం గంపెడు ఆశలదీపాల్ని కళ్ళల్లో వెలిగించుకుంటూ, మనవరాలిని దగ్గరగా తీసుకుని పట్టుకుని, పరిమళాదేవి వైపు చూస్తూ, "నా మనవరాలు పెద్ద సదువులు సదవాలి. పెద్ద ఉజ్జోగం సేయాలి. ఇందుకు మీరు సాయపడితే అంతకన్నా గొప్ప పుణ్యం లేదు అమ్మగోరూ" అంది.

అందుకు కూడా చిరునవ్వునే సమాధానంగా పూయించింది పరిమళాదేవి. కాకపోతే ఆ నవ్వులో అభయపూర్వక భావం!

★ ★ ★

సూర్యప్రకాశరావు ఇంట్లో వాతావరణం వేడెక్కినట్లుగా కనబడుతోంది. కారణం పరిమళాదేవి అక్కడికి రావడం. అదే సహ

జంగా అయితే అందరూ కూడా సహజం గానే వుండేవాళ్ళు. కానీ పరిమళాదేవి రాక ఆ రోజు భిన్నమైంది. అందుకే శకుంతలకి చిర్రెత్తినట్టుగా వుంది.

'మొహం చూడూ! ముద్దాయిని ఇంటరాగేట్ చేయడానికి వచ్చిన సి.బి.ఐ. ఆఫీసర్‌లా బిల్డప్ ఇస్తోంది. దీని పీక పిసికి గద్దలకి పడవేస్తే కూడా పాపంరాదు.' ఆమె మనసు అగ్గిలా దహిస్తుంటే కసిగా తిట్టుకుంటూ, పరిమళాదేవికి ఎడంగా వున్న గుమ్మాన్ని ఆనుకుని నిలబడి వుంది.

సూర్యప్రకాశరావు, జానకీదేవి, ఇద్దరూ పరిమళాదేవికి సమీపంగా వున్న సోఫాలో కూర్చుని వున్నారు.

పరిమళాదేవి పాతకాలపు కర్రకుర్చీలో కూర్చునివుంది. ఆమె తీరు పెద్దరికానికి పర్యాయంలా తోస్తోంది. తోడుగా ఆమె పాదాల దగ్గర కూర్చుని వున్న బుచ్చమ్మ, ఆమె పెద్దరికాన్ని పెంచి చూపెడుతోంది.

కస్తూరి, వరప్రసాద్ ఇద్దరూ ఇంట్లోలేరు. కాగా అక్కడే వున్న కావేరి పరిస్థితి జడివానలో చిరుమొలకలా వుంది. ఎందుకంటే... అది పరిమళాదేవి అభిప్రాయాల్ని తనే స్వయంగా సవాల్ చేస్తున్న సమయం.

"కావేరీ! ఆ అబ్బాయిని నీవు మనఃస్ఫూర్తిగా ఇష్టపడ్డావా? " సూటిగా నిండుగా అడిగింది పరిమళాదేవి.

చూపులు నేలకు వాల్చి నిల్చున్న కావేరి, "అవును" అన్నట్టుగా నెమ్మదిగా తలాడించింది.

"సరే... నీ ఇష్టాన్ని మేం ఎవ్వరం కాదనలేం. కాపోతే అబ్బాయిలో ఏంచూసి ఇష్టపడ్డావమ్మా? అందాన్ని చూశా? ఆస్తిని చూశా? " లోతుగా ప్రశ్నించింది పరిమళాదేవి.

వెంటనే సమాధానం చెప్పలేక చేతులు నలుపుకుంటూ, నిల్చున్నచోటే అటూఇటూ కదులుతూ, తడబడసాగింది కావేరి.





"అయిష్టతకి కారణం వుంటున్నట్టే ఇష్టానిక్కూడా ఒక కారణం వుంటుంది" అంది పరిమళాదేవి.

కావేరిలో అదే తడబాటు.

"పోనీలే... నీకు నచ్చాడు, పెళ్ళిచేసుకోవాలి అనుకున్నావు. మరి ఈ విషయాన్ని అమ్మావాళ్ళతో ఎందుకు చెప్పలేదు"

"చెప్పాను..." అప్పటికి మెల్లగా పెదవి విప్పింది కావేరి.

"ఎప్పుడు చెప్పావు? అబ్బాయివాళ్ళు వచ్చి వెళ్ళాక చెప్పావు. అంటే ఇంట్లో భయపడ్డావా? నీ భయాన్ని అబ్బాయి తరపువాళ్ళు సైతం మన్నించి, ఈ ఇంట్లోవాళ్ళకి అసలు సంగతి చెప్పలేదా? "

'ఈ ముసల్ది వకీలుకంటే నాలుగు ఆకులు ఎక్కువే చదివింది. దీని నోట్లో చేదు కాకర పెట్టా...' పరిమళాదేవివైపు వెనకనుండి కసిగా చూస్తూ మనసులో అనుకుంది శకుంతల.

కావేరిమాత్రం బెదిరిన లేడిపిల్లలా కళ్ళింతచేసి చంచలచూపులు చూస్తూ మౌనంగా నిలబడివుంది.

పరిమళాదేవి మరేదో అనబోయింది. అంతలోనే బయటినుండి ఏడుస్తూ లోపలికి పరుగెట్టుకు వచ్చింది కస్తూరి. అందరూ అటువైపు గాభరాగా చూశారు.

"అమ్మా... అమ్మా" ఏడుస్తూ నేరుగా శకుంతల దగ్గరకు పరుగెట్టుకువెళ్ళి, "అమ్మా... ప్రిన్సిపల్ మేడమ్ నన్ను కొట్టింది. ఇదిగో..." ఏడుస్తూనే కందిపోయిన తన అరచేతుల్ని చూపించింది కస్తూరి.

"ఎందుకే... ఎందుకు కొట్టింది.? ఏం తప్పుచేశావు? " కంగారుగా అడుగుతూ కూతురి చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని, "అయ్యయ్యో! దాని మొహంమండ. మరీ దారుణంగా కొట్టిందేవిటి? " హైరానా పడింది శకుంతల.

తల్లిమాటలు సపోర్టింగ్‌గా వుండడంతో కస్తూరి ఏడుపు ఎక్కువయ్యింది.

"ఊరికే ఎవ్వరూ కొట్టరు. ఇది ఏదో పెద్ద ఘనకార్యం చేసే వుంటుంది" జారవిడుపుగా అన్నాడు సూర్యప్రకాశరావు.

"ఏంలేదు. నేనేం చేయలేదు" ఏడుస్తూనే తల అడ్డంగా ఆడించింది కస్తూరి.

"తప్పు చేయకుండానే కొట్టిందా మీ మేడమ్? " పరిమళాదేవి అడుగుతుంటేనే, కస్తూరి తోటి అమ్మాయిలు ఇద్దరు లోపలికి వచ్చారు

"కస్తూరీ! మేడమ్ నిన్ను తీసుకురమ్మంది" రాగానే ఒకమ్మాయి అంది.

"తోడుగా మీ పెద్దవాళ్ళు ఎవ్వరినైనా తీసుకురమ్మంది" ఆ వెంటనే రెండవ అమ్మాయి చెప్పింది.

"అమ్మాయిలూ! ఇంతకూ కస్తూరి ఏం తప్పు చేసింది? " లేచి ఆ అమ్మాయిలకు చేరువగా వెళ్తూ అడిగింది జానకీదేవి.

"మా ప్రిన్సిపాల్ గురించి కస్తూరి చెడ్డగా మాట్లాడింది"

"అవును"

ఇద్దరు అమ్మాయిలూ ఒకరి తర్వాత ఒకరు కళ్ళింతచేసి హడావిడిగా అన్నారు.

"ఏంమాట్లాడింది? " కనుబొమలు ముడిచింది పరిమళాదేవి. అమ్మాయిలు వెంటనే సమాధానం చెప్పలేకపోయారు. కస్తూరి ఏడుస్తూనే వుంది. అక్కడున్న మిగతా అందరి వదనాల్లో ప్రశ్నార్థకాలు స్పష్టంగా కనబడుతున్నాయి.

"ఏం మాట్లాడిందంటే" కొన్నిక్షణాల అనంతరం

మొదటి అమ్మాయి నెమ్మదిగా పెదవి విప్పగానే-

"మా ప్రిన్సిపల్ మేడమ్, మా ఇంగ్లీష్ సర్, ఇద్దరికీ ప్రేమ కుదిరిందని... మా క్లాస్‌రూమ్ బోర్డుమీద... పెద్దపెద్ద అక్షరాలతో ఆర్ట్ కొట్టింది. అందుకే కస్తూరిని ప్రిన్సిపల్ మేడమ్ కొట్టింది" తడబాటుగా, భయంగా చెప్పుకుపోయింది రెండవ అమ్మాయి.

ఆ మాటలు వినగానే వెంటనే ఎవ్వరికీ నోరు పెగల్లేదు. ఆశ్చర్యంగా, అపనమ్మకంగా నోర్లు తెరిచి కస్తూరివైపు చూడసాగారు.

"కస్తూరీ" వెంటనే తేరుకుంటూ సౌమ్యంగా పిలిచింది పరిమళాదేవి.

కస్తూరి ఏడుస్తూనే వుంది.

"కస్తూరీ" మరోసారి పిలిచింది పరిమళాదేవి.

కనీసం పరిమళాదేవివైపు కన్నెత్తి కూడా చూడలేదు కస్తూరి.

"నీవు పలకవు కదూ! నేనే నీ దగ్గరకి వస్తాను" అంటూ కూర్చున్న కుర్చీలోంచి లేచి కస్తూరి దగ్గరకు వెళ్ళి "చిట్టితల్లీ! ప్రేమ అంటే ఏంటమ్మా? " గెడ్డంపుచ్చుకుని అడిగింది పరిమళాదేవి.

"నేను రాయలేదు" ఏడుస్తూనే చెప్పింది కస్తూరి.

"ఎవరు రాశారు? "

"ఏమో? "

"రాసింది ఎవ్వరో తెలీదు. కాని అనవసరంగా నీమీద అభాండం మోపారు కదూ? "

"అవును"

"నీవు స్కూల్లో టీచర్స్‌కి శత్రువు. అందుకే అనవసరంగా నిన్ను అన్నారు"

"అవును"

పరిమళాదేవి మరేదో అనబోయింది. అంతలోనే వచ్చిన అమ్మాయిల్లో ఒకమ్మాయి కల్పించుకుంటూ,

"కస్తూరికి శత్రువులు ఎవ్వరూ లేరు. తనే ఎప్పుడూ అందర్నీ తిడుతుంటుంది, కొడుతుంటుంది, ఇప్పుడయినా ఊరుకుందా? మేడమ్ తనని అలా కొట్టిందో లేదో, ఇలా మా క్లాస్ అబ్బాయి వీపును రక్తం కారేలా కొరికి పరుగెట్టుకువచ్చింది" చెప్పింది.

"అరరే"

"అయ్యయ్యో"

"ఎందుకే? "

ఆ మాట వినగానే ఒకరి తర్వాత ఒకరు ఉలిక్కిపడ్డారు.

"అవునా కస్తూరీ? " పరిమళాదేవి గొంతులో మృదుత్వం.

అప్పటికిదాకా సన్నగా ఏడుస్తున్న కస్తూరి, ఆ ఏడుపును కూడా పూర్తిగా తగ్గించి, వెక్కుతూ పరిమళాదేవివైపు చూస్తూ "అమ్మమ్మా! ఆ అబ్బాయి క్లాస్‌లో ఎప్పుడూ ఫస్టుర్యాంక్ కొట్టేస్తాడు. అందుకే వాడంటే నాక్కోపం" రోషంగా అంది.

"అందుకని అన్యాయంగా అబ్బాయిని కొరకడం పద్ధతికాదు కదా! అంత పట్టుదల, రోషం, నీలో వుంటే కష్టపడి చదివి ఆ అబ్బాయిని అధిగమించాలిగాని" అంది పరిమళాదేవి.

"నేను ఎంత చదివినా వెనకబడిపోతున్నాను" అంది కస్తూరి.

"వెనకబడి పోతున్నావు సరే! మరి మేడమ్ నిన్ను కొట్టినప్పుడు ఆ అబ్బాయిని కొరకడం తప్పు కదా? "

"కావొచ్చు! కాని నేను అసలే కోపంగా వున్నాను. ఈ కోపంతో మేడమ్ వీపును కొరకలేనుకదా"

కస్తూరి ఈ మాట అనగానే అందరికీ నవ్వాలో ఏడవాలో అర్థంకాలేదు. ఓ రెండు క్షణాలు కస్తూరివైపు చిత్రంగా చూశారు. ఆ తర్వాత జానకీదేవి నెమ్మదిగా అంది.

"ఓసి నీ దుంపతెగ"

కస్తూరి మౌనంగా పట్టుబడిన దొంగలా నిలబడి వుంది.

"ఇదంతా సరేగాని, ప్రేమంటే ఏమిటో కాస్తా చెప్పవూ? " బుజ్జగింపుగా అడిగింది పరిమళాదేవి.

"నన్ను కొట్టవు కదా? " దారిలోకి వచ్చింది కస్తూరి.

"కొట్టడం కాదు, మాట కూడా అనను"

"సినిమాల్లో ప్రేమించుకుంటారు కదా! ముద్దుపెట్టుకోవడం, కౌగలించుకోవడం" కస్తూరి చెప్తూపోతుంటేనే వారించింది శకుంతల.

"నోర్ముయ్యవే"

తల్లి గొంతులోని గద్దింపుకు ఒక్కసారిగా ఉలిక్కిపడి చప్పున మౌనమైపోయింది కస్తూరి.

"ప్రేమంట ప్రేమ! ఏంటే ప్రేమంటే? ఇంకొక్కసారి ఇట్లాంటి పెద్దపెద్దమాటలు మాట్లాడావంటే చీరేస్తాను" ఉరిమింది శకుంతల.

"పిల్లల్ని భయపెట్టకూడదు. భయపెడితే వాళ్ళు దారిలోకి రాలేరు. తోడుగా మొండితనం పెరిగిపోతుంది. కాబట్టి వాళ్ళను సౌమ్యంగా సముదాయించి, ప్రేమగా బుజ్జగించి, బుద్ధి నేర్పాలి" శకుంతలను వారించింది పరిమళాదేవి.

'చెప్పొచ్చావులే! నీకు నీతులు మాట్లాడ్డంలో ఫస్టుర్యాంకు తప్పనిసరిగా వస్తుంది' మనసులో కసిగా అనుకుని "నీకు తెలీదు పెద్దమ్మా! దీన్ని భయపెట్టకపోతే ఇది దారిలోకి రాదు గాక రాదు! ఇప్పటికే ఇది మితిమీరిపోయింది" అంటూ కస్తూరి వీపుమీద బలంగా మొట్టి, "చూస్తే చిన్నగా వుంది గాని, పెద్దపెద్ద బుద్ధులు అలవడుతున్నాయి. మేడమ్ కొట్టిందంటే ఏదో చిన్న తప్పు చేశావు అనుకున్నానుగాని, ఇట్లాంటి తప్పు చేశావని అనుకోలేదు. ఇంకా నయం... ఆ మేడమ్ కొట్టి పంపించింది. నేనే అయ్యుంటేనా ఉరిపోసి చంపేదాన్ని" పళ్ళబిగువన కోపాన్ని వ్యక్తం చేసింది శకుంతల.

తల్లివైపు రోషంగా చూసింది కస్తూరి.

"చూపులు చూడు ఎలా వున్నాయో!" అంటూ మరోసారి కస్తూరి వీపుమీద బలంగా కొట్టి, "చిన్నవాళ్ళతో ఎలా మెలగాలో తెలీదు. పెద్దవాళ్ళను ఎలా గౌరవించాలో తెలీదు" పీక్కుతినేలా చూస్తూ అంది శకుంతల.

"నీకు కూడా తెలీదు కదా" వెంటనే పౌరు





షంగా తల ఎగరేసింది కస్తూరి.

"ఏంటే నాకు తెలియందీ?" గద్దించింది శకుంతల.

"ఈ అమ్మమ్మ నీకన్నా, అమ్మమ్మ కన్నా ఇంకా మన ఇంట్లో అందరికన్నా చాలా పెద్దది! కాని మీరంతా కలిసి ఈ అమ్మమ్మ గురించి..." కస్తూరి ఖంగున మాట్లాడుతుంటేనే అప్రమత్తమౌతూ, చప్పున ఆ పిల్ల నోరును బిగ్గరగా మూసి, "ఇంకొక్కమాట ఎక్కువ మాట్లాడావంటే చంపి పడేస్తాను జాగ్రత్త" కళ్ళు పెద్దవి చేసి మరీ హెచ్చరించింది శకుంతల.

పరిమళాదేవికి ఏం అర్థంకాలేదు. అక్కడున్న మిగతా అందరూ మాత్రం ఒకరి ముఖాల్ని ఒకరు దొంగల్లా ఒక్కక్షణం చూసుకుని, ఆ తర్వాత మామూలుగా అయ్యారు.

"చూశావా పెద్దమ్మా దీనికి వచ్చిన మాయరోగాన్ని! నీ గురించి మేము ఏదో మాట్లాడామని చెబుతోంది. దీని గురించి తెలియకపోతే నీవు నిజమే అనుకుంటావు" శకుంతల అంది.

కస్తూరి కిమ్మనడంలేదు. ఉక్రోషంగా నేలను చూస్తూ క్షణాల్ని బలంగా అనుభవిస్తున్న భావంతో మౌనంగా నిలబడి వుంది.

అందరికీ భిన్నంగా పరిమళాదేవి అంతరంగం అనుమాన భావాన్ని బలంగా మోస్తోంది. అయినప్పటికీ పైకిమాత్రం ఆమె గంభీరంగా కనబడుతోంది. కారణం ఏంటంటే... కస్తూరి అల్లరిపిల్ల అనే మాట వాస్తవం. కాగా ఆ పిల్ల అల్లరి చాలాసార్లు వాస్తవాన్నే ప్రదర్శిస్తుంది. అందుకే... ఏదో విషయంలో అందరూ కలిసి తనను మభ్య పెడుతున్నారన్న భావన, ఆమె హృదయాన్ని కలిచివేస్తోంది. కాగా తనదైన హుందాతనాన్ని నిండుగా ప్రదర్శిస్తూ.

"ఎవ్వరూ కూడా కస్తూరిని కోప్పడవద్దు. ఇది ఎవరి గురించి ఏం మాట్లాడుతుందో దీనికే తెలీదు. దీని మాటల్ని ఎవ్వరం పట్టించుకోకుంటే సరి" అంది పరిమళాదేవి.

"హమ్మయ్యా! ఈ ముసల్దాని సంయమనం మంచి మేలు చేసింది" మనసులో అనుకుని, "పట్టించుకునే వాళ్ళుగనుక వుంటే, దీని మాటలు నిష్ఠూరాన్ని తలపెడతాయి" మరోసారి కస్తూరిని కోపగించుకుంది శకుంతల.

పరిమళాదేవి ఇక ఆవిషయం గురించి ఏం మాట్లాడలేదు. వచ్చిన కస్తూరి స్నేహితులతోటి ఇలా చెప్పింది.

"అమ్మాయిలూ ఇక మీరు వెళ్ళండి. కస్తూరిని తీసుకుని నేను వస్తానుగాని"

★ ★ ★

ఇంటిముందు వేసివున్న కొట్టంలో ఒక పక్కగా నేలమీదే కూర్చుని, ఈత నారుతో తాళ్ళు అల్లుతున్నాడు బుచ్చమ్మ కొడుకు కురుమూర్తి. అతడికి సమీపంగా ఈతచాప మీద కూర్చుని బియ్యాన్ని జల్లిస్తోంది భార్య రాధమ్మ. రామలక్ష్మి కూడా అక్కడే నులక మంచంమీద కూర్చుని ఏదో ఆలోచిస్తోంది.

"ఒరే కురుమన్నా" అంటూ వచ్చింది బుచ్చమ్మ.

కురుమూర్తి తల్లివైపు ఒకమారు తలెత్తి చూసి, ఆ వెంటనే పెళ్ళాంవైపు చూస్తూ, "రాధా! అమ్మొచ్చింది. జల్లెడ పట్టడం ఆపి, ముందు కూర వండిపెట్టుపో! తినడానికి కనీసం తొక్కు కూడా లేదాయే" చెప్పాడు కురుమూర్తి.

"ఏంద్రా! పొద్దు నడినెత్తిమీదికి వొచ్చింది గాని, ఇంకా కూరనే వండలేదా?" అడుగుతూ వచ్చి రామలక్ష్మి పక్కలో నులక మంచం మీద కూర్చుంది బుచ్చమ్మ.

"సర్లేగాని... మీ అమ్మగారిని అడిగి పది వేలు అప్పుగా ఇప్పించే" అభ్యర్థన అస్పష్టంగా కనబడింది కురుమూర్తి గొంతులో

"అడిగితే అమ్మగోరు కాదనరు! కాని ఆ పదివేల రూపాయలు ఏం జేస్తావు? ఇప్పుడు అనవసరంగా పదివేల రూపాయలు ఇప్పించుకుంటే, రేపొద్దున

అత్యవసరం అయినప్పుడు మల్ల అడగడానికి మొగం వుండదు. మల్ల అడిగినా అమ్మగోరు కాదనరు. కాని మనమే అడగలేం! అందుకే అమ్మగోరిని పైసలు ఇప్పుడు అడుగొద్దు" అంది బుచ్చమ్మ.

"శానా అవసరం వుందే" ఈ మారు అతడి గొంతులో సంపూర్ణమైన అభ్యర్థన.

"ఏం అవసరం? "

"రామలచ్చిమి అందరికంటే పిన్నది. దాని పెండ్లిని జోర్‌దార్‌గా జరిపించాలే! నిన్ననే ఒక మంచి సంబంధం దోస్తానం నుండి వొచ్చింది. పిల్లగాడు శానా బుద్ధిమంతుడు. ఏడోక్లాసువరకు చదువుకుని పాన్‌డబ్బా పెట్టుకున్నాడు. ఆ పిల్లగాడికి మన పిల్లను ఇస్తేగనక, నిజంగా గొప్ప అదృష్టమే! అందుకే... బంగారంలాంటి సంబంధానికి బంగారంతోటే పూలు, పండ్లు పెట్టుకుందాం. పిల్లగాడికి ఒక టాకు (ఉంగరం) చేయించి పెడితే సాలు. మరి కాదనకుండా పదివేల రూపాయలు అడగవే! ఐదువేలు టాకుకి పోతే, ఐదువేలు కర్సులకు వస్తాయి"

ఆగకుండా మాట్లాడుతూ పోయాడు కురుమూర్తి.

కొడుకు మాటల్ని పూర్తిగా విన్న తర్వాత, మరో కొన్ని క్షణాలు కొడుకువైపే చూస్తూ మౌనంగా వుండిపోయి, ఆ తర్వాత నెమ్మదిగా అంది బుచ్చమ్మ.

ఇదంతా కుదర్దు! నా మనవరాలు పెద్ద చదువులు చదివి పదిమందిలో పెద్దపేరు తెచ్చుకుంటే, మన వొంశగౌరవం అమ్మగోరోళ్ల లెక్కన వుంటుంది"

"పెద్దపెద్ద సదువులు సదివించాలంటే మాటలు అనుకున్నావటే? లచ్చలు గాకపోయినా వేల రూపాయల్ని పోయాల్సివస్తుంది. అవసరమైతే లచ్చలే పోయాల్సివస్తుంది" అంటూ తాళ్ళు నేయడాన్ని ఆపేశాడు కురుమూర్తి.

"పెద్ద సదువులు సదివించడానికి మనదగ్గర పైసల్లేవు! కాని మనకు అమ్మగోరు వుంది! అమ్మగోరికి పిల్లల్ని సదివించాలంటే శానా ఇష్టం. దీన్ని తప్పకుండా అమ్మగోరు సదివించుకుంటుంది" బుచ్చమ్మ గొంతులో పరిపూర్ణమైన నమ్మకం.

"ఆ! సదివించుకుంటుంది! ఎందుకు సదివించుకోదు? ఆ పెద్దోళ్ళు నీతులు సెప్పేవరకేగాని, శాతలవరకు (చేతలవరకు) వొచ్చేందుకు వోళ్ళకు దయిర్నం వుండదు. నీవు అనవసరంగా ఆ పరిమళమ్మమీద నమ్మకం పెట్టుకోవద్దు. ఎందుకంటే...నీవు నీ సిన్నతనంనుండి వోళ్ళ ఇంట్ల పనిజేస్తుండావుకదా, మరి నీవు సాదించింది ఏమిటి?

వోళ్ల ఇంట పనిమడిసిగా వుండి నువ్వేమయినా మేడలు కట్టావా? లేక పొలాలు కొన్నావా? " చివరి పదాల్లో అదో వెక్కిరింత దొర్లుతుంటే, ఆ తాలూకు భావం అతడి కళ్లల్లోనూ ప్రస్ఫుటం అయ్యింది.

"ఈ మాట మాట్లాడ్డానికి సిగ్గులేదురా! థూ! అందుకే అంటార్రా... 'ఈ మడుసులంతా యిస్వాసం లేని వోళ్ళని!' ఈ మాట మొదట ఎవరు అన్నారోగాని, అది నూటికి నూరుపాళ్లు నిజ్జం! లేకపోతే ఉప్పుతిన్న ఇంటిని గురించి ఉపాసంగా మాట్లాడవు" కొద్దిగా ఆవేశంతోనే మాట్లాడి, తర్వాత గాలిలోకి చూస్తూ, "అమ్మగోరు నిజ్జంగా దేవుడమ్మ! ఆయమ్మకు చేతులెత్తి మొక్కాలే!" బుచ్చమ్మ అంటుంటేనే, అందాకా మౌనంగా కూర్చుని వున్న రామలక్ష్మి అందుకుంటూ... "అవును! ఆ అమ్మగారు నిజంగా ఎంత మంచిదో! మీరు నన్ను బడి మాన్పిస్తాను అంటుంటే, తను మాత్రం సదివిస్తానంటోంది" గలగలా అంది.

"నోర్మూయ్యావే" కూతుర్ని పెడసరంగా వారించి "ఏం సదువుకుంటావే సాకలోడి సదువు? " గదమాయించాడు కురుమూర్తి.

"అదే... అదే వద్దంటున్నాను" వెంటనే కొడుకును రెట్టించింది బుచ్చమ్మ.

అదే సమయంలో లోపల్నుండి కోడలు రాధమ్మ వెలుపలికి వస్తూ... "అత్తా మనం





ప్యాదోళ్లం! మంచం వున్నంతవరకు కాళ్ళు జాపుకోవాలే! ఇంతేగాని, వొద్ద వొగలు (డబ్బుకి నానార్థం) లేకున్నా వొయ్యారానికి తక్కువలేదు అన్నట్టుగా వుండకూడదు. కాని నువ్వేమో కోటలుదాటి మాట్లాడ్తున్నావు" అంది.

"నేను కోటలు దాటడంలేదు. 'పిలిసి బిచ్చం ఏస్తానంటే పిండాకూడు పెడ్తారేమో అని పారిపోయినాడంట' ఎనకటికి ఎవ్వడో! మీరు కూడా ఇట్టనే వున్నారు" అంది బుచ్చమ్మ.

"అంటే...? ఆ అమ్మగారు మనకు సాయం జేస్తారనే అంటున్నావు?" అంది రాధమ్మ.

"ఒక్కసారి కాదు, వందసార్లు అంటాను" అని ఓ రెండుమూడు క్షణాలు ఆగి, "ఆ అమ్మగోరు ఎట్టాంటి మనసున్న మడిసో మీరు ఇంకా అర్థం సేసుకోలేదు! అందుకే నేను శానా బాధపడిపోతున్నాను.

మొదట్నుండి అమ్మగోరినుండి మనకు అంతోఇంతో సాయం అందుతూనే వుంది. అయినప్పటికీ మీలో ఎవ్వరికీ నెనరు (విశ్వాసం) లేదు. ఆయమ్మ సొయ్యం మడుసులకే నెనరులేనప్పుడు ఉద్దెర మడుసులకు ఎట్టా వుంటుందిలే?

"ఏదో వుండనీగానీ, కాల్లు కడుక్కుని రండి. బువ్వ తిందురు"- అంది భర్త, అత్త ఇద్దర్నీ ఉద్దేశించింది రాధమ్మ.

అదే సమయంలో బయటనుండి రామలక్ష్మి గొంతు బాధగా భయంకరంగా వినబడింది.

"అవ్వా..."

ఆ కేకకు అందరూ అదిరిపడ్డారు. క్షణం కూడా ఆలస్యం చేయకుండా లేచి వేగంగా బయటికి పరుగెట్టారు.

"అవ్వా! నాకు తేలు కరిసిందే..." పెద్దగా ఏడుస్తూ కలుపుమొక్కల దగ్గర్నుంచి ఇటే పరుగెట్టుకువస్తోంది రామలక్ష్మి.

"అయ్యయ్యో"

"తేలా? ఇంకేమైనా యిసపురుగా?"

తల్లిదండ్రులు ఇద్దరూ బెంబేలు పడిపోతూ, కూతురికి ఎదురెళ్ళి అక్కున చేర్చుకున్నారు. రామలక్ష్మి ఒకవైపు ఏడుస్తూనే, మరోవైపు నొప్పి తాళలేక పోతున్నట్టుగా చేయి విదిలిస్తోంది.

"ఏమయ్యింది?"

"పిల్ల ఎందుకో ఏడుస్తోంది?"

"కొట్టారా ఏం?"

"లచ్చుమమ్మకి ఏమయ్యింది?" రామలక్ష్మి ఏడుపు వింటూనే చుట్టుపక్క జనాలు తలా ఒకమాట మాట్లాడుతూ కంగారుగా పోగవ్వసాగారు.

అందరికీ భిన్నంగా బుచ్చమ్మ మాత్రం కలుపుమొక్కల దగ్గరకి వెళ్ళి అటూ ఇటూ వెదకసాగింది. కాసేపటి తర్వాత విసుగ్గా ముఖం చిట్లిస్తూ "ప్చ్...! ఒక్క దంటు గూడా మొలవలేదేమే?" అనుకుంటూ మన వరాలి దగ్గరకి వడివడిగా వచ్చింది.

ఆ పిల్ల ఏడుపు ఆమె గుండెను కదిలిస్తోంది. అందుకే ఇక ఆలస్యం చేయలేదు.

"అమ్మగోరి దగ్గరకి పోదాం పదవే! ఆయమ్మ మందు పెడ్తే మినట్ల తగ్గిపోతుంది" హడావిడిగా అంది.

"అవునవును... అమ్మగారి చేయివాటం బాగుంది. జల్ది పోదాం పదండి" అంటూనే కూతుర్ని అమాంతం ఎత్తుకుని వేగంగా ముందుకు నడిచాడు కురుమూర్తి.

"అమ్మగారూ..." పరిమళాదేవి కనబడగానే అల్లంత దూరం నుండే అరిచినట్టుగా పిలిచాడు కురుమూర్తి.

అనూహ్యంగా వినబడిన ఆ పిలుపుకి ఒక్కసారిగా ఉలిక్కిపడి కంగారుగా చూసింది పరిమళాదేవి.

"అమ్మగారూ... బిడ్డకు తేలు కర్సింది" అందర్నీ దాటుకుని ముందుకు పరుగెట్టుకు వచ్చింది బుచ్చమ్మ.

"అరరే" అంటూ గాభరాపడి, "పిల్లను ఇంతదూరం తీసుకురావాలా? తేలుమందు



నీకు తెల్సుకదా? " బుచ్చమ్మను కోప్పడింది పరిమళాదేవి.

"ఆ దంట్లు ఆ సంకిల్ల మొలవలేదు అమ్మ గోరూ" చెప్పింది బుచ్చమ్మ.

పరిమళాదేవి ఇంకేం మాట్లాడలేదు. వెంటనే వెళ్ళి గోడవారగా మొలచిన మొక్కల్లో తనక్కావల్సిన 'బొట్లబెండాకు' మొక్కను వెదికి, గబగబా ఆకుల్ని త్రుంచి, అరచేతుల్లో బలంగా నలుపుతూ వెళ్ళి, రామలక్ష్మి ముందు కూర్చుని... "ఏదీ... తేలు ఎక్కడ కుట్టింది? " ఆత్రంగా అడిగింది.

"ఇక్కడ" ఏడుస్తూనే తేలు కరిచిన చోటు చూపించింది రామలక్ష్మి.

"ఏడ్వొద్దు, ఇక తగ్గిపోతుంది..." అనునయంగా చెబుతూ సరిగ్గా గాటుమీద పసరు పిండింది పరిమళాదేవి. ఆ పసరు చల్లదనం, నిలువెత్తున కలచివేస్తున్న బాధకి ఉపశమనపు మంత్రమై పనిచేస్తుంటే... ఏడుపు తగ్గిస్తూ-"నిజంగానే తగ్గిపోతోంది" వెక్కిళ్ల మధ్య అంది రామలక్ష్మి.



"అమ్మా! ఆ ముసల్దానితో ఇకమీదట ప్రేమగా మసలుకోవాలి" కిచెన్ కట్టముందు నిల్చుని, ఓపిగ్గా కూరగాయలు తరుగుతూ అంది శకుంతల.

"మాట మాటకి ముసల్ది అనవద్దే! ఎంతయినా తోడబుట్టినదాన్ని" కూతురికి సమీపంగా నేలమీద కూర్చుని మజ్జిగ చిలుకుతున్న జానకీదేవిలో అనుబంధానికి కదలిక వచ్చింది.

తల్లి తీరుకు ఆశ్చర్యమే కలిగిందో లేక అపనమ్మకమే తోచిందో తెలీదుకాని, కూరగాయలు తరగడం ఆపి తల్లివైపు తిరిగి చూసింది శకుంతల. ఆమె చూపుల్లో అదో వింత భావన.

"ఏంటే అలా చూస్తున్నావు? " చిన్నగా నవ్వింది జానకీదేవి.

"నువ్వు నువ్వేనా? " నమ్మకం కుదరనట్టుగా అడిగింది శకుంతల.

"ఇంకెవర్ని? "

"ఏమో మరి!? ఎప్పుడూ లేనిది కొత్తగా ప్రేమలు పుట్టుకువస్తుంటేనూ? "

"అందుకా? " అంటూ మరోసారి నవ్వి, "ఏదో అన్నాను లేవే? ఆ ముసల్దాన్ని అంటే నాకెందుకు రోషం? అదేమైనా నాకు సొంత అక్కనా? నా తల్లికి దాని తల్లి సవతి! మరి అట్లాంటపుడు దానిమీద నాకెందుకు ప్రేమ వుంటుంది" అంది జానకీదేవి.

"ఎంతయినా తండ్రితో రక్తసంబంధం ఏర్పడింది కదా! అందుకే కొత్తగా ఏమైనా అనురాగం పుట్టుకు వచ్చిందో ఏమోనని అనుమానం వచ్చింది" శకుంతల గొంతులో వ్యంగ్యం.

"అనురాగమా పాడా? " జానకీదేవి కూడా వ్యంగ్యంగా అని, "కాపోతే అటు లోకం దృష్టిలో, ఇటు ఆవిడగారు పరిమళాదేవి దృష్టిలో మనం అందరం నిజమైన ఆత్మీయులం! ఇప్పుడేకాదు, అప్పట్లో కూడా ఇదే వరస.

మీ తాతగారు తన ఇద్దరి భార్యలతోనూ ఎంతో ప్రేమగా వుంటాడు అనుకునేవారు అందరూనూ! కానీ మీ అమ్మమ్మ వుండగా

మీ తాతగారు అలా ఎందుకు వుంటాడు? దాని తల్లి పరిస్థితి దాని మొగుడి పరిస్థితే కదా! అట్లాంటి పెళ్ళాంతో వేగేది ఎవరని? అసలు ప్రేమగా వుండేది ఎవరని? ఛీఛీ! నాకైతే దాని మొహం చూస్తేనే విసుగు పుట్టేది. ఇక దాన్ని ఎప్పుడైనా పొరపాటున తాకినా రోత వచ్చేది! కాని ఇదంతా లోపలి మాట. పైకి మాత్రం ఎంతో ప్రేమలు వున్నట్టుగా కనిపించేవాళ్ళం. ఆ తల్లీకూతుళ్ళు మాత్రం అసలు విషయం తెలియక, మాతో నిజంగా ప్రేమగా మెలిగేవాళ్ళు. అందుకే అప్పుడప్పుడూ వాళ్లను చూస్తే జాలివేసేది. ఇక ఈ ముసల్దానిలో ఇప్పటికీ తరగని ప్రేమ" అంటూ మజ్జిగ చిలకడం ఆపి "అంతా మనమంచికే కదా" అంది.

"కాపోతే ఒక్కవిషయంలో మనం బాధపడాలి" తిరిగి కూరగాయలు తరగడం ప్రారంభిస్తూ అంది శకుంతల.

"ఏ విషయంలో? " మజ్జిగ పాత్రను కూర్చున్న చోటే ఒకపక్కకు పెడుతూ అడిగింది జానకీదేవి.

"తన పెద్ద కొడుక్కి పెద్దమ్మాయిని ఇస్తే, చిన్న కొడుక్కి చిన్నమ్మాయిని చేసుకుంటామని ఈ తాతగారు అనడం ఒక ఎత్తయితే ఆ తాతగారు నోర్మూసుకుని అంగీకరించడం ఒక ఎత్తు! కాని ఏంలాభం? "

మతిస్థిమితం సరిగ్గాలేనివాడ్ని కట్టుకుని ఆవిడగారు నాశనం అవుతుందని, తెలివిపరుడ్ని కట్టుకుని నువ్వు అందలం ఎక్కుతావని, అమ్మమ్మ కన్న కలలు బూడిదలో పోసిన పన్నీరు అయ్యాయి!

అయినా నీకు బుద్ధిలేదులే! ఆ ముసల్ది తెలివిగా మగవాడి ఆసరా లేకపోయినా నెగ్గుకు వచ్చింది. నువ్వేమో నాన్న విలాసాల్ని తగ్గించలేకపోయావు. తోడుగా నీ స్వంత తెలివిని ఉపయోగించి సంపాయించలేకపోయావు" చివరి మాటల్ని నిష్టూరంగా అంది శకుంతల.

"ఏదో లేవే! జరిగింది ఏదో జరిగిపోయింది" నిర్లిప్తంగా అంటూ లేచి కూతురి దగ్గరికి వచ్చింది జానకీదేవి.

"అట్లా సర్దుకుపోవడం సబబుకాదు! కనీసం ధనవంతుడ్ని అయినా ఇల్లరికం తెచ్చుకోలేకపోయావు. ఆ వెధవ సన్యాసిని నాకు కట్టబెట్టి, నన్నూ, నా పిల్లల్ని నాశనం చేసేస్తున్నారు.

ఏదో మొగుడని నేను, అల్లుడు అని మీరు, వ్హాడికి గౌరవం ఇచ్చినట్టుగా నటిస్తున్నామే తప్ప... ఒక్కరోజుయినా వాడ్ని మనస్ఫూర్తిగా గౌరవించామా? అదే ధనవంతుడు అయివుంటే ఎంత బాగా గౌరవం అందించేవాళ్ళం!

"అందుకే ఇంతక్రితం ఆ ముసల్దానితో ఇకమీదట ప్రేమగా మసలుకోవాలి అన్నాను" తరిగిన కూరగాయల్ని పక్కకు పెడుతూ అంది శకుంతల.

"నాకేం అర్థంకాలేదు" అంది జానకీదేవి.

శకుంతల వెంటనే ఏంచెప్పలేదు. కాసేపు మౌనం వహించి, ఆ తర్వాత కాసింత ముందుకు వంగి, జానకీదేవి చెవిలో గుసగుసగా అంది.

"అడపా దడపా ఆ ముసల్ది మనకు సహాయం చేస్తోంది. ఈ విధమైన సహాయం ఒక ఎత్తయితే, మన పిల్లల పెళ్ళిళ్లకు డబ్బు ఇస్తాను అనడం ఒక ఎత్తు! అయితే ప్రస్తుతం ఇదంతా పక్కకు పెట్టేసి కొత్తగా ఆలోచించాను"

"ఏంటే ఆ ఆలోచన? " జానకీదేవి గొంతులో ఆతృత.

"ఏంలేదు. ఎట్లాగయినా చేసి ఆ ముసల్దాని ఆస్తినంతా మనమే కాజేద్దాం"

"అదెలా సాధ్యం? "

"చాలా సులువు"

"ఎలా? "

"ఆ ముసల్దానికి మనవడు అంటూ ఒకడున్నాడు. కాని వాడు ఎక్కడున్నాడు? తల్లిదండ్రులు మరణించాక అమ్మమ్మ గారింట్లోనే పెరుగుతున్నాడు. ఇదే మనకు దొరి



కిన పాయింట్" చిటికేస్తూ అంది శకుంతల.

"ఏంటే... ఏంటే... త్వరగా చెప్పే?" జానకీదేవిలో నిలువెత్తు ఆరాటం.

"ఏంటంటే... ఆ ముసల్దానికి మనవడంటే పంచప్రాణం. ఆ ప్రేమను మనం చెదరగొట్టాలి. ఇందుకు మనం ప్రేమను నటించాలి. నటించి మనవడిమీద పరాయి భావం, విసుగు, కోపం, ఏర్పడేలా చేయాలి.

ఎలా అంటే... మనవడికి ఇప్పుడు పధ్నాలుగేళ్ళు. అయినప్పటికీ ఈ ముసల్దాన్ని చూడ్డానికి చుట్టపు చూపుగానే వచ్చి వెళ్తున్నాడే తప్ప- 'అయ్యో...! మా నాన్నమ్మ ఒక్కతే ఎలా వుంటుంది? అసలు ఆమెను ఒంటరిగా ఎలా వుంచాలి? నేను దగ్గరగా వుంటే మా నానమ్మ గుండెలో నెలకొన్న బాధ కొంతయినా తగ్గుతుంది కదా! అనే కించిత్ జ్ఞానంగాని, ఆలోచనగాని ఆ పిల్లాడిలో కనబడ్డంలేదు.

నాన్నమ్మ అనే ప్రేమ, మమకారం, ఆ పిల్లాడిలో వుండొచ్చు. అది వేరేమాట! కాని ఆ కుర్రకుంకలో ప్రేమరాహిత్యం నెలకొని వున్నట్టుగా ఈ ముసల్దాన్ని మనం భ్రమపెట్టాలి. ప్రత్యక్షంగా కాదు, పరోక్షంగా! ఇందుకు మన పిల్లలే ఆయుధాలు!

ముఖ్యంగా మన పథకం గురించి పిల్లలతో చెప్పకూడదు. నిజంగానే ప్రేమగా వుండమని చెప్పాలి. ఇందువల్ల ఆ ముసల్దానికి మన పిల్లలమీద, మన పిల్లలకు ఆ ముసల్దానిమీద ఎనలేని ప్రేమ పెరిగిపోతుంది. ఒకవేళ పథకం గురించి పిల్లలకి చెప్పాల్సివస్తే, ఆ విషయాన్ని కావేరికి తెలియనివ్వాలేగాని, కస్తూరికి మాత్రం ఎట్టిపరిస్థితిలో తెలియనీయకూడదు.

అసలు మన పిల్లలు ఆ ముసల్దాన్ని ఎలా ప్రేమించినా మనకు వచ్చే నష్టం అంటూ వుండదు. కాని లాభం మాత్రం కనీవినీ ఎరగనట్టుగా వుంటుంది. 'నా స్వంత మనవడు కూడా నన్ను ఇంత గొప్పగా ప్రేమించడం లేదుకదా' అనే భావన ఆ ముసల్దానిలో బలంగా నాటుకుపోవడం, ఆ భావాన్ని బలోపేతం చేయడానికి మనం ఇంకా ఇంకా పరోక్షంగా ప్రయత్నిస్తూనే వుండటం, ఫలితంగా ఆ ముసల్దాని ఇష్టప్రకారమే ఆస్తి మన పిల్లల పేరిట కావడం అనేది... అంతా కలలోలా జరిగిపోతుంది" చెప్పుకుపోయింది శకుంతల.

"ఇప్పుడేమైనా మన పిల్లలు ఆ ముసల్దాన్ని ప్రేమించడం లేదా?" అంతా విన్నాక తీరిగ్గా అంది జానకీదేవి.

"ఇప్పటి ప్రేమ వేరు, ఈ తర్వాతి ప్రేమ వేరు" కనుబొమ్మలు ఎగరవేస్తూ అంది శకుంతల.

అంతలోనే బయటనుండి వరప్రసాద్ గొంతు వినబడింది.

"శకుంతలా..."

"వచ్చాడు మహానుభావుడు" గొణుగుతూ ముఖం చిట్లించి, "ఆ...వస్తున్నానండీ" అంటూ వడివడిగా బయటకి నడిచింది శకుంతల.

మీరు వెళ్ళిన పని ఎంతవరకు వచ్చింది?" అడుగుతూ వెళ్ళి అతడి పక్కన కూర్చుంది ఆమె.

"అమ్మాయి ప్రేమ విషయంపట్ల నమ్మకం కుదరడం కోసం, మా ముసల్ది మీ దగ్గరకి ఒకవేళ వచ్చినా రావొచ్చు, మీరు నేను చెప్పినట్టుగా మాట్లాడండి. మీరు ఎంతమాత్రం వాస్తవం మాట్లాడినా ఈ పెళ్ళి జరగదు" అంది శకుంతల.

"మాకు మీ సంబంధం నచ్చింది. మీకు మా సంబంధం నచ్చింది. కాబట్టి మమ్మల్ని అర్థం చేసుకుని మెలగండి. అలా అయితేనే మన ఇరువురి మధ్య అనుబంధం ముడిపడుతుంది" అంటూ నేను అసలు విషయం చెప్పేసరికి, వాళ్ళు ఎంతమాత్రం అబ్జెక్షన్ చెప్పలేదు. సంతోషంగా అంగీకరించారు. ఎంతయినా నా స్నేహితుడు కదా! నన్ను తప్పకుండా అర్థం చేసుకుంటాడు అనే నమ్మ




కంతోనే వెళ్లాను" అన్నాడు అతడు.

"ఆఁ సాధించారులే! మీకు బదులుగా నేను వెళ్లినా, వాళ్ళు తప్పనిసరిగా ఒప్పుకునే వాళ్ళే! కాదనడానికి మనం ఏమైనా దొంగ తనం చేయమంటున్నామా? లేక మతిత ప్పిన మాటలు మాట్లాడమంటున్నామా? " చేతులు తిప్పింది.

"ఊరుకోవే! నువ్వు మరీ వున్నావు. నన్ను ఏ విషయంలో కూడా ఒప్పుకోవు" ఆమె మాటల్ని నెట్టేసినట్టుగా అన్నాడు.

"లేకపోతే ఏంటండీ? అతడు నీ ఒక్కడికే స్నేహితుడా? నాకూ క్లాస్‌మేట్ కదా"

"ఓహో! తమరు ఈ రూట్లో వచ్చారా మేడమ్? సర్లేగాని, ఈరోజు ఆదివారం కదా... పిల్లలు కనిపించడం లేదేంటీ? "

"వేణుగోపాలయ్యగారి మనవరాలి పుట్టిన రోజు పండుగకి వెళ్ళారు"

"మంచి దుస్తులు వేసుకెళ్ళారుకదా!"

"ఆ! మీరు తెచ్చారుకదా బెనారస్ బట్టలు. ఆ బట్టలు వేసుకుని వెళ్ళారు" వ్యంగ్యంగా అంది శకుంతల.

వరప్రసాద్ ఏం మాట్లాడలేదు. భార్య మాటలకు ముఖాన్ని చిన్నబుచ్చుకుని అక్క ణ్ణుంచి లేచి ముందుకు నడిచాడు.

"రోషానికి మాత్రం తక్కువలేదు" వెళ్తున్న భర్తనే చూస్తూ అంది ఆమె.

అతడు పెదవి విప్పలేదు. ఆమె కూడా రెండు మూడు క్షణాలు మౌనం వహించి, ఆ తర్వాత ఏదో గుర్తుకువచ్చిన దానిలా చప్పున తేరుకుని భర్త వెనకాల పరుగెట్టుకు వెళ్ళి... "కోపం వచ్చింది కదూ? " అతడి ముఖంలోకి గుచ్చి చూస్తూ అడిగింది. ఆ తీరులో బోలెడంత ప్రేమ స్పష్టమయింది.

ఆగి ఆమె ముఖంలోకి చూశాడు అతడు. ఆమె చిరునవ్వు నవ్వింది.

"నీపై నాకు ఎప్పుడూ కూడా కోపం రాలేదు. రాదు కూడా" మృదువుగా అన్నాడు అతడు.



ఆ సాయంత్రం వేళలో మృదువుగా వీస్తున్న చిరుగాలుల ఉనికి, ఏ మలయమా రుతాలో ప్రకృతిని సుతిమెత్తగా స్పృశిస్తున్న భావనను కలిగిస్తోంది.

కాని పరిమళాదేవి మనసు మాత్రం బాధాగ్నిలో కాలుతూ కన్నీళ్లలో తేలుతోంది.

మేడమీద పిట్టగోడకు సమీపంగా కుర్చీ వేసుకుని కూర్చుని వున్న పరిమళాదేవి కళ్ళు మూసుకుని వుంది. ఆమె అంతర్నేత్రం మాత్రం అనుబంధపు అంచుల్ని ఆవేదనతో తడుముతోంది.

"అమ్మగోరూ" చేతిలో కాఫీ కప్పుతో మేడ మీదకి వచ్చింది బుచ్చమ్మ.

"..."

"అమ్మగోరూ కాఫీ"

"...."

"అ... మ్మ...గో...రూ..." కనుబొమ్మలు ముడిచి కంగారుగా పరిమళాదేవి ముఖం లోకి చూస్తూ నిలబడిపోయింది బుచ్చమ్మ.

అప్పటికి నెమ్మదిగా కళ్ళు తెరిచి బుచ్చ మ్మవైపు చూసింది పరిమళాదేవి.

"అమ్మగోరూ... ఎందుకు ఏడుస్తు న్నారు? " కదిలిపోయింది బుచ్చమ్మ మనసు.

"రవిబాబు, రంజని గుర్తొచ్చారు" పమిట చెంగుతో కన్నీళ్లు తుడుచుకుంటూ చెప్పింది పరిమళాదేవి.

"పోయినోళ్ళంతా మంచి మడుసులు, వున్నోళ్ళు పోయినోళ్ళ తీపిగురుతులు... అని సెప్తూ, ఎప్పుడూ ఎంతో దయిర్నంగా కనిపించే తమరే ఇలా కండ్లనీళ్ళ పెట్టు కుంటే, సూస్తూ నేను తట్టుకోలేనమ్మా!" అంటుంటేనే బుచ్చమ్మ కళ్లల్లో నీళ్లు ఉబి కాయి.

"పర్వతం మహా పెద్దదే! కాని అగ్నిశి లలు బద్దలైనప్పుడు ఆ పెద్దతనం వెయ్యి ముక్కలు కావల్సిందేకదా బుచ్చమ్మా" అంటూ బుచ్చమ్మ చేతిలోని కాఫీ కప్పును కొద్దిగా ముందుకు వంగుతూ అందుకుంది

పరిమళాదేవి.

"ఏంటో అమ్మగారూ! గప్పట్లో తమరు బాగాలు పంచుకున్నాక రెండేండ్లవరకు అందరూ సంతోషంగా వున్నారు. గాతర్వాత పెద్దబాబు గోరు కడుపులో నొప్పంటూ ఎళ్లిపోయినారు. ఆ బాబుగోరును దేవుడే తీసుకెళ్ళిపోయినా ఈ పాపిస్టి జనాలు మాత్రం తమరిమీద ఆడిపోసుకున్నారు. పెనిమిటిమీద ప్రేమలేదు కాబట్టి మందు పెట్టి సంపిందని ఎన్ని కారుకూతలు కూశారు?

ఎవరైనా ఏమైనా మాట్లాడనీ! తమరు ఎలాంటివారో నాకు తెల్వదా అమ్మగోరూ!" కళ్లనీళ్ళు తుడ్చుకుంటూ పరిమళాదేవి పాదాల దగ్గరే కూర్చుండిపోయింది బుచ్చమ్మ.

"బుచ్చమ్మా!" ఆమె బాధను చూస్తూ గుండెలోతుల్లోంచి పిలిచింది పరిమళాదేవి.

"అమ్మగోరూ!" పలికింది బుచ్చమ్మ.

"నేను నీకు ఏమవుతానే? నామీద ఇంత అభిమానం కురిపిస్తావు? "

"మడుసుల మధ్య మమకారం ఏర్పడాలంటే, రక్తసంబంధమే అవసరంలేదు అమ్మగోరూ! మంచితనం వుంటే సాలు" అంటూ పరిమళాదేవి ఖాళీచేసిన కప్పును అందుకుని పక్కకుపెట్టి- "నాకు కాన్పుకట్టమై పెద్దాపరేశను సేసి బిడ్డను తీయాలి అన్నప్పుడు, మా వోళ్ళ సేతుల్లో సిల్లిగవ్వలేదు. సమయానికి పెద్దయ్యగారి దగ్గర కూడా డబ్బుల్లేవు. అప్పుడు చేతికి వున్న బంగారుగాజుల్ని కుదవబెట్టుకోమని ఇచ్చావు.

తమరు సేసిన సాయాలు అవొక్కటే కాదు అమ్మగోరూ! శానా శానా సాయాలు జేసినారు. అవన్నీ నేను మర్సిపోలేదు. జానకమ్మగోరు ఈ ఇంటికి వొచ్చాక మాటలు మాట్లాడ్డంలో తమరిలాగే కండ్లబడింది. కాని తమరిలా ఆపదలో నన్ను ఆదుకోలేదు. అయినప్పటికీ ఆయమ్మ పరాయిమడిసి అని నేనెప్పుడూ అనుకోలేదు. ఆయమ్మ కూడా నా మడిసి! కాకపోతే తమరిలో నేను దైవాన్ని సూస్తాను అమ్మగోరూ! అందుకే తమర్ని వదలబుద్ధి కాదు..." బుచ్చమ్మలో నిలువెత్తు మమకారం.

అంతలోనే కిందినుండి పిలుస్తూవచ్చింది కస్తూరి.

"బుచ్చమ్మా"

"రావే చిన్నారి" కస్తూరి గొంతు వినబడగానే మెట్లవైపు చూస్తూ తియ్యగా పిలిచింది పరిమళాదేవి.

"అమ్మమ్మా! బుచ్చమ్మని అమ్మమ్మ రమ్మంటుంది. పొలం దగ్గరికి వెళ్ళి కూరగాయలు కోసుకురావాలంట" హడావిడిగా చెబుతూ వచ్చి పరిమళాదేవి ఒడిలో కూర్చుంది కస్తూరి.

"సర్లేగాని, ఇదేమాటను నెమ్మదిగా చెప్పవచ్చుకదా! అంత తొందరదేనికి? " కస్తూరి బుగ్గలు పిండింది పరిమళాదేవి.

"ఈ పిన్నమ్మగోరు ఎప్పుడూ ఇంతే! తొందర ఎక్కువ!" లేచి నిల్చుంటూ అంది బుచ్చమ్మ.

"ఈ ముసలమ్మ కూడా ఎప్పుడూ ఇంతే! ఏదో ఒక మాట మాట్లాడుతుంది" ఆరిందాలా అంది కస్తూరి.

"సిన్నమ్మగోరు సిత్రాంగి" నవ్వుతూ అని- "అమ్మగోరూ! నేను జానకమ్మగోరి ఇంటికి ఎళ్తాస్తాను" చెప్పింది బుచ్చమ్మ.

"సరే" అంది పరిమళాదేవి.

"బుచ్చమ్మా! అక్కడికి వెళ్ళి మాట్లాడిందే మాట్లాడి, అందరి బుర్రలు తినొద్దు" బుచ్చమ్మ వెళ్తుంటే వెనకనుంచి గడుసుగా అంది కస్తూరి.

"అలా మాట్లాడరాదు బేటా" మృదువుగా వారించింది పరిమళాదేవి.

"అననీలే అమ్మగోరూ! మా సిన్నతల్లి నన్ను అట్లా మాట్లాడ్తే నాకు సంతోసమే..." సంతోషంగానే అని అక్కడ్నుంచి వెళ్ళిపోయింది బుచ్చమ్మ.

"అమ్మమ్మా! ఈ బుచ్చమ్మ నాకు సగమే





# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **అవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ **ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

ఎడిటర్:

# చతుర

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన ఐదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

మార్చి చతుర నవల **వీలునామా** ..................

**సమీక్షకుని పేరు:** ..........................................................

**చిరునామా:** ..........................................................

..........................................................

..........................................................

..........................................................

అర్థం అయింది" బుచ్చమ్మ వెళ్ళిపోయాక సందేహంగా ముఖంపెట్టి అంది కస్తూరి.

"ఏంటి? " అడిగింది పరిమళాదేవి.

"ఒకప్పుడు ఈ బుచ్చమ్మ మన ఇద్దరి ఇళ్ళల్లో పనిచేసేదంట. మరి ఇప్పుడు ఈ ఒక్క ఇంట్లోనే పనిచేస్తుంది ఎందుకు? "

"పనిచేయడానికి ఇప్పుడు వెళ్ళిందిగా"

"ఇలా ఎప్పుడైనా పిలిస్తేనే వచ్చి పనిచేసి వెళ్తుంది. నువ్వు మాత్రం ఆ బుచ్చమ్మను పిలవనక్కర్లేదు. ఇక్కడే తింటుంది, ఇక్కడే పడుకుంటుంది"

"నాకు ఎవ్వరూ లేరుకదా! అందుకే నా దగ్గర వుంటుంది" చెప్పింది పరిమళాదేవి.

"ఎందుకు లేరూ? మేము వున్నాంగా!" పరిమళాదేవి ముఖంలోకి ఆశ్చర్యంగా చూస్తూ అంది కస్తూరి.

కస్తూరి ఆ ఒక్కమాటకు పరిమళాదేవి మనసు పల్లవించిన పాటనే అయ్యింది. ఆ చిన్నారి మనసులోని ఆత్మీయతకు నిలువెత్తున పరవశించిపోతూ "వున్నారు! కాని ఎప్పుడూ నా దగ్గర వుండటంలేదుకదా" అంది.

"మరి నేను వుండనా? " అడిగింది కస్తూరి.

"సరే" అంటూ కస్తూరిని అలాగే కావలించుకుంది పరిమళాదేవి.

"అమ్మమ్మా" ఆమె ఒడిలో ఒదిగిపోతూ పిలిచింది కస్తూరి.

"ఒక్క విషయంలో మా అమ్మావాళ్ళు కూడా నాకు అర్థం కాలేదు"

"ఏ విషయంలో? "

"అదే... ఆరోజు, నేను నీ గురించి మాట్లాడ్తుంటేనే అమ్మ నన్ను వారించింది. గుర్తుందా? "

"ఆ... గుర్తుంది" గుర్తు చేసుకుంటున్నట్టుగా అంది పరిమళాదేవి. కాని నిజానికి ఆ విషయం ఆమెకు బాగా గుర్తుంది. ఆ అమ్మాయి మాటల్లో సత్యం లేకపోలేదని ఆరోజే గ్రహించిన పరిమళాదేవికి ఆ విషయం గురించి ఆ అమ్మాయిని ప్రత్యేకంగా అడగాలనిపించలేదు. చాటుగా అడగడం అనేది ఇరువురి మధ్య వున్న అనుబంధాన్ని వెక్కిరించడంలాంటిదేనని ఆమె భావన. కాని ఈరోజు కస్తూరి నోటినుంచే ఆ తాలూకు ప్రస్తావన అనూహ్యంగా వచ్చింది.

"అమ్మా నాన్న, అమ్మమ్మ, తాతయ్య ఆరోజు నీ గురించి ఏదేదో మాట్లాడారు. నాకు సరిగ్గా అర్థంకాలేదు. ఎందుకంటే... వాళ్లు లోపలిగదిలో మాట్లాడుకుంటున్నారు. నేను డాబామీద ఆడుకుంటున్నాను. అయితే... ఉన్నట్టుండి నేను ఆడుకుంటున్న బంతి వెళ్ళి గవాక్షం దగ్గర పడింది. నేను తెచ్చుకోడానికి వెళ్ళాను.

అప్పుడు... అమ్మ మాటలు నిన్ను తిట్టినట్టుగా, కావేరితో అబద్ధాలు చెప్పిస్తున్నట్టుగా వినిపించాయి.

ఆ ముసల్ది సామాన్యమైన బాపతు కాదు. దాన్ని ఎలా నమ్మించాలో నాకు బాగా తెలుసు. కాబట్టి నా మాట ప్రకారం ఆ అబ్బాయితో నీవు ప్రేమలో పడ్డట్టుగా నటించు. ఈ నటన ఆ అబ్బాయితో కాదు, ఆ ముసల్దానితో సరేనా!

అంటూ అమ్మ మాట్లాడాక నాన్నమ్మ, తాతయ్యలు అందుకు వంతపాడారు. నాక్కోపం వచ్చింది. నేను వెంటనే గవాక్షం లోంచి 'ఇదిగో... మీరు పెద్ద అమ్మమ్మ గురించి ముసల్ది అని మాట్లాడ్తున్నారు. నేను వెళ్ళి చెప్పొస్తాను" అని అరిచాను.

"అమ్మో! అంటూ అమ్మ, అమ్మమ్మ వెంటనే డాబామీదకు పరుగెట్టుకొచ్చి నాచేత ఒట్టు వేయించుకున్నారు. ఏమని వేయించుకున్నారో తెల్సా?

ఈ విషయం గురించి పెద్ద అమ్మమ్మతో ఎందుకు చెప్తావే? ఏదో ఉత్తుత్తిగా అలా మాట్లాడ్తున్నాం. నువ్వు వెళ్ళి నిజంగానే అమ్మమ్మతో చెప్తే ఆమె ఏమనుకోవాలి? మేము నిజంగానే తనని తిట్టామని భ్రమ

పడి మాపై కోపం పెంచుకోదూ? మాపై ఆ అమ్మమ్మకు కోపం వచ్చిందంటే ఇంకేమైనా వుందా? అందుకే ఈ విషయం గురించి నువ్వు మర్చిపోవాలి. లేదంటే నీకు ఇష్టమైన ఈ అమ్మ చచ్చిపోతుంది... అని."

"మరి ఒట్టును ఎందుకు మర్చిపోయావు? " అంతదాకా నిశ్శబ్దంగా వింటూ పోయిన పరిమళాదేవి నెమ్మదిగా పెదవి విప్పింది.

"హ..." అంటూ గుండెలపై చేయివేసుకుని ఉలిక్కిపడుతూ, పరిమళాదేవి ఒడిలోంచి చప్పున కిందికి దిగి "ఆరోజు ప్రేమ విషయమై మేడమ్ నన్ను కొట్టినట్టుగా, మీరంతా కూడా కొడతారేమోనని భయంతో ఒట్టు గురించి మర్చిపోయాను. ఈరోజు అనుకోకుండా మర్చిపోయాను. మరి మా అమ్మ చచ్చిపోదుకదా!" భయంగా అంది కస్తూరి.

చిరునవ్వు నవ్వింది పరిమళాదేవి.

"అమ్మకు ఏం కాదుకదా? " కస్తూరి గొంతు వణికింది.

"మీ అమ్మకు ఏమీ కాదు" అదే చిరునవ్వుతో చెప్తూ కస్తూరిని దగ్గరగా తీసుకుని, "మీ అమ్మావాళ్లు మాట్లాడింది నా గురించి కాదు. నీవు అనవసరంగా భ్రమపడి వాళ్ళను అదరగొట్టేశావు. అందుకే నీవు అనవసరంగా నాకు అబద్ధాలు చెప్పి నా మనసును బాధపెడ్తావనే భయంతో నీచేత ఒట్టేయించుకున్నారు? అది ఉత్తుత్తి ఒట్టే కాబట్టి మీ అమ్మకు ఏమీ కాదు" బుజ్జగింపుగా చెప్పింది పరిమళాదేవి.

"అంటే... అమ్మావాళ్ళు నిన్ను నిజంగా తిట్టుకోలేదన్నమాట! మరి అట్లాంటప్పుడు బయపడటం దేనికి? పైగా ఒట్టు వేయించుకోవడం దేనికి? " కస్తూరి తీరులో అమాయకత్వం.

"ఇక ప్రశ్నలు వద్దు. కాపోతే ఒక్క విషయం నీవు గుర్తు పెట్టుకోవాలి" పరిమళాదేవి మాటల్లో ప్రేమతత్వం.

"ఏ విషయాన్ని? "

"మీ అమ్మావాళ్ళ గురించిన ఇట్లాంటి మాటల్ని నీవు నాతో ఇంకెప్పుడూ చెప్పకూడదు. ఎందుకంటే మనం మంచి ఆత్మీయులం! నీవు ఇట్లాంటి మాటలు చెప్తే మన ఆత్మీయతకి భంగం కలిగే ప్రమాదం వుంది. సరేనా? "

"ఆ" సరే అన్నట్టుగా తలాడిస్తూ పరిమళాదేవి దగ్గర్నుండి దూరం జరిగి "ఇప్పుడు నేను వెళ్ళిపోతే నీ ఒక్కతికే బోర్‌గా వుంటుందా? " అడిగింది కస్తూరి.

"నువ్వు ట్యూషన్‌కి వెళ్ళాలికదూ? " పరిమళాదేవికి అర్థమయ్యింది కస్తూరి.

"అవును"

"నాకేం బోర్‌గా వుండదు. నువ్వెళ్ళు"

"వెళ్తున్నాను. నేను ఇందాక చెప్పిన మాటల్ని మళ్ళీ అమ్మావాళ్ళతో చెప్పవద్దు. చెప్తే నన్ను కొడతారు" చెప్తూనే అక్కడ్నుంచి వెళ్ళిపోయింది కస్తూరి.

కస్తూరి వెళ్ళిపోయాక తనలోతనే పేలవంగా నవ్వుకుంది పరిమళాదేవి.

★ ★ ★

"అమ్మమ్మా పిలిచారా? " రాగానే అడిగింది కావేరి.

"ఆ" అవును అన్నట్టుగా పడకమీద నుండి లేచి కూర్చుని, "నీతో కొద్దిగా మాట్లాడాలి బేటా" అంది పరిమళాదేవి.

"దేన్ని గురించి అమ్మమ్మా? " అడుగుతూ వచ్చి పరిమళాదేవి పక్కలో కూర్చుంది కావేరి.

"నువ్వు ఇంకా చిన్నపిల్లవే అనుకున్నాను. కాని నేను అనుకునే చిన్నపిల్లవి నువ్వు కాదేమో అనే అనుమానం నన్ను వేధిస్తోంది. అందుకే బేటా! నిన్ను రమ్మని చెప్పాను" అంటూ కావేరి తల నిమిరి "నీకు నిజంగా ప్రేమంటే ఏమిటో తెలుసా? " అడిగింది పరిమళాదేవి.

"..." సమాధానం చెప్పలేకపోయింది కావేరి.




"ప్రేమించడం తప్పు కాదు బేటా! భయపడకుండా చెప్పు" ధైర్యమిచ్చింది పరిమళాదేవి.

"..." కావేరి అంతరంగం భయంతో ఎగిసిపడుతూ, పరిమళాదేవి అందించిన 'ధైర్యాన్ని' ఏమాత్రం "ధైర్యంగా" అందుకోలేకపోయింది.

"చెప్పమ్మా" కావేరి భుజంపై చేయివేసింది పరిమళాదేవి.

"ఆ...రో...జే... చెప్పానుకదా!" ఈసారి అతిబలవంతంమీద పెదవి విప్పగలిగింది కావేరి.

"చెప్పావు. కాని మీ ప్రేమపట్ల నాకు నమ్మకం కుదరలేదు. ఇద్దరివీ ఎదగని మనసులు, ఎదగని వయసులు! కాబట్టి నీ ప్రేమ ఎంతవరకు నిజమైనదో నాకు తెలియాలి!" అంది పరిమళాదేవి.

"అంటే? " కావేరికి అర్థం కాలేదు.

"అంటే... నేను నిన్ను ఇప్పుడు కొన్ని ప్రశ్నలు అడుగుతాను. వాటికి నీ సమాధానాలు సూటిగా వుండాలి అన్నమాట"

పరిమళాదేవి మాట పూర్తికాకమునుపే కావేరి ముఖంలో భయం ఉప్పొంగింది. మనసులో ఏవిధమైన భయాందోళనలు చెలరేగుతున్నాయో తెలీదుకాని, ఆ అమ్మాయి మాత్రం కూర్చున్నచోటే సన్నగా తడబడసాగింది.

పరిమళాదేవి కొన్నిక్షణాలవరకు నిశ్శబ్దంగా వుండిపోయి, ఆ తర్వాత కావేరి ముఖంలోకి నేరుగా చూస్తూ, "చూడమ్మా! నీవు నీ మనసుకు నచ్చిన అబ్బాయిని ఇష్టపడ్డావు! ఎందుకు ఇష్టపడ్డావు? ఏం చూసి ఇష్టపడ్డావు? అని నేను నిన్ను అడగను. కాపోతే... భవిష్యత్తులో ఆ అబ్బాయి ఏమీ సంపాదించలేడని పైగా ఉన్న ఆస్తినంతా హారతి కర్పూరంలా అరగగొట్టేస్తాడని, ఇప్పుడు నిన్ను ప్రేమించినంతగా రేపటికాలంలో ప్రేమించడని, ముందుగానే నీకు తెల్సిపోతే నువ్వేం చేస్తావు? " అడుగుతూ పడక దిగి ముందుకు నడిచివెళ్ళింది పరిమళాదేవి.

"ఆ...ఆ..." ఏమని సమాధానం చెప్పాలో కావేరికి అర్థం కాలేదు.

"సమాధానం ఏంచెప్పాలో తెలియట్లేదు కదూ? " మృదువుగానే అడుగుతూ కావేరి వైపు తిరిగింది పరిమళాదేవి.

కావేరిలో అదే తడబాటు.

"పోనీ... బాగా ఆస్తిపాస్తులు వున్న, బాగా చదువుకున్న ఒక అందమైన అబ్బాయి నిన్ను కట్నం లేకుండా పెళ్ళిచేసుకునేందుకు ముందుకు వచ్చాడు. అప్పుడు మీ అమ్మావాళ్ళు నీ అభిప్రాయాలకీ ఇష్టాలకీ విలువ ఇవ్వడం మర్చిపోయి, నిన్ను కోరివచ్చిన ఆ రెండో అబ్బాయికే నిన్ను ఇచ్చి పెళ్ళిచేయాలని బలవంతం చేశారనుకో! అప్పుడు నువ్వేం చేస్తావు? " కావేరి వైపుగా నెమ్మదిగా అడుగుతూ వచ్చింది పరిమళాదేవి.

కావేరి నుండి ఎప్పట్లా తడబాటే తప్ప మరో సమాధానమే లేదు.

"కట్నకానుకల విషయంలో 'ఆదర్శం' కనబర్చకపోయినా,, మంచితనాన్ని ప్రదర్శిస్తున్నారనే చెప్పవచ్చు అందుకే ఏదో కొంత డబ్బు వాళ్ళ ఖర్చులకు అడిగారు. ఇక మిగతా డబ్బు నీ పేరుమీదే వుంటుంది! ఇదంతా ఏమైనా ప్రేమవివాహాలు చిల్లిగవ్వను ఆశించకూడదు. కాని ఆశించారు. ఇందుకు పేదవాళ్ళు అనుకుందామా అంటే డబ్బు కష్టమంటూ తెలియనివాళ్ళే! ఆర్థిక పరిస్థితి మెరుగ్గా వుండి కూడా డబ్బుకు ఆశపడటం నిజంగా ధనదాహం!" అంటూ వచ్చి తిరిగి కావేరి పక్కలో కూర్చుని, "మరి ఇట్లాంటి పరిస్థితిలో నీవు ఊహించని ఒక సంఘటన జరిగిపోయింది అనుకో! ఏంటంటే.. కొద్దోగొప్పో డబ్బు ఆశించినవారల్లా, పెళ్ళి దగ్గరకి వచ్చేసరికి ఎక్కువ డబ్బును డిమాండ్ చేస్తారు. అప్పుడు నువ్వేం చేస్తావు?

వాళ్ళు అడిగినంత డబ్బును ఇవ్వాల్సిందే అంటావా లేక నీ ప్రేమికుడి ద్వారా వాళ్ళ పెద్దలకి నచ్చజెప్పే ప్రయత్నం చేస్తావా? అసలేం చేస్తావమ్మా? " అడుగుతూ కావేరి భుజంపై చేయివేసింది పరిమళాదేవి.

"అమ్మమ్మా! మీరు ఇట్లాంటి ప్రశ్నలు అడిగితే నేనేం సమాధానం చెప్పగలను? " కావేరి పరిస్థితి వలలో చిక్కుకున్న పావురాయిలా తయారయింది.

"నేను నిన్ను ఇబ్బంది పెట్టడం లేదు బేటా! సమాధానాలు తెలిస్తేనే చెప్పమంటున్నాను" చిన్నగా నవ్వింది పరిమళా దేవి.

"నాకు తెలియదు" ఏడుపు ముఖంతో చెప్పింది కావేరి.

పరిమళాదేవి ఇంకేం మాట్లాడలేదు. కావేరివైపు కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా చూసి, ఆ తర్వాత పడకమీదనుండి లేచి ఎదురుగా వున్న టేబుల్ దగ్గరకి నడిచి, దానిమీద వున్న టెడ్డీబేర్‌ను తీసుకువచ్చి కావేరికి అందించింది.

ప్రశ్నార్థకంగా చూసింది కావేరి.

"నేను నిన్ను ఇంకేం ప్రశ్నలు అడగనులే! తీసుకో" పరిమళాదేవిలో పరిపూర్ణమైన వాత్సల్యం.

అలాగే చూస్తూ టెడ్డీబేర్‌ను నెమ్మదిగా తన చేతుల్లోకి తీసుకుంది కావేరి.

"నీకు ఆ బొమ్మను ఎందుకు ఇచ్చానో అర్థమయ్యిందా? " అడిగింది పరిమళా దేవి.

తల అడ్డంగా ఆడించింది కావేరి.

పరిమళాదేవి వెంటనే సమాధానం జెప్పలేదు. జొన్నరొట్టె ఓ రెండుముక్కలు తిన్న తర్వాత నెమ్మదిగా చెప్పింది.

"మరేంలేదు. నీ చేతిలో ఆ బొమ్మలాగే నువ్వు ఎవరి చేతిలోనూ బొమ్మవు కాకూడదని నా ఉద్దేశ్యం"

ఇందుకు కావేరి ఏమనుకుందో ఏమో గాని, పరిమళాదేవివైపు అర్థంకానట్టుగా చూసింది.



"ఏంది అమ్మగారూ ఇట్టా వొచ్చారు? " అనూహ్యంగా తమ ఇంటికి వచ్చిన పరిమళాదేవిని చూడగానే, మంచంమీదినుండి చప్పున లేచి నిల్చున్నాడు కురుమూర్తి.

"రావాలి అనుకున్నాను. అందుకే వచ్చాను" చెప్తూ ఆమె కొట్టంలోకి వస్తుంటేనే, ఆమె కూర్చోవాలి అన్నట్టుగా వినయంగా మంచం దులిపాడు అతడు.

అదే సమయంలో లోపల్నుంచి వెలుపలికి వచ్చి "దండాలు అమ్మగారూ" రాగానే గౌరవంగా చేతులు జోడించింది రాధమ్మ.

"రామలక్ష్మి కనబడ్డంలేదు? " అడుగుతూ మంచంమీద కూర్చుంది పరిమళాదేవి.

సమాధానం చెప్పేందుకు ఇబ్బందిగా కదిలారు భార్యాభర్తలు ఇద్దరూనూ.

"ఏరా? " సమాధానం చెప్పండి అన్నట్లుగా అంది పరిమళాదేవి.

"అదే... అమ్మగారూ, సత్తెనారంరెడ్డి పత్తితోట పెట్టినాడు గదా" అంతమాత్రం అతికష్టంగా చెప్పగలిగాడు కురుమూర్తి.

"పత్తిచేనుకి కూలీ పంపించారు!" సమాధానాన్ని సరిచేసింది పరిమళాదేవి.

"ఆ..."




"ఆ..."

భార్యాభర్తలు ఇద్దరిలోనూ తడబాటు.

"ఈమాట మాట్లాడ్డానికి సిగ్గులేదట్రా? నేను ఏం చెప్పాను? అమ్మాయిని చదివించి ప్రయోజకురాలిని చేయండి అని చెప్పాను. కాని మీరేం చేస్తున్నారు? హాయిగా అమ్మాయిని కూలికి పంపిస్తున్నారు! ఆ వచ్చే ఇరవై రూపాయలు మీ జీవితగతిని మార్చేస్తాయా లేక అమ్మాయి జీవితాన్ని బాగుచేస్తాయా?

రోజూ వచ్చే ఆ ఇరవైరూపాయలు మీ చిన్నచిన్న అవసరాల్ని కొంతవరకు తీరుస్తున్నాయే గానీ రోజు రోజుకి అమ్మాయి జీవితం ఎంతగా నాశనం అయిపోతుంది అనేది మీరు గుర్తించడం లేదు.

ఇన్నిరోజులూ గుర్తించకపోయినా ఫర్వాలేదుగాని, ఇకమీదట మీరు గుర్తెరిగి బతకాలి! అర్థమయ్యిందా? మొగుడు, పెళ్ళాల్ని ఇద్దర్నీ చూస్తూ మాట్లాడింది పరిమళాదేవి.

వాళ్ళిద్దరూ కనీసంగా నోరు కూడా మెదపలేకపోయారు.

"మాలాంటోళ్లకు చదువెందుకు అనే ఆలోచన గాని, పై చదువులకోసం. అయ్యే ఖర్చుల్ని ఎలా భరించుకోవాలి అనే భయం గాని మీలో కించిత్ కూడా వుండకూడదు. అన్నింటికీ నేను వున్నాను" అభయం అందించింది పరిమళాదేవి.

"మీరు కర్సులు పెట్టుకుంటారేమోగాని, మీరు అనుకున్నట్టుగా అది గొప్ప సదువులు సదవాలిగదా! సదివాకా దానికిమల్లే గొప్పగా సదివినోడినే పెనిమిటిగా తీసుకురావాలి గదా!" మెల్లగా అన్నాడు కురుమూర్తి.

"ఆ భయం మీకు అక్కర్లేదు! అన్నింటికీ నేను వున్నాను అని చెప్పాక కూడా, మీరు అనవసరపు ఆలోచనలు పెట్టుకుని మనసుల్ని పాడుచేసుకోరాదు" అంది పరిమళాదేవి.

"దానికి సదువులో తెలివి గొప్పగా లేదు. ఒట్టి మొద్దుముండ! అందుకే తమరు కొద్దిగా ఆలోచించి పైసలు కర్సుపెట్టుకుంటే మంచిదని" రాధమ్మ కల్పించుకుంది.

"పోనీలే! అనుకున్నట్టుగా గొప్ప చదువులు చదవకపోయినా, కనీసం ఏడోక్లాసువరకు చదివినా ఫర్వాలేదు కదా!" అంది పరిమళాదేవి.

"అదిగాదు అమ్మగారూ" తల గోకాడు కురుమూర్తి.

"మరేంట్రా? " అడిగింది పరిమళాదేవి.

"ఆ సదువుకి అయ్యే కర్సులు ఏవో, పెద్ద మనుసు సేసుకుని మీరు ఇప్పుడే ముట్ట జెప్తే... మంచి వొరుడ్ని జూసి పిల్ల పెండ్లి జేసుకుంటాం! పిల్లను సదివించాలన్న ఆసలు మాకు లేవు. సదివితే ఉజ్జోగం వొచ్చి బాగుపడ్తుందనే నమ్మకం కూడా మాకులేదు. ఆడపిల్ల ఎన్నిరోజులకయినా అంట్లు తోముకోవాల్సిందే! మరి, వొంటింట్ల వుండాల్సిన పిల్లను ఆడా మొగా తేడాల్లేకుండా కల్సివుండే ఇస్కూల్లకు తోలించడం ఎందుకు? అసలే కాలాలు మంచిగ లేవు. వయసొచ్చిన ఆడదాన్ని జూస్తే ఎవడికి కన్నుకుడుతుందో ఏమో? " చెప్పలేక చెప్పుకుపోయాడు కురుమూర్తి.

"ఇంకా పాతకాలంలోనే వున్నావట్రా నువ్వు? " అతడు మాట్లాడ్డం అలా పూర్తయ్యిందో లేదో, ఇలా అడిగింది పరిమళాదేవి.

"ఏది పాతకాలమో, ఏది కొత్తకాలమో మాకు తెల్వదు అమ్మగారూ! ఈ కాలాల్ని జూస్తుంటే ఆడపిల్లను బయటకి పంపించాలంటేనే వొణుకు పుట్టుకొస్తుంది" ఈసారి రాధమ్మ అంది.

"పత్తిచేల్లోకి వెళ్తే మగవాసనలు వుండవట్రా? " అడిగింది పరిమళాదేవి.

"వుంటాయి అమ్మగారూ!" అన్నాడు కురుమూర్తి.

"మరి? " అపోజిషన్ లాయర్‌లా చూసింది పరిమళాదేవి.

"అది ఎప్పటికీ పత్తిసేల్లోకి ఎళ్లదుగదా



అమ్మగారూ! ఈ ఏడో లేదా వచ్చేఏడో దాన్ని ఒక ఇంటిదాన్ని సేసి పంపిస్తే, ఇగ ఎటువంటి బెదురు వుండదు.

నిజ్జం సెప్పాలంటే... ఒక తండ్రికి బిడ్డగా వున్నప్పుడు మాత్రమే ఆడపిల్లకు మాన భయం వుంటుంది. కాని అదే మొగుడికి పెండ్లాంగా భయపడాల్సిన అవసరంలేదు. అదేంటో అమ్మగారూ... ఆడపిల్ల మొగుడి నీడలోకి ఎళ్ళిందంటే సాలు, అంతవరకూ కొరకొర సూసిన కొంగరినాయాళ్ళంతా తోకలు ముడుసుకుంటారు! ఇది నిజ్జంగా ఎంత సిత్రం గదా అమ్మగారూ!" అని కురుమూర్తి అంటుంటేనే రాధమ్మ మధ్యలోనే అందుకుంటూ.

"అందుకే పిల్లకు తొరగా పెండ్లిజేస్తే బాగుంటుంది అనుకుంటున్నాం అమ్మగారూ" అంది.

"అవును అమ్మగారూ! పెండ్లితోనే ఆడపిల్లకు రచ్చన వొస్తుంది" ఆ వెంటనే అన్నాడు కురుమూర్తి.

పరిమళాదేవికి వాళ్ళ మాటలు వింటుంటే తల తిరిగిపోసాగింది. ఎక్కడో ఏమూలో ఆవేశం కూడా పొంగిపొర్లింది. తోడుగా ఎదలోతుల్ని కలచివేస్తున్న బాధాతరంగాలు.

"తమరేం సెప్పినా ఇంతవరకూ కాదనలేదు. మీ ఉప్పు తిని బతికెటోళ్లం కాబట్టి, తమరు తిట్టినా కొట్టినా మాకు సంతోషమే! మా అమ్మ గూడా తమరిమాటే మాట్లాడుతోంది. కాని మా బిడ్డ యిసయంలో కన్నతల్లి మాటను గూడా నేను గౌరయించలేకపోతున్నాను. అందుకే ఈ ప్యాదోడ్ని సెమించండి అమ్మగారూ!" పరిమళాదేవి పాదాల్ని పట్టుకోబోయాడు కురుమూర్తి.

"వద్దురా" అతడు తన పాదాల్ని తాకక మునుపే వారించింది పరిమళాదేవి.

"తమరి మాట కాదంటున్నందుకు మా గుండెలనిండా బాధ వుంది. అమ్మగారూ తమరు కూడా బాధపడుతున్నారని మాకు తెలుసు! తమర్ని బాధపెట్టి మేము సంతోషంగా వుండలేం. అందుకే... మమ్మల్ని అర్థంచేసుకుని, పెద్దమనసుతో మా బిడ్డ పెండ్లిని దగ్గరుండి జరిపించండి అమ్మగారూ!

తమరు కాదని వెళ్తే మేము ఓర్సుకోలేము! తమరు మా యింటి దైవం! తమరికి మామీద కోపంగా వుంటే మాకు ఏదైనా సిచ్చవేయండి. సంతోషంగా బరించుకుంటాం! ఇంతేగాని తమరు బాధపడుతూ ఎళ్లిపోతే మాత్రం మేము బరించుకోలేం అమ్మగారూ" కాళ్ళావేళ్ళా పడసాగాడు కురుమూర్తి.

ఆ దంపతులు ఇద్దర్నీ నిశితంగా చూసింది పరిమళాదేవి.

వాళ్ళు ఆమెవైపే చూస్తున్నారు. వాళ్ళ చూపుల్లో దీనత్వం స్పష్టంగా కనబడుతోంది.

"తరతరాలుగా అట్టడుగు జాతులు బానిసత్వానికి పెద్దపీట వేసుకుంటున్నాయి. కొందరిలో ఇప్పుడిప్పుడు మార్పు వస్తోంది. చాలామందిలో మాత్రం మార్పు అనేది ఏ మాత్రం కనబడటంలేదు! ఇలాంటి వాళ్ళకు మరో ఉదాహరణ మీరు! మిమ్మల్ని ఇక బలవంతపెట్టను. మీలోని మూర్ఖత్వం చాలా భయంకరమైనది. దాన్ని విడగొట్టడం నావల్ల సాధ్యంకాదు అన్పిస్తోంది!

'ఆడపిల్లకు పెళ్ళితో రక్షణ వస్తుంది' అనుకుంటున్నారే గాని, ఆమె అభివృద్ధిని గురించి కనీసంగా కూడా మీరు ఆలోచించడం లేదు. మీలాంటి పాతభావాలు వున్న తల్లిదండ్రులు వున్నంత కాలం, రామలక్ష్మి లాంటి అమ్మాయిలు అన్యాయంగా బలైపోవాల్సిందేనేమో?

ఏం చేస్తాం? మీలాంటి వాళ్లను నాగరిక ప్రపంచానికి పరిచయం చేసి, మిమ్మల్ని సైతం నాగరికులుగా మార్చడం అనేది నా ఒక్కదానివల్ల అయ్యే పనికాదు!" అంటూ మంచంమీదనుండి లేచి నిల్చుంది పరిమళా

దేవి.

ఆ దంపతులు కూడా ఆమెతోపాటుగా నెమ్మదిగా లేచి నిల్చున్నారు.

"సరేలేరా! మీ ఇష్టప్రకారమే కానివ్వండి!" లేని చిరునవ్వుని పెదిమలమీద పులుము కుని చెప్పింది పరిమళాదేవి.

"అమ్మగారూ..." ఆ దంపతుల కళ్లల్లోనే కాదు, మాట తీరులోనూ ఆనందం వెల్లివిరి సింది.

మన అమ్మగారు నిజ్జంగా లచ్చిందేవత! కాళ్లుకడిగి తలమీద పోసుకున్నా రుణం తీర్చుకోలేము" పరిమళాదేవి వెళ్ళినవైపుగా చూస్తూ మనఃస్ఫూర్తిగా అంది రాధమ్మ.

"అవునే" కురుమూర్తి గొంతులోనూ కృత జ్ఞతాభావం.

★ ★ ★

"నాన్నమ్మా! మరీ ఇంత విశాలహృద యంతో మెలగడం అనేది పనికిరాదేమో అన్పిస్తుంది! నీతి, న్యాయం, మంచితనం, ఒకప్పుడు బాగా పనికివచ్చేవి. కాని ఇప్పుడు వాటికి కాలం చెల్లిపోయింది. ఇప్పుడు కేవలం నీ స్వార్థం గురించే నీవు ఆలోచిం చాలి! ఎదుటివాళ్ళ గురించి కూడా ఆలో చించు. కాని ఎదుటివాళ్ళకు మంచి చేయా లని మాత్రం ఆలోచించవద్దు. ఎందుకంటే మంచివాళ్ళకు ఈ సమాజంలో స్థానంలేదు. నీనుంచి మంచిని స్వీకరించి, నీకు చెడును అందింఛేవాళ్లు ఇప్పుడు ఎక్కువైపోయారు. అలాంటివాళ్ళల్లో మన చిన్న నాన్నమ్మ వాళ్ళు ఒకరు! దయచేసి వాళ్ళ గురించి పెద్దగా పట్టించుకోవద్దు" సూటిగా స్థిరంగా చెప్పుకుపోయాడు పరిమళాదేవి మనవడు శశాంక.

"వేలెడు లేవు. ఇంత పెద్ద మాటలు మాట్లాడావేంట్రా? " మనవడి తీరుకి పరిమ ళాదేవి ఆశ్చర్యపోయింది.

"పెద్దమాటలు కాదు, నీకు తెలియని పెద్ద సత్యాలు" అన్నాడు శశాంక.

"చదువుతున్నది పదవతరగతి. అప్పుడే పెద్దపెద్ద సత్యాల్ని తెలుసుకున్నావా కన్నా? " మనవడి బుగ్గలు పిండింది పరిమ ళాదేవి.

"నామీద చూపించే ఇట్లాంటి ప్రేమనే ఎదుటివాళ్ళ మీద కూడా చూపిస్తూ అదేదో మహా మానవత అనుకుంటున్నావు. కాని ఎదుటివాళ్ళు నీ మంచితనాన్ని క్యాష్ చేసుకుని తమ పబ్బం గడుపుకోవాలనుకుం టున్నారు. ముందు ఈ సంగతి తెలుసుకో" పరిమళాదేవి చేతుల్ని తననుండి విసురుగా దూరం జరిపాడు శశాంక.

ఈసారి నోటమాట మరిచి మనవడివైపు ఆశ్చర్యంగా నోరు తెరిచి చూస్తుండిపో యింది పరిమళాదేవి.

"ఎప్పుడూ ఇలా మాట్లాడని నా మన వడు, ఈసారి కొత్తగా మాట్లాడుతున్నాడు ఎందుకు? అని ఆశ్చర్యపోతున్నావు కదూ?"

అని కాసేసాగి "చూడు నాన్నమ్మా! నువ్వొట్టి పిచ్చిదానివి! ఇన్నాళ్ళూ నీ పిచ్చిత నాన్ని నేను పెద్దగా పట్టించుకోలేదు. ఎందు కంటే ఇన్నాళ్లవరకూ నీవు ఏంచేసినా అది కరెక్టు అని భావిస్తూ వచ్చాను. కాని ఇప్పుడు నాకు లోకం తెల్సింది. నీ చాద స్తాన్ని, మూర్ఖత్వాన్ని, ఇక మీదట అంగీక రించను!" శశాంక గొంతు ఖచ్చితంగా పలి కింది.

"నువ్వు నువ్వే నట్రా? " మనవడ్ని అలాగే చూస్తూ నెమ్మదిగా అడిగింది పరి మళాదేవి.

"నేను నేనే! కాపోతే ఇన్నాళ్ళమాదిరిగా నీ ఒడిలో పడుకుని ఆడుకునే శంశాకని కాదు"

"మరి? " కళ్ళింత చేసింది.

"నేను పెద్దవాడ్ని అయిపోయాను. నేనే నీకు ఇప్పుడు బుద్ధిచెప్పాల్సివస్తుంది! అనవ సరంగా కాదు, ఆలోచించే!" నిజంగానే పెద్ద వాడై పోయినట్టుగా అన్నాడు.

"ఆహా!? " మరింత ఆశ్చర్యపోతూ మన వడ్ని నిలువెత్తున పరిశీలనగా చూసింది పరిమళాదేవి.



దృఢమైన శరీరంతో, భారీగా పెరిగి వయసుకి మించి కనబడుతున్నాడు శశాంక. అదే విషయాన్ని ప్రస్తావిస్తూ "శరీరం పెరిగినంత మాత్రాన పెద్దవాడివి అయిపోయినట్టేనా?" మురిపెంగా అడిగింది పరిమళాదేవి.

"నాన్నమ్మా! చమత్కారాలకు ఇది సమయంకాదు" ముఖాన్ని ముడుచుకుంటూ అన్నాడు శశాంక.

"అదేంట్రా! కోపమా?" ప్రేమగా నవ్వింది పరిమళాదేవి.

"నీ ధోరణి నీదేకానీ, నా బాధను నువ్వు అర్థం చేసుకోలేవా?" విసురుగా అడుగుతూ రెండుమూడు అడుగుల్ని విసురుగానే ముందుకు వేశాడు శశాంక.

"నీలో నాకు బాధ కనబడ్డంలేదు. అమాయకత్వం కనబడుతోంది" మనవడ్ని వెనక నుండి కొండంత అనురాగంతో చూస్తూ అంది పరిమళాదేవి.

అతడు మరేం మాట్లాడలేదు. ముఖాన్ని మాడ్చుకుని ఎదురుగా ఉన్న కిటికీలోంచి బయటకు చూస్తూ నిలబడిపోయాడు.

"నూనూగుమీసాలు రాగానే నూరేళ్ళ వయసు వచ్చినట్టుగా, పెద్దపెద్ద మాటలు మాట్లాడ్తున్నాడు బంగారుతండ్రి. ఏం చేయాలో ఏమో?" తనలో తను అనుకున్నట్లుగా అంటూ, అక్కడే అల్మారాలో చెల్లాచెదురుగా పడివున్న పుస్తకాల్ని పొందికగా సర్దసాగింది పరిమళాదేవి.

కొన్నిక్షణాలు అలాగే మౌనంగా నిల్చుని, ఆ తర్వాత తిరిగిచూస్తూ మళ్ళీ పెదవి విప్పాడు.

"నాన్నమ్మా! మన చిన్న నానమ్మావాళ్ళూ పరాయివాళ్ళుకాదు. కానీ వాళ్ళతీరు నాకు నెగిటివ్‌గా కన్పించింది. కాబట్టి ఎంత మన వాళ్ళయినప్పటికీ వాళ్ళతో జాగ్రత్తగా వుండడమే బెటరని నేను భావిస్తున్నాను"

"వచ్చి రెండుగంటలు కూడా కాలేదు. అప్పుడే వాళ్ళలో నీకు నెగటివ్ తీరు కనిపించిందట్రా?" పుస్తకాలు సర్దుతూనే అని, తర్వాత మనవడివైపు తిరిగ్గా చూస్తూ "ఇక రెండ్రోజుల్లో వాళ్ళతో మాట్లాడకపోవడమే మంచిదని చెప్తావేమో అని అనుమానంగా వుంది. అసలు వాళ్ళలో ఏం గమనించి ఇలా మాట్లాడుతున్నావు?" అనడిగింది.

"ఏమీ గమనించలేదు"

"మరి ఎందుకు ఇలా మాట్లాడుతున్నావు?"

"వాళ్ళు నాకు నచ్చలేదు"

"ఏ విషయంలో?"

"వాళ్ళు స్వార్థపరులు"

"అని ఎలా చెప్పగలవు?"

"చెప్పినా నువ్వు అర్థం చేసుకోలేవు నానమ్మా"

"అదేంట్రా?"

"అవును నానమ్మా! వాళ్ళను నువ్వు అర్థం చేసుకోలేకపోతున్నావు. అమ్మమ్మావాళ్ళూ మాత్రం అర్థం చేసుకున్నారు" శశాంక ఈ మాట అనగానే పరిమళాదేవి కనుబొమలు అప్రయత్నంగా ముడిపడ్డాయి.

అదేమీ పట్టించుకోనట్లుగా ముఖం తిప్పుకుని కిటికీకి సమీపంగా వెళ్తూ, "వాళ్ళు నిన్ను నిలువునా దోచేయాలని చూస్తున్నారు. నీలో అణువణువునా నిండివున్న ఆత్మీయతాభావాన్ని వాళ్ళు తెలివిగా కేష్ చేసుకోవాలనుకుంటున్నారు. వాళ్ళు మహా అవకాశవాదులు. ఈ విషయం అమ్మమ్మావాళ్ళద్వారా తెలిశాక, మునుపటిలా వాళ్ళతో మాట్లాడాలనిపించడంలేదు" ఆవేశంగా చెప్పుకుపోయాడు శశాంక.

"అర్థమయ్యిందిరా" నిండుగా అంది పరిమళాదేవి.

తిరిగి చూశాడు శశాంక. అతడి కళ్ళలో ఏదో ఆసక్తి అస్పష్టంగా కనబడుతోంది.

"వాళ్ళు మహా అవకాశవాదులు?" గంభీరంగా అని, "ఎంత బాగా చెప్పావురా?" చిన్నగా నవ్వింది పరిమళాదేవి.

"బాగా చెప్పానో, చెప్పలేదో అనవసరం





గానీ, ముందు నీకు అర్థమయ్యిందో లేదో చెప్తే బాగుంటుంది" అనూహ్యంగా శశాంక గొంతులో నిష్టూరం.

"తెలుసుకోవాలని ఆసక్తిగా వుందా? " అతడి మనసును చదివినట్లుగా అంది.

"అఫ్‌కోర్స్" అన్నాడు శశాంక.

"కొద్దోగొప్పో మాత్రమే అక్షరజ్ఞానం తెలిసినదాన్ని కాబట్టి నువ్వు మాట్లాడే అన్ని ఇంగ్లీషు మాటలు నాకు అర్థంకావురా!" అంది పరిమళాదేవి.

అతడు ఏదో అనబోయాడు. అంతలోనే మళ్ళీ కల్పించుకుంటూ, "చూడు నాన్నా! జీవితం గురించి, మనుషుల గురించి, మానవసంబంధాల గురించి నీకు పెద్దగా అవగాహనలేదు. అవగాహన, తెల్సుకునే వయసు నీకు రాలేదు. అయినా చెప్తున్నానురా... ఎప్పుడైనా కానీ చెప్పుడుమాటలు చెడుపు చేస్తాయి. ఎదుటిమనిషి పొరపాటు చేయకపోయినా చేసిన భావాన్ని మనలో కలిగించి ఇరువురి మధ్య వున్న అనుబంధాన్ని దారుణంగా దెబ్బతీస్తాయి. కాబట్టి ఏ విషయాన్నైనాగానీ వాస్తవంగా చూసి, ఆ తర్వాతే మంచిచెడుల్ని నిర్ణయించుకోవాలి" సౌమ్యంగా చెప్పుకుపోయింది పరిమళాదేవి.

"అంటే...? చెప్పుడు మాటలకి నేను లొంగిపోయాను అనేకదా నీ ఉద్దేశ్యం? " అన్నాడు శశాంక.

"నాకు అర్థమయింది అదేరా" అంది పరిమళాదేవి.

శశాంక ఇంకేం మాట్లాడలేదు. ముఖాన్ని ముడుచుకుని అక్కడ్నుంచి విసవిసా వెళ్ళిపోయాడు.

"బాబూ శశీ" వెళ్తున్న శశాంక చేయిని పట్టుకుంటూ వారింపుగా అంది పరిమళాదేవి.

గంటుమొహంతో చూశాడు శశాంక.

"కోపం వచ్చిందా? " ప్రేమగా అడిగింది.

అతడు అలాగే చూస్తున్నాడు.

"బంగారుతండ్రి అలిగినా అందమే" అంటూ తన రెండు చేతుల్తో మనవడి కణతల్ని నిమిరి, తర్వాత చేతుల్ని తన కణతలకు ఆన్చుకుంది పరిమళాదేవి.

అతడు మౌనంగానే వుండిపోయాడు.

"సరేలేరా! నువ్వు చెప్పినట్లుగా చిన్ననానమ్మావాళ్ళతో మాత్రమే కాదు, ఈ సమాజం అందరితోనూ ఇకనుంచి జాగ్రత్తగా మెలుగుతాను" బుజ్జగింపుగా చెప్పింది పరిమళాదేవి.

"నాకు నమ్మకంలేదు" అన్నాడు శశాంక.

"నీకంటే ఈ ప్రపంచంలో నాకు ఇంకెవ్వరున్నారు? నేను చేసే ప్రతిపనీ నీకోసమే అయినపుడు, అసలు నేను బతికేదే నీకోసం అయినపుడు నువ్వు చెప్పినట్టుగా నడుచుకోడానికి నాకెందుకురా అభ్యంతరం? " అంటూనే మనవడి చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని మృదువుగా చుంబించింది.

అంతలోనే బయటినుండి బుచ్చమ్మ గొంతు హడావిడిగా వినిపించింది.

"అమ్మగోరూ... అమ్మగోరూ... బయట కారు ఆగివున్నాది. సెసిబాబుగారు వచ్చినారా ఏందీ? "

"ఆ... శశిబాబే వచ్చాడు" బుచ్చమ్మ లోపలికి రాకమునుపే బయటకు చూస్తూ చెప్పింది పరిమళాదేవి.

"యాడవున్నాడు ఏందీ? " ఆత్రంగా లోపలికి వచ్చింది బుచ్చమ్మ.

"ఏం ముసలమ్మా బావున్నావా? " బుచ్చమ్మను చూడగానే అడిగాడు శశాంక. ఆ తీరు నిర్లక్ష్యంగా వుంది.

"తమరి దయవల్ల నేను ఎప్పుడూ సల్లగానే వుంటానుగానీ, తమరు బాగున్నారు కదా బాబుగోరూ? " కళ్ళల్లో కొండంత అనురాగాన్ని నింపుకుని అడిగింది బుచ్చమ్మ.

"చూస్తూనే వున్నావుగా" చటుక్కున అన్నాడు శశాంక.

ఆ మాటకు బేలగా చూసింది బుచ్చమ్మ.

"అదేంట్రా? నువ్వడిగిన మాటనే తను



అడిగింది. అందుకు వేళాకోళం దేనికి? " మనవడి ముఖంలోకి ఆశ్చర్యంగా చూసింది పరిమళాదేవి.

"ఏదో ముసల్ది కదా అని అడిగాను. అంతమాత్రానికి సెంటిమెంటల్ డైలాగ్స్ మాట్లాడ్తే నాకు చిర్రెత్తుకురాదూ? " అన్నాడు శశాంక్.

"ఆ పొగరే వద్దంటాను" అని పరిమళా దేవి అంటుండగా బుచ్చమ్మ మధ్యలోనే అందుకుంటూ, "బాబుగోరు సిన్నప్పట్నుంచి ఇట్టాగే మాట్లాడ్తారుకదా! బాబుగోరు ఎట్టా మాట్లాడినా ముచ్చటగానే వుంటుంది. ఇట్టాంటప్పుడు తమరికీ కోపం రాకూడదు. నాకూ బాధ కలగకూడదు..." నిండు హృదయంతో అంది బుచ్చమ్మ.

"సర్లేగానీ, పొలందగ్గర ఎలావుంది? " మాట మార్చింది పరిమళాదేవి.

"అంతా బాగుంది అమ్మగోరూ! కాపోతే యేరుసెనగ పంటని అడివిపందులు అక్కడక్కడా తొవ్వుతున్నాయి. కరెంటు బెట్టకపోతే వున్నపంటను నాశనం చేసేస్తాయి

"ఇంక వంకాయ తోటలో దొంగలు పడ్డట్టుగా అనుమానం వచ్చింది. ఎందుకంటే రెండురోజుల్లకిందట పిందెలుగా వున్న కాయలు ఇయ్యాల కన్పించలేదు. ఇంకా వరి సేనులో తుంగ మొలిసింది. రెండ్రోజుల్లో బెరికించకుంటే పంట సేతికిరాదు" బుచ్చమ్మ చెప్పుకుపోతుంటే అసహనంగా తలపట్టుకుంటూ,

"బుచ్చమ్మా..." అన్నాడు శశాంక.

ఎందుకన్నట్టుగా పరిమళాదేవి, బుచ్చమ్మ ఇద్దరూ చూశారు.

"ఏంటి నాన్నమ్మా? ఈ ముసల్దాన్ని నువ్వు ఎలా భరిస్తున్నావు? మాట్లాడే పద్ధతే తెలీదు. ఇక పని ఎలా సక్రమంగా చేస్తుంది?

"పొలం దగ్గర ఎలావుందని నువ్వు అడిగితే తను ఏమంది? అంతా బాగానేవుంది అని అంది. తీరా ఏం చెప్తోంది? అన్నీ నెగటివ్ టాక్సే! ప్చ్... ఏం మనిషో ఏమో? " ఇద్దరివైపూ చూస్తూ మాట్లాడాడు శశాంక.

"ఏందో బాబుగోరూ! నేను అట్టాగే మాట్లాడ్తాను" తలగోకింది బుచ్చమ్మ.

"మాట్లాడావు సరేగానీ, పొలంనుండి వచ్చావుగా, చెమటవాసన వస్తోంది, స్నానం చేసిరా పో" చెప్పాడు శశాంక.

"అట్లాగే బాబుగోరూ" అంటూ అక్కడ్నుంచి వెళ్ళిపోయింది బుచ్చమ్మ.

"మనిషికి సమాజంలో గౌరవం పెరిగేది డబ్బువల్ల కాదురా! మంచితనంవల్ల!" బుచ్చమ్మ వెళ్ళిపోగానే అంది పరిమళాదేవి.

"యూ మీన్...! నేను చెడ్డవాడినా? " అన్నాడు శశాంక.

"అలా అని కాదురా! నువ్వు మంచివాడివే. కానీ నీకు మాట్లాడే పద్ధతి తెలియదు. దురుసుగా మాట్లాడ్తావు. ఈ తీరు ఎదుటి వాళ్ళకు చెడ్డవాడివనే భ్రమను కలిగిస్తుంది" చెప్పింది పరిమళాదేవి.

"చెడ్డపనులు చేస్తేనే చెడ్డవాళ్ళు అవుతారుగానీ, మాటలు మాట్లాడ్డంవల్ల చెడ్డవాళ్ళు కాలేరు" అన్నాడు శశాంక.

"పిచ్చినాన్నా! ఒక దెబ్బను మర్చిపోతారేమోగానీ, ఒక మాటను ఎవ్వరూ మర్చిపోలేరు. అందుకే మాటలు సవ్యంగా వుండాలి. మాటలు సవ్యత తప్పితే నీవు సహజంగా మంచివాడవైనా, బయటి ప్రపంచానికి మాత్రం చెడ్డవాడిగానే కనబడతావు" అంది పరిమళాదేవి.

"స్కూలు టీచర్లు చెప్పే నీతివాక్యాలే మా తలల్ని వాయగొడుతున్నాయి. ఇక ఇంట్లో కూడా వాయగొట్టొద్దే" శశాంక తీరులో అసహనం.

"ప్చ్! పూర్తిగా చేతికి అందకుండా తయారైపోయావు. మీ అమ్మమ్మవాళ్ళ గారాబం నిన్ను ఇలా మార్చేసింది. నువ్వొగనుక ఇక్కడే వుండివుంటే నీ పొగరంతా అణిచేదాన్ని" దూరంగా వున్న శశాంక అమ్మమ్మ వాళ్ళమీద కోప్పడుతూ అంది పరిమళాదేవి.




"పొగరు అణచడానికి ఎప్పుడూ ఇక్కడే వుండాల్సిన అవసరంలేదు. హాలిడేస్ వున్నప్పుడల్లా వస్తూనే వున్నానుగా! మరి అప్పుడు అణచేయ్ నా పొగరు" తమాషాగా అన్నాడు శశాంక.

"ఏడాదికి ఒకసారి వసంతం అన్నట్టుగా వచ్చివెళ్తావు. ఈ ఎడారి జీవితానికి నువ్విచ్చిన సమయం మహాప్రసాదం. మరి ఇట్లాంటప్పుడు నిన్ను ఎలా భయపెట్టగలను? ఏదో ఇలా బుద్ధిమాటలు చెప్పడం తప్ప" అంది పరిమళాదేవి.

"ఆ బుద్ధిమాటలు సైతం నాకు గడ్డిపోచలే" నాన్నమ్మని వెక్కిరించాడు శశాంక.

"వెక్కిరించావులేగానీ ఎప్పుడు వచ్చినా నీ మేనకోడళ్ళకోసం ఏవో ఒక కానుకలు తీసుకొచ్చేవాడివి. మరి ఈసారి ఏం తీసుకువచ్చావురా? " అనడిగింది.

"ప్చ..." ఏంలేదు అన్నట్లుగా అన్నాడు.

"అదేంట్రా? "

"తీసుకురావాలి అన్పించలేదు"

"అదే ఎందుకు? "

"ఛానెల్లో ప్రోగ్రామ్స్ అన్నీ చూశాక, ఇదే ఛానెల్ అని అడిగారట అవతలివూర్లో ఎవరో. ఇప్పుడు నువ్వు కూడా అలాగే వున్నావు"

"సరే... సరే... ఇప్పుడు వాళ్ళమీద నీకు కోపం పెరిగిపోయింది కదూ! మరిచిపోయాను"

"... ... ..."

"పదరా! వచ్చింది మొదలు ఈ గదిలోనే వుండిపోయాం, అలా మేడమీదకు వెళ్దాం"

"ఓకే.." అంటూ వెలుపలికి నడిచాడు శశాంక. వెంటే నడిచింది పరిమళాదేవి.

"బ్యూటిఫుల్ నేచర్" మేడమీదకి వెళ్ళాక చుట్టూ ప్రకృతిని చూస్తూ మెచ్చుకోలుగా అన్నాడు శశాంక.

"హైద్రాబాద్‌లో ఇట్లాంటి వాతావరణం అసలు దొరకదురా"తనూ ప్రకృతిని చూస్తూనే అడిగింది పరిమళాదేవి.

"పల్లె, పట్నం... రెండూ అందమైనవే. కానీ పల్లెసీమకు సౌకుమార్యమైన సౌందర్యం వుంటుంది. పట్నానికి వన్నెచిన్నెల సౌందర్యం వుంటుంది. ఇది సహజ అందం. అది పూత పూసిన అందం" అన్నాడు శశాంక.

"ఎంత బాగా మాట్లాడావురా? ఇంకా మాట్లాడూ" మురిసిపోయింది పరిమళాదేవి.

"ఏం మాట్లాడాలి? " అంటూ గాలికి చెదురుతున్న జుత్తుని తన రెండు చేతుల్తో వెనక్కి తోసుకుంటూ నెమ్మదిగా ముందుకు అడుగులు వేస్తూ "ఇక్కడి మనుషులు అనుబంధాలకి విలువ ఇస్తారు. అక్కడి మనుషులు అనుబంధాలు వద్దనుకుంటారు. ఎందుకంటే వాళ్ళల్లో చాలామంది చాలీచాలని జీతాలతో బతుకులు ఈడుస్తున్నారు. అట్లాంటప్పుడు వాళ్ళు కూడా అనుబంధాలు గట్రా అంటూ పోతే, వచ్చిపోయే అతిధులు కొంపని గుల్లచేస్తారు మరి" అన్నాడు శశాంక.

వెంటే వెళ్తున్న పరిమళాదేవి మృదువుగా నవ్వింది.

"నిజం నాన్నమ్మా! నీలాంటి సహృదయత అస్సలు పనికిరాదు. ఇక్కడ నీ మంచితనాన్ని ఆ చిన్న నాన్నమ్మవాళ్ళు మాత్రమే షేర్ చేసుకోవాలనుకుంటున్నారు. కానీ అక్కడమాత్రం నీలాంటివాళ్ళని అడ్డమైనవాళ్ళంతా షేర్ చేసుకోవాలనుకుంటారు.

ఒక పూట తిండి ఉచితంగా దొరికితేనే కిలో బియ్యం మిగిలాయి అనుకునే మహా బిజినెస్ మైండ్స్ వాళ్ళవి. కానీ నువ్వేమో ఇక్కడ కిలోలు కిలోలు దానధర్మాలు చేస్తుంటావు. మొత్తానికి ఇక్కడ అన్నివిధాలా బాగుంటుంది. ఇంతమాత్రానికి ఇక్కడ మోసగాళ్ళు వుండరు అని కాదు, ఫర్ ఎగ్జాంపుల్ చిన్ననాన్నమ్మ వాళ్ళు వుండనే వున్నారు కదా

"కాకపోతే అక్కడ జరిగేవి అన్నిరకాల

మోసాలు. ఇక్కడ జరిగేవి కొన్నిరకాల మోసాలు" చెప్పుకుపోయాడు శశాంక.

"నువ్వు నిజంగా ఎంత మారిపోయా వురా! ఎప్పుడు వచ్చినా ఇలాంటి చక్కని మాటలు మాట్లాడలేదు. ఇంతక్రితంలా విచిత్ర ప్రవర్తన కూడా కనబడలేదు అనుకో! ఏదోలే... ఆ తీరు గురించి వదిలిపెడితే, నీవు ఇంత బాగా మాట్లాడ్తున్నందుకు నా గుండెలనిండా తృప్తిగా వుందిరా! ఎందు కంటే... ఇలా వాస్తవం మాట్లాడ్డం అనేది మీ నాన్న లక్షణం" చివరిమాటల్ని భారంగా పలికింది పరిమళాదేవి.

"మిగతావి అమ్మ లక్షణాలా? " కావాలని అన్నాడు శశాంక.

"ఛ... ఛా... మీ అమ్మలో అస్సలు పొగరు వుండేదికాదు. అణువణువు వెది కినా మంచితనమే కనబడేది. తల్లిదండ్రుల్లో కనిపించని విపరీత లక్షణం నీలో కనబ డింది. అంటే, అది నీ సహజబుద్ధేరా" అంది పరిమళాదేవి.

"ఆ... నాన్నమ్మా! ఇందాకట్నుంచి అడు గుదామని మర్చిపోయాను. ఏంటంటే... నువ్వు ఇంతక్రితం అన్నావు చూడూ... సమాజంలో గౌరవం అనేది మంచితనం వల్ల కలుగుతుంది అని. కానీ ఈ మాటను నేను ఒప్పుకోను" కచ్చితంగా అన్నాడు శశాంక.

"ఎందుకు ఒప్పుకోవు? "

"మంచితనం గౌరవానికి హేతువు. అఫ్ కోర్స్! నువ్వు నిజంగా మంచిదానివి. ఈ వూరంతా నిన్ను గౌరవిస్తారు. గౌరవం అనేది ఉపకారాన్ని నిర్దేశిస్తుంది. కాబట్టి నాకు తెల్సినంతవరకూ ఈ వూరివాళ్ళంతా నీ మేలును కోరుకునేవారే! కానీ స్వయానా నీ చెల్లెలి కుటుంబం ఏం కోరుకుంటోంది? నీ పతనాన్ని కోరుకుంటోంది. మరి మంచి తనానికి గౌరవం లభిస్తుందని గ్యారంటీగా ఎలా చెప్పగలవు? అందుకే నాన్నమ్మా... గౌరవానికి మంచితనం ఒక్కటే పనిచే యదు. డబ్బు కూడా కావాలి. అప్పుడు నీలో మంచితనం లేకపోయినా ఈ సమాజం నీకు గులాం చేస్తుంది. ఎలా అంటే..."

"నీలో మంచితనం వుంది, తోడుగా డబ్బు వుంది. అందుకే ఈ మనుషులు నిన్ను మోతాదుకి మించి గౌరవిస్తున్నారు. అయితే అందరిదీ స్వచ్ఛమైన గౌరవం కాదు. కొందరిది నటన! ఎందుకంటే... డబ్బువల్ల ఎదుటివాళ్లకు కొద్దోగొప్పో సహా యపడుతున్నావు. ఈ కాలం మనుషులకి డబ్బు సహాయం అందించేవాళ్లే దేవుళ్ళు! మాట సహాయానికి ఒకప్పుడు మాత్రమే బాగా విలువ వుండేది. ఆ విలువ ఇప్పుడు పతనస్థాయిలో కొనసాగుతోంది. నువ్వేమో ఇంకా పాతమాటలే మాట్లాడ్తుంటావు" సుదీ ర్ఘంగా మాట్లాడుతూ పోయాడు శశాంక.

విచిత్రంగా చూస్తూ నెమ్మదిగా ఆగిపో యింది పరిమళాదేవి.

"ఏం నాన్నమ్మా? " తిరిగిచూస్తూ చిరున వ్వుగా అడిగాడు శశాంక.

"ఇన్ని మాటలు ఎలా నేర్చుకున్నావురా? "

"ఏమో? "

"జీవితంపట్ల ఎంతో అవగాహన వున్న ట్టుగా మాట్లాడుతున్నావు"

"ఏమో? "

"నువ్వు ఇలా మాట్లాడుతుంటే నాకు నువ్వు కన్పించడంలేదురా! స్వయానా నా కన్నకొడుకే కనిపిస్తున్నాడు" గుండెలు పొంగినట్టుగా అంది పరిమళాదేవి.

"పూర్ గ్రాండ్‌మా! మనిషి ఎప్పుడూ కూడా పాజిటివ్ పంథాలో మాత్రమే కాదు, నెగటివ్ పంథాలో కూడా ఆలోచించాలి. అసలు ఈ కలియుగంలో... సారీ బై మిస్టేక్... ఈ కంప్యూటర్ యుగంలో మనుషులు కూడా యంత్రాలైపోయారు. కీబోర్డు కంప్యూటర్‌ని నడిపించినట్టుగా, స్వార్థం ఈ మనుషుల్ని ఆడిస్తోంది. కాబట్టి మన ఆలోచనలు, మన మంచితనం, మన




ప్రయత్నాలు అన్నీ మనస్వార్థం కోసమే వుండాలి తప్ప ఎదుటివాళ్లకోసం కాదు. అండర్‌స్టాండ్‌మీ" అలాగే మాట్లాడుతూ వెళ్ళి ఒక పక్కగా వేసివున్న కుర్చీలో కూర్చున్నాడు శశాంక.

"నీలో మంచితెలివి వుంది కాని, ఆ తెలివికి కొద్దిగా తెగులు వుందిరా" అంతా విన్నాక అంటూ వెళ్లి తనూ ఒక కుర్చీలో కూర్చుంది పరిమళాదేవి.



శశాంక వచ్చినందుకు ఆ ఇంట్లో ప్రత్యేకత సంతరించుకుంది. నిత్యం భిన్నమైన వంటకాలు వండటం సహజమే అయినప్పటికీ, ఆరోజు మరింత విభిన్నతను సంతరించుకున్నాయి వంటలు.

కుందేలు కూర, నీటిబాతు వేపుడు, పులావు, ఎక్కువ మొత్తంలో వండటం జరిగింది. ఎందుకంటే శశాంక వచ్చిన ప్రతిసారీ మొదటిరోజున జానకీదేవి కుటుంబం మొత్తంగా ఇక్కడే భోంచేస్తుంది. ఆ తర్వాత అడపాదడపా అన్నట్టుగా శశాంక వెళ్లేవరకు భోజన ఏర్పాట్లు ఇక్కడే వుంటాయి.

ఆరోజు రాత్రి ఎనిమిది గంటలకు అందరూ డైనింగ్ టేబుల్ ముంధు కూర్చున్నారు. బుచ్చమ్మే అందరికీ వడ్డించింది. అందుకు శకుంతల సహాయంగా వుండి వడ్డన పూర్తికాగానే అందరిలో ఒకరిగా తనూ కూర్చుంది. బుచ్చమ్మ మాత్రం ఒకపక్కగా నిల్చుండిపోయి అందరి అవసరాల్ని గమనిస్తోంది.

"శశాంక పూర్తిగా మారిపోయాడు" తింటూ అన్నాడు సూర్యప్రకాష్‌రావు.

"ఎందుకు తాతయ్యా? " అడిగాడు. శశాంక.

"మునుపటిలా నీలో కలివిడిలేదు" కల్పించుకుంది శకుంతల.

"అవును" దరువేసింది జానకీదేవి.

"నిజమే! బావకి టెంపర్ పెరిగిపోయింది" ఆరిందలా అంది కస్తూరి.

"కాదు, సిన్సియారిటి పెరిగిపోయింది" కావేరి అందుకుంది.

"ఎంతయినా పెద్దవాడు అవుతున్నాడు కదా? " నెమ్మదిగా అన్నాడు వరప్రసాద్.

"అవుతున్నాడు కాదు, అయిపోయాడు. అందుకే అలా ఎవ్వరితో ఎక్కువగా మాట్లాడకుండా గంభీరంగా వుండాలనుకుంటున్నాడు" అందరి మాటలు విన్న తరువాత మనవడివైపు చూస్తూ మెల్లగా అంది పరిమళాదేవి.

"వుండాలనుకుంటున్నాడు కాదు, వున్నాడు" మళ్ళీ సూర్యప్రకాష్‌రావు కల్పించుకున్నాడు.

శశాంక ఇక పెదవి విప్పలేదు. అసలు ఎవ్వరివైపూ చూడ్డంలేదు కూడా.

"అవునా శశీ? " కావాలని కదిపింది పరిమళాదేవి.

"..."

"ఏయ్ నిన్నేరా? "

"నాన్నమ్మా! అనవసరంగా విసిగించొద్దు" అంటూ పరిమళాదేవివైపు చూశాడు శశాంక.

"ఈ మాత్రానికే విసిగించినట్టా? " మురిపెంగా అంది పరిమళాదేవి.

"నాన్నమ్మా! నువ్వు ఇలాగే మాట్లాడితే నేను భోంచేయకుండా వెళ్ళిపోతా" భయపెట్టాడు శశాంక.

"వద్దు... వద్దు..." గాభరాపడింది పరిమళాదేవి.

శశాంక మళ్ళీ మౌనమైపోయాడు. పరిమళాదేవి మాత్రం మనవడివైపు అనురాగపూర్వకంగా చూస్తోంది. మిగతా అందరూ కూడా శశాంకవైపే చూస్తున్నారు. కానీ వాళ్ళవదనాల్లో వున్నది అనురాగమూ కాదు, అభిమానమూ కాదు, అదోవిధమైన ఆశ్చర్యం!

★ ★ ★

"వాడు కలివిడి మనిషి! ఎప్పుడు వచ్చినా నవ్వుతూ నవ్విస్తూ అందరితో సరదాగా గడిపేవాడు. అలాంటిది ఈ మారు ఇంత ముభావంగా కనిపిస్తున్నాడంటే అందుకు బలమైన కారణం ఏదో ఒకటి వుండే తీరుతుంది" శశాంక విషయం ఒక అంతర్జాతీయ సమస్య అయినట్టుగా అంది జానకీదేవి.

అందుకు పరిమళాదేవి నుండి మరో మాట రాకమునుపే "అసలు వాడు ఎక్స్‌ప్రెస్ బస్సులాటి వాడు. అట్లాటివాడు హఠాత్తుగా ఇంత మౌనం అయ్యాడంటే దీన్ని ఎంతమాత్రం నిర్లక్ష్యం చేయకూడదు" మళ్ళీ అంది జానకీదేవి.

"వూ..." వింటూ వూకొట్టింది పరిమళాదేవి. ఆమె ముఖంలో సమస్య తెచ్చిపెట్టిన భాషకందని భావాలు స్పష్టంగా కనబడుతున్నాయి.

"పైగా వాడి మాటతీరులో కూడా మార్పొచ్చింది. వాడు ఎప్పుడైనా నిన్ను ఖాతరుచేయనట్టుగా మాట్లాడాడా? లేదు! కాని ఈసారి మాట్లాడాడు. అంటే వాడిలో వచ్చింది మామూలు మార్పు కాదు, భయంకరమైన మార్పు! దీన్ని ఎంతమాత్రం నిర్లక్ష్యం చేయకూడదు" అంది జానకీదేవి.

"ఇందుకు ఏం చేయాలి?" అడిగింది పరిమళాదేవి.

"అమాయకంగా అడుగుతావేం పెద్దమ్మా? వాడిలో ఈ మార్పుకి కారణం ఏమిటి అనేది ముందుగా ఆలోచించాలి. ఆ తర్వాత ఆ కారణాన్ని వాడినుండి దూరం చేయడానికి ప్రయత్నించాలి" అందుకుంది శకుంతల.

"ప్చ్" నిట్టూర్చింది పరిమళాదేవి.

"అసాధ్యం అనుకుంటున్నావా?" అడిగింది జానకీదేవి.

"అది కాదే..." అంది పరిమళాదేవి.

"మరి?"

కుర్చీలోంచి కాసింత ముందుకు జరిగింది పరిమళాదేవి.

"వాడిలో మార్పు రావడానికి కారణం పరిస్థితులు కాదు. వాడి స్వభావమే వాడ్ని ఆ విధంగా మార్చేసింది" అని పరిమళాదేవి అంటుంటేనే జానకీదేవి అందుకుంటూ "స్వభావంలో తేడా అనేది పరిస్థితుల కారణంగానే వస్తుందక్కా" అంది.

"చెప్పేవరకు వినవే" అంది పరిమళాదేవి.

"ఆ! వింటాను" అంది జానకీదేవి.

"వాడిలోని పూర్తి మార్పును మీరింకా గమనించలేదు. వాడిలో మొదలయ్యింది కేవలం ముభావం, అలక్ష్యం, మాత్రమే కాదు! ప్రేమరాహిత్యం కూడా! అందుకే నాకు భయంగా వుంది. ఈ భయం కారణంగా ఏమీ తోచడంలేదు. వాడు పరాయివాడై పోతున్నాడేమో అన్న బెంగతో కంటికి కునుకు కూడా రావడంలేదు" తనలోని భయాన్ని నిజాయితీగా బయల్పరిచింది పరిమళాదేవి.

అయితే ఆమె మాటలు ఎదురుగా కూర్చుని వున్న ఆ తల్లీకూతుళ్ళకి అనుకూలంగా కనిపించాయి కాబోలు, అనూహ్యంగా వాళ్ళ కళ్ళల్లో భాషకందని ఏవో సంతృప్తి భావనలు!

పరిమళాదేవి చూపులు మాత్రం నేలను చూస్తున్నాయి. ఆ చూపుల్లో మరో కొత్త




బాధ! పరిమళాదేవిని ఆ స్థితిలో చూడగానే తల్లీకూతుళ్లు ఇద్దరూ ఒకరి ముఖంలోకి ఒకరు చూసుకున్నారు. ఆ తీరులో స్పష్టంగా కనబడుతున్న కుటిలత్వం!

"అక్కా" అనునయంగా పిలిచింది జానకీదేవి.

తలెత్తి చూసింది పరిమళాదేవి.

"బాధపడుతూ కూర్చోవడంవల్ల సమస్యకు పరిష్కారం దొరకదు. బాధను పక్కకుపెట్టి కాస్త ఆలోచించాలి" అంది జానకీదేవి.

"ఆ! అమ్మ మాట కరెక్టు" దరువేసింది శకుంతల. పరిమళాదేవి ఏం మాట్లాడలేదు. శశాంక గురించే ఆలోచిస్తూ కూర్చుంది. ఆమె దృష్టిలో అందరూ తనవాళ్లే. అయితే శశాంకలో కొత్తగా కనిపిస్తున్న ప్రవర్తన ఆమెలో కలవరాన్ని రేపుతూ, "ఆత్మీయుల మధ్య దూరం పెరుగుతుందేమో" అన్న భయంతో కూడిన సందేహాన్ని కల్గిగిస్తోంది. ఎందుకంటే... అప్పటికి శశాంక తీరు అందరికీ అర్థమైపోయింది.

అంతలోనే బయటినుండి వచ్చాడు శశాంక. అతడిలో అలసట స్పష్టంగా కనిపిస్తోంది. అతడి చేతిలో షటిల్ బ్యాట్ వుంది. తెల్లని జుబ్బా పైజామా ధరించి అలసిన బాలచంద్రుడిలా కనిపిస్తున్న అతడి విగ్రహం అక్కడున్న ఎవ్వర్నీ లక్ష్యపెట్టకుండా నేరుగా లోపలివైపుగా కదిలింది.

"షటిల్ ఆడి వస్తున్నట్టున్నాడు! ఈ పల్లెటూరిలో ఎవరెవరు కలిసి ఆడారేంటీ?" వెళ్తున్న శశాంకను చూస్తూ అంది శకుంతల.

"ఆవాల రాంచంద్రారెడ్డి కొడుకు కూడా హైద్రాబాద్ నుండి వచ్చాడు కదా! అక్కడ వీళ్ళిద్దరూ ఒకే కాలేజిలో చదువుకుంటున్నారంట" సమాధానంగా అంది పరిమళాదేవి.

అప్పటికి శశాంక లోపలికి వెళ్ళిపోయాడు పూర్తిగా.

"వీడి పౌరుషం కూలా..." శశాంక తీరుకి ముక్కుమీద వేలేసుకుంది జానకీదేవి.

"ఈ పౌరుషపు గాయానికి మా పెద్దమ్మ మంచి చికిత్సనే అందిస్తుందిలే" చిరునవ్వుగా అంది శకుంతల.

అందుకు పరిమళాదేవి కూడా చిన్నగా నవ్వి "చిన్నప్పటి శశాంకకి ఇప్పటి శశాంకకి అస్సలు పొంతనే లేదు. బుజ్జి తండ్రి! మందు పెట్టినట్టుగా మారిపోయాడు. అయినా ఇది మార్పు కాదు, వయసు పెరుగుతుంది కదా... ఆ తాలూకు ఒక రకమైన భేషజం" మురిపాలు చిందించినట్టుగా అంది.

అంతలోనే లోపల్నుంచి శశాంక గొంతు వినిపించింది.

"నాన్నమ్మా..."

"ఆ వస్తున్నాను కన్నా..." అంటూనే లేచి నిల్చుని "వాడి చిన్న అవసరానికి కూడా ఈ నాన్నమ్మ కావాల్సిందే" గొంతునిండా ప్రేమను నింపుకుని అని, ఆ తరువాత అదే ప్రేమతో వడివడిగా లోపలికి నడిచింది పరిమళాదేవి.

"వాళ్లతో ఏం మాట్లాడుతున్నావు?" పరిమళాదేవి రాగానే అడిగాడు శశాంక. ఆ అడగడంలో అదో పెడసరం.

"నీకు మతిగాని తప్పిందా?" స్వరం తగ్గించి కోపంగా అడిగింది పరిమళాదేవి.

"నాకు తప్పలేదు నీకే తప్పింది. అందుకే వాళ్ళను గుడ్డిగా నమ్ముతూ, ఎండుగడ్డిని చూసి బంగారపుకడ్డీ అనుకుంటున్నావు" మాటను ఎంత ఆవేశంగా అన్నాడో జుబ్బాని కూడా అంతే ఆవేశంగా వదిలాడు శశాంక.

ఆమె సామరస్యంగా ఏదో అనబోయింది. అంతలోపే మళ్ళీ అందుకుంటూ "పిచ్చినాన్నమ్మా! నీకు జీవితంలో అనుభవం వుంది కాని, ఆ అనుభవం నీకు ఇంతమాత్రం బుద్ధి నేర్పలేదు. అందుకే ఇంత అమాయకంగా ప్రవర్తిస్తున్నావు. నీకు తెల్సింది 'మంచితనం' ఒక్కటే. ఇదే నీలోని పొరపాటు" అన్నాడు అతడు.

"మెల్లగా... మెల్లగా..." ఆమె గొంతులో ఏదో భయం.

"వాళ్లు వింటారని భయపడుతున్నావా? " టవల్ తీసుకుని భుజాన వేసుకుంటూ అన్నాడు.

"వింటే బాగుండదు"

"ఎందుకు బాగుండదు? "

"ఇలాంటి యక్షప్రశ్నలే వద్దంటాను"

"యక్షప్రశ్నలు కాదు. నాక్కోపంవస్తే యక్షతిట్లు తిడతాను. నిన్ను ఒక్కతినేకాదు, వాళ్ళను కూడా"

"ప్చ్! నీ ఇష్టంరా" ఆమెలో అసహాయత.

"నా ఇష్టమే గెలవాలి మరి! ఎందుకంటే ఇది నా ఇల్లు. ఇదంతా నా ఆస్తి. ఇక్కడ జరిగే ప్రతి పనీ నా అనుమతి ప్రకారమే జరగాలి. లేదంటే నాక్కోపం వస్తుంది" చెప్పి ఆ వెంటనే అక్కడ్నుంచి విసవిసా బాత్‌రూమ్‌వైపు వెళ్ళిపోయాడు శశాంక.

"నిన్ను ఎలా మార్చాలో ఏమో? " వెళ్తున్న మనవడి వైపు భావరహితంగా చూస్తూ మనసులోనే అనుకుంది పరిమళాదేవి.

★ ★ ★

కస్తూరి, కావేరి తప్ప జానకీదేవి కుటుంబం మొత్తంగా పెరట్లో కూర్చుని వుంది.

"ఆ పిల్లాడిలో మార్పు రావడం మన మంచికోసమే అనుకోవాలి. ఎందుకంటే... ఇటు ఆ ముసల్దాన్ని, అటు ఆ కుర్రకుంకని, మన పిడికిళ్ళలో బంధించుకుని మన ఇష్టా రాజ్యంగా ఆడుకోవచ్చు" జానకీదేవి మాట ల్లోనే కాదు, ముఖంలోనూ వికృతమైన ఆనందం.

"అవును! ఆ కుర్రకుంక మీద ఈ ముస ల్దానికి, ఈ ముసల్దాని మీద ఆ కుర్రకుంకకి, నూరిపోయాల్సిన మాటల్ని మెత్తగా నూరిపోద్దాం. మెత్తగా అంటే... "తిట్టకురా గాడిదకొడకా" అన్నట్టుగా కాకుండా, "ఎవ్వరి దగ్గర వాళ్ళకు అనుకూలంగా మాట్లాడి, వాళ్ళ మనసుల్లోకి మన మాటల్ని స్లో పా యిజన్ మాదిరిగా ఎక్కించాలి. ఇక కొన్నా ళ్లకి వాళ్ళ అనుబంధం హుష్‌కాకి అవు తుంది" సూర్యప్రకాష్‌రావు మాటల్లోనూ వికృతమైన ఆనందమే.

"ఇన్నాళ్లూ వాళ్ళ అనుబంధాన్ని చూసి భయపడ్డాం. అయస్కాంతం, ఇనుపము క్కల్లా వుండే వాళ్ళ ప్రేమలో ఇక ఎడబాటు ఆరంభమైంది. కాబట్టి ఇప్పుడు భయపడా ల్సిన అవసరం లేదు. నిజానికి ఆ కుర్రాడు మనతో ముభావంగా వుండటం అనేది పట్టించుకోనవసరంలేని విషయం. కాని నాన్నమ్మ అంటేనే పడిచచ్చేవాడల్లా చిర్రుబు ర్రులాడుతున్నాడు. ఇది మాత్రం పట్టించుకో వాల్సిన విషయం" మెరుస్తున్న కళ్ళతో అంది శకుంతల.

"ఈ మాటలేవో కాస్త మెల్లగా మాట్లా డండి. లేదంటే ఇంట్లోకి వెళ్ళి మాట్లాడు కోండి. ఎందుకంటే... అసలే అర్ధరాత్రి ఈ నిశ్శబ్దానికి చిన్నశబ్దమైనా సరే ఆమడ దూరం వినబడుతుంది" ముగ్గురి మాటల్ని విన్న తర్వాత తీరిగ్గా అన్నాడు వరప్రసాద్.

"తెలివి తప్పిన మాటలు మాట్లాడొద్దు. ఆ మాత్రం తెలివి మాకూ వుంది. కాటుక నల్లగా వుంటుందని చెప్పినట్టుగా అర్ధరాత్రి నిశ్శబ్దంగా వుంటుందని నువ్వు మాకేం ప్రత్యేకంగా చెప్పక్కర్లేదు. అదిగో... అవ తల వీధిలో బోర్‌వెల్ వేస్తున్న శబ్దం. ఈ శబ్దానికి మనం మాట్లాడిన ఒక్కమాట కూడా వేరేవాళ్ళు వినడానికి ఆస్కారం వుండదు" దెప్పిపొడపుగా భర్త ముఖంలోకి చూస్తూ అంది శకుంతల.

"అబ్బబ్బా! మీ గొడవే పెద్దదైపోయే ట్టుంది" విసుక్కున్నాడు సూర్యప్రకాష్‌రావు.

దాంతో భార్యాభర్తలు ఇద్దరూ మౌనమై పోయారు. "రేపు ఎలాగూ మన కస్తూరి పుట్టినరోజు. ఆ కుర్రగాడిద రాకపోయినా అడుక్కుని రప్పిద్దాం. ఆ తర్వాత సౌమ్యంగా ఆప్యాయంగా వాడ్ని మనదారిలోకి తెచ్చు కునే ప్రయత్నం చేద్దాం" మళ్ళీ అసలు విష





యానికి వస్తూ సూచన అందించింది జానకీదేవి.

"ఇక ఇట్లాంటి విషయాల్ని బయట కూర్చుని మాట్లాడ్డం ఎంతమాత్రం మంచిది కాదు" అన్నాడు సూర్యప్రకాష్‌రావు.

"మనం ఏమైనా ప్రత్యేకంగా "ఫలానా" మాటల కోసం పనిగట్టుకుని కూర్చున్నామా? ఏదో ఉబుసుపోక మాట్లాడుకుంటూ ఆ సందర్భంలోకి వెళ్ళాం అంతే గదా!" అంది శకుంతల.

"అంతేగాని టైం పన్నెండు దాటింది. వెళ్ళి పడుకుందామా? " తన చేతిగడియారం చూసుకుంటూ అన్నాడు సూర్యప్రకాష్‌రావు.

"నిద్రొస్తోంది కూడా" ఆవులిస్తూ లేచి నిల్చుంది జానకీదేవి.

ఆ వెంటనే ఒకరి తర్వాత ఒకరు లేచి నిల్చుని, వరప్రసాద్ మినహా మిగతావాళ్ళు లోపలికి నడిచారు. అతడు మాత్రం కాసేపు ఏదో ఆలోచించినట్లుగా నిల్చుని, ఆ తర్వాత వేసివున్న కుర్చీల్ని ఎత్తి అక్కడే ఒక పక్కగా పెట్టేసి, నెమ్మదిగా సిగరెట్టు వెలిగించుకున్నాడు.

అతడికి గతం గుర్తొచ్చింది. ఆ గతం తాలూకు జ్ఞాపకాల వలయంలోంచి విషాదపు సెగలు ఉవ్వెత్తున ఎగిసిపడ్డాయి.

"గా...డ్..." అతడి ప్రమేయం లేకుండా అతడి పెదిమలు నెమ్మదిగా విడివడ్డాయి. ఆ తర్వాత జ్ఞాపకాల సెగలు వేడిని విస్తృతం చేశాయి కాబోలు, తల విదిలిస్తూ వెళ్ళి బోర్‌వెల్ తాలూకు సిమెంట్ చప్టా మీద కూర్చున్నాడు అతడు.

సరిగ్గా దశాబ్దం క్రితం...

స్నేహితుడి చెల్లెలి వివాహార్థమై కరీంనగర్ వెళ్ళాడు తను. అతను బాల్యస్నేహితుడే కాదు ప్రాణస్నేహితుడు కూడా. కాబట్టి పెళ్ళికి వారంరోజులు ముందుగానే వెళ్ళి మరో వారంరోజులవరకు ముఖ్య కార్యదర్శిగా అక్కడే వుండిపోయాడు.

శుభంగా పెళ్ళి జరిపించి, ఆ తాలూకు తృప్తిని గుండెలనిండా పొదుపుకుని, ఎంతో ఆనందంగా ఇంటికి వచ్చాడు. రాగానే తృప్తి... ఆనందం... అన్నీ పటాపంచలైపోయాయి. భరించరాని వాస్తవం కళ్లముందు భగ్గున మండుతూ కనిపించింది.

పరిమళాదేవి చెట్టంత కొడుకు, కోడలు, రోడ్డు ప్రమాదంలో మరణించి వూరువూరునే విషణ్ణం చేశారు.

"దేవుడు ఇంత అన్యాయం చేస్తాడనుకోలేదమ్మా. పుణ్యమంటూ తిరుపతికి వెళ్తుంటే ఆ భగవంతుడు పాపిరూపంలో ఎదురొచ్చాడు. వాడి గుడిలో మన్నుబడా... నన్ను తీసుకెళ్ళిపోకూడదా? నేను ఏం పాపం చేశానని నాకు ఇంత పెద్ద శిక్ష విధించాడు. వద్దమ్మా... నాకీ జీవితం వద్దు..." పరిమళాదేవి శోకం అందరి హృదయాల్ని కదిలిస్తోంది.

"అయ్యో పాపం" అంటూ జాలిగా వచ్చిన వాళ్ళు సైతం, ఆమెను చూడగానే తామూ కన్నీరు కారుస్తున్నారు.

పరిచితులు, అపరిచితులు, అందరి వదనాల్లోనూ విషాదం గూడుకట్టుకుని వుండగా... అందరి మధ్య భగ్నమైన తపస్సులా భార్యాభర్తల శవాలు నిస్తేజంగా పడుకునివున్నాయి.

మొదట్నుంచీ వాళ్ళ కుటుంబానికి బాగా పేరుంది. తోడుగా పరిమళాదేవి కొడుకు రఘుబాబు సంపాదించుకున్న పేరు గొప్పగా వుంది. అందుకే పక్కటౌన్‌నుండే కాదు, ఆ చుట్టుపక్కల వూర్లనుండి కూడా తెలిసినవాళ్ళు అనేకులు పెద్దఎత్తున తరలివచ్చారు.

అధికారులు, అనధికారులు, రాజకీయనాయకులు, పేరున్న పెద్ద మనుషులు, అనామకులు అందరూ కలిసి ఆ వూరిని జనారణ్యంగా మార్చేశారు.

అంతా చూస్తూ తను నిర్వికారంగా మారిపోయాడు. తన భార్య శకుంతల, అత్తామామలు, పరిమళాదేవితో సమానంగా ఏడుస్తు



న్నారు. బుచ్చమ్మ ఒకవైపు ఏడుస్తూనే మరోవైపు పరిమళాదేవిని ఓదారుస్తోంది. అయితే ఉన్నట్టుండి పరిమళాదేవి సొమ్మ సిల్లి పడిపోయింది.

ఆ స్థితిలో ఆమెను చూడగానే గుండెప గిలి చనిపోయిందేమో అనుకున్నాడు తను. కనీసం కొడుకూ కోడలి అంత్యక్రియల్ని కూడా నిర్వహించే వీలులేకుండా ఆమె 'కోమా'లోకెళ్ళిపోయిందని తెల్సినప్పుడు, ఆమె ఇక బతకదనే నిర్ధారించుకున్నాడు కూడా!

అదేమాటను ఒకరోజు రాత్రి తన భార్యతో అన్నాడు. "శకుంతలా! మీ పెద్దమ్మ బతకదనిపిస్తోంది"

"మనక్కావల్సింది అదేకదా?" చాలా సులువుగా అనేసింది ఆమె.

ఆ తీరుకు తను ఉలిక్కిపడగానే, ఆమె తనని మృదువుగా వాటేసుకుంటూ, "నా పిచ్చి మొగుడా! నీకు అసలు విషయం తెలియదు కాబట్టే నీలో బాధ కనపడుతోంది. తెలిస్తే మాత్రం నీ బాధంతా కరిగిపోతుంది" మారాం చేస్తూ చెప్పింది.

తను అర్థం కానట్టుగా చూశాడు.

"వాడు గనుక బతికి వుంటే మరో ఏడాదికి లక్షలకి లక్షలు సంపాదించేవాడు. అది మనకు గిట్టదుకదా! పోనీలే ఈర్ష్య మాని పోటీ పడుదామనుకున్నా, తమరు తినడానికే తప్ప తెలివి ఉపయోగించి సంపాదించలేరు. కాబట్టి కనీసంగా వాళ్ళ ఆస్తిని మొత్తంగా కొట్టేస్తే, కారు... బంగళా... పని వాళ్ళు... గౌరవమర్యాదలు... అనే మన కోరికలు నెరవేరుతాయి అన్పించింది. అదే విషయాన్ని అమ్మావాళ్ళతో చెప్పేశాను. నా ఆలోచన వాళ్ళకి బాగా నచ్చింది. అందుకే వెంటనే ఆచరణలో పెట్టేశా" మెరుస్తున్న కళ్ళతో తన కళ్ళల్లోకి చూస్తూ రహస్యంగా చెప్పింది.

అప్పటికి తనకు చెమటలు పట్టేశాయి.





తనని ఆమె గమనించిందో లేదో తెలీదు గాని, భయంకరమైన ఆనందాన్ని మాత్రం తనతో పంచుకుంటూనే వుంది.

"వాడు పెళ్లాంతో కలిసి తిరుపతి ప్రయాణం అయ్యాడు. అంటే దేవుడు మనకు సహకరించాడన్నమాట! కాపోతే ఒక్క విషయంలో బాధపడాల్సివస్తోంది. ఎందుకంటే ఆ కుర్రకుంకని వెంట తీసుకెళ్ళ లేదు వాళ్ళు. తీసుకువెళ్తారనే అనుకున్నాము. కాని మన దురదృష్టంకొద్దీ వాడికి అదే సమయంలో అనుకోకుండా జ్వరం. దీంతో ఎందుకైనా మంచిదని ఈ ముసల్దానితో వాడ్ని వుంచేసి ఆలుమగలు ఇద్దరే తిరుపతి వెళ్ళారు. నిజంగా ఎంత దురదృష్టంకదూ?"

"శ...కుం...త...లా?" అప్రయత్నంగా పిలిచాడు తను.

"ఏంటీ?" అంది ఆమె.

"యాక్సిడెంట్ ఎవరు చేశారు?" వణుకుతున్న కంఠంతో అడిగాడు.

"ఏంటీ అంతగా కంగారుపడిపోతున్నావు? రక్తసంబంధం వున్నదాన్ని, నాకు లేని కంగారు తమరికి అవసరం లేదనుకుంటాను" అంటూ తన బుగ్గల్ని నిమిరి- "వాళ్ళను ఈ లోకంలోనుండి తప్పించడానికి పదిహేనువేలు ఖర్చు అయ్యాయి. పక్కటౌన్‌లో ఎద్దుమాంసం అమ్ముతాడే కమల్‌హుస్సేన్? వాడి కొడుకు జాంగీర్‌గాడు వున్నాడు చూడూ వాడే మన ఆయుధం" మరీ రహస్యంగా చెప్పింది ఆమె.

"వాడు ఇలాంటి పనులు కూడా చేస్తాడా?" అడుగుతున్నాడే గాని, అప్పటికే తన తల తిరిగిపోయింది.

"అల్లర చిల్లర వెధవే అనుకోవద్దు. వాడు గుండెలు తీసిన బంటు కూడా! మనం ఇచ్చిన డబ్బు తీసుకుని అప్పుడే బొంబాయి వెళ్ళిపోయాడు. ఎందుకంటే అక్కడ తను ఒక గ్యాంగుని ఏర్పర్చుకోవాలనేది వాడి చిరకాల కోరికట"

తను ఇంకేం మాట్లాడలేదు. జీర్ణించుకో

లేని మాటలు మనసుని, మెదడుని, స్తంభింపజేస్తుంటే అక్కడే నిశ్శబ్దంగా కూర్చుండిపోయాడు.

"తమరు ఇంకా ఏం చేస్తున్నట్టు? " అతడి ఆలోచనల్ని భంగపరుస్తూ అంతలో శకుంతల గొంతు వినబడింది.

అతడు ఉలికిపాటుగా చూశాడు.

"ఈ సమయంలో సిగరెట్టు ఒక్కటే తక్కువయింది తమరికి" పెడసరంగా అంది.

"వస్తున్నాను" అంటూనే సిగరెట్టు నలిపి గిరాటేశాడు అతడు.

"వచ్చావు సర్లేగాని ఏమాలోచిస్తున్నావు? " ఆరా తీస్తున్నట్టుగా అడిగింది.

"ఏంలేదే" అన్నాడతడు.

"ఇంట్లోకి రండి. మీతో ఒక విషయం మాట్లాడాలి" అంటూ లోపలికి నడిచిందామె.

ఏంటన్నట్టుగా చూస్తూ వెనకే నడిచాడు అతడు.

నా మాటల్ని బాగా మెదడుకి ఎక్కించుకోండి!" అని కాసేపాగి, "అసలు చెప్పాలంటే శశాంక అలాంటిలాంటి మనిషి కాదు. అవసరం అయితే మనల్ని ఎవ్వర్నీ లెక్కచేయడు కూడా! అందుకే వాడ్ని ఆ ముసల్దానికి శాశ్వతంగా దూరం చేసేస్తే మనకు ఇక ఎదురు అనేదే వుండదు" అంటూనే చిటికేసింది శకుంతల.

"అంటే? " కనుబొమ్మలు ముడిచాడు అతడు. అందుకు వంకరగా ఓ చిరునవ్వు నవ్వి- "ఆ ముసల్దానికి వాడిమీద మనసు విరిగిపోవాలనుకున్నాం! ఇందుకు మన పిల్లల ప్రేమని ఆ ముసల్దానిమీద ప్రయోగిస్తూ, స్వంత మనవడు సైతం తనని ఇంత ఇదిగా ప్రేమించడంలేదనే బలమైన భావాన్ని ఆ ముసల్దానిలో కలిగించాలనుకున్నాం. మన నిర్ణయాన్ని ఈమారు కూడా భగవంతుడు మన్నించాడు. అందుకే... వాడిలో మనకు అనుగుణమైన అనూహ్యామైన మార్పు వచ్చింది. దీంతో మరీ సులువుగా మనం గెలవగలం" అందామె.

"నీ పిచ్చిగాని రక్తసంబంధాన్ని ఎవ్వరూ కూడా అంత సులువుగా కాదనుకోరే" అన్నాడు అతడు.

"అపశకునం పక్షిలా కూశావా? " అతడ్ని కోపగించుకుని "నాకూ తెలుసు ఈ విషయం!" అంది.

"మరి ఎలా గెలుస్తాను అనుకుంటున్నావు? " అడిగాడు.

"ఈ శకుంతల ఆలోచించింది అంటే అందుకు తిరుగువుండదు. దీని ఆలోచనలు చాకు మొన కంటే వాడిగా వుంటాయి" ఆమె మాటల్లో గర్వం.

"..."

"జీవితంలో లేమి కనబడ్డప్పుడు మనిషి మంచితనం సహజంగా నశించిపోతుంది. ప్రేమలో లేమి కనబడ్డప్పుడు అనుబంధం అనేది సహజంగా సడలిపోతుంది" కనుబొమలు ఎగరవేస్తూ చెప్పింది.

"..."

"కాబట్టి ఆ సడలింపు కోసం ముందుగా మనం ప్రయత్నిస్తాం. ప్రయత్నం ఫలించకపోతే అసలు ప్రయత్నం మొదలెట్టాల్సిందే"

"అర్థమయ్యింది"

"ఏమర్థమయింది? "

"వాడి తల్లిదండ్రుల దగ్గరకే వాడ్ని పంపిస్తాం"

"భలే అర్థం చేసుకున్నావే! అమ్మా నాన్నలతో కూడా ఇదేవిధంగా మడతబెట్టి చెప్తే అస్సలు అర్థం చేసుకోలేదు. నా ఐడియాలు మెరుపు తునకలు కాబట్టి మరేదో కొత్త ఆలోచన అనుకున్నారు. కాని పాతదే పునరావృతం అని తెలియగానే అర్థం చేసుకోలేక పోయినందుకు నవ్వుకున్నారు" చెప్తూనే చిన్నగా నవ్వింది.

"మరి నాతో అప్పుడే చెప్పలేదేం? " అడిగాడు.

"చెప్పాలని రూలా? అప్పట్లో కూడా

చెప్పలేదుకదా! చెప్పే వాళ్ళమే అనుకో... కాని తమరు పెళ్ళికి వెళ్ళారుకదా! ఇక ఈమారు ఎందుకు చెప్పలేదంటే... ఆలోచన ఆచరణ వరకు వచ్చాక చెప్పాలి అనుకున్నాను. కానీ ముందే చెప్పానుకదా!" పదాల కూర్పుని పొందికగా పలుకుతూ మాట్లాడింది ఆమె.

"నువ్వు నన్ను పెద్దగా పట్టించుకోవు, అయినా నాకు బాధ లేదు. భర్తగా నాకు ఇవ్వాల్సిన గౌరవం ఇవ్వవు అయినా కూడా నాకు బాధలేదు. కాని కనీసం సమాలోచనల్లో నాకు స్థానం కల్పిస్తే సంతోషిస్తాను" అతడి ముఖంలో అలక.

"కల్పిస్తూనే వున్నాంకదా" అంది.

"ఏదీ? చాలా విషయాల్లో నన్ను మిస్ చేస్తున్నారు" అన్నాడు.

"నీదేదో వుండనీగాని... ముందు బయటి గదుల్లో లైట్లన్నీ ఆర్పేసి, పెరటి తలుపు తాళంవేసి రండి" పురమాయింపుగా అంది.

"సరే" అన్నట్టుగా ఆ వెంటనే బయటికి నడిచాడు అతడు.



"ఏంటి ఆలోచిస్తున్నావు?" తల దువ్వుకుంటూ అడిగింది శకుంతల.

"ఏంలేదు. నా భార్య అందాన్ని తనివి తీరా తిలకిస్తున్నాను" మృదువుగా చెప్పాడు అతడు.

ఆమె ఫకాలున నవ్వి- "ముసలితనానికి సమర్త కట్నాలు (తెలంగాణా సామెత) అన్నట్టుగా వుంది తమరి పద్ధతి" అంది.

"ఏం?"

"లేపోతే ఏంటి? మనమేదో కొత్తజంట అయినట్లుగా"

"ప్రేమ అనేది జీవితం చివరివరకూ ఒకే విధంగా వుంటుంది. మోజు మాత్రం కొంత కాలం వరకే వుంటుంది. నాది మోజు కాదు, ప్రేమ"

"ఆహా!"

"వెక్కిరిస్తున్నావా? ఆశ్చర్యపోతున్నావా?"

"ఏదైనా అనుకో"

అంతలోనే బయటినుంచి పిలిచాడు సూర్యప్రకాష్‌రావు.

"అమ్మా శకుంతలా"

"ఆ... నాన్నా" పలికింది శకుంతల.

"నీతో కొద్దిగా మాట్లాడాలమ్మా"

"రండి నాన్నా" భర్త పక్కనుంచి లేచి దూరంగా కూర్చుంటూ అంది.

సూర్యప్రకాష్‌రావు, జానకీదేవి ఇద్దరూ ఒకరి తర్వాత ఒకరు లోపలికి వచ్చి అక్కడే ఒకపక్కగా వేసివున్న కుర్చీల్లో ఆసీనులు అయ్యారు.

"అమ్మాయి పెళ్ళి సమీపిస్తోంది. ఎల్లుండి మూడు లక్షల రూపాయలు మన చేతికి రానున్నాయి. గౌరవం ఇస్తున్నట్లుగా కనబడుతున్నాం కాబట్టి, కట్నం ఇచ్చుకునే సమయంలో ఆ ముసల్దే మన అందరికీ పెద్దగా వ్యవహరిస్తోంది. అయితే అబ్బాయి వాళ్ళకు ఆ ముసల్దాని గురించి అంతా చెప్పేశాం కాబట్టి మన నాటకం ఎట్టి పరిస్థితుల్లోనూ బయటపడదు..."

సూర్యప్రకాశరావు చెప్పుకుపోతుంటే బయటనుండి ఎవరో తలుపు తట్టిన శబ్దం అయ్యింది.





ఎవరు అన్నట్టుగా అందరూ బయటికి చూశారు.

"ప్ప్! ఈ సమయంలో ఎవరు తగలడ్డా రబ్బా? " గొణుక్కుంటూ లేచి గది బయటికి నడిచి, అట్నుంచి మరో మూడు గదులు దాటి వెలుపలి గదిలోకి వెళ్ళి తలుపు గడియ తీసింది శకుంతల.

ఎదురుగా పరిమళాదేవి.

"రా పెద్దమ్మా... రా" ఆనందాన్ని వ్యక్తం చేస్తూ అంది శకుంతల.

"మిట్టమధ్యాహ్నం పూట తలుపులు వేసు కున్నారేంటీ? ఇంట్లో మనుషులు వుండీ కూడా పగటిపూట తలుపులు వేసుకోవడం ఇంటికి మంచిదికాదు. ఈ విషయాన్ని చాలాసార్లే చెప్పాను" లోపలికి వస్తూనే గద మాయింపుగా అంది పరిమళాదేవి.

సమాధానం చెప్పలేక ఇబ్బందిగా కదు లుతూ అక్కడే నిలబడిపోయింది శకుం తల.

"సూర్యం లేడా? " వెళ్ళి వాలుకుర్చీలో కూర్చుంటూ అడిగింది పరిమళాదేవి.

అప్పటికే ఆమె గొంతు విని వాళ్ళంతా వెలుపలికి వచ్చేశారు.

"ఏం వదినమ్మా? " ఆమె అలా అడగ్గానే వచ్చి ఆమె పక్కన వున్న మరో వాలు కుర్చీలో కూర్చున్నాడు సూర్యప్రకాశరావు.

"అదే... సూర్యం! వేరుసెనగ పంటను అడవిపందులు నాశనం చేసేస్తున్నాయి. రోజురోజుకీ వాటి ఆగడం మరీ ఎక్కువైపో తోంది. అందుకని కరెంటుషాకు పెట్టా లంటే మనసొప్పడంలేదు. మరి ప్రత్యామ్నా యంగా ఏం చేయమంటావు? " అడిగింది పరిమళాదేవి.

"పంటను పీకేసుకోవడమే" మనసులో అనుకుంది శకుంతల.

"ఆ... ఇంకేం చేస్తాం వదినమ్మా? వాటిని నివారించడమంటే కరెంటుషాక్ ఒక్కటే మార్గం. ఇక్కడ మంచితనం, మానవతా పనికిరాదు" అన్నాడు సూర్య ప్రకాశరావు.

"నేను ఇంకోరకంగా అనుకుంటున్నాను" అంది పరిమళాదేవి.

"ఎలా? " అడిగాడు సూర్యప్రకాశరావు.

"పొలంచుట్టూ ఫెన్సింగ్ ఏర్పాటు చేస్తే ఇలాంటి సమస్యలు వుండవు అనిపిస్తోంది"

"ఆ... మంచి ఆలోచనే. కానీ ఎంత పొలానికని ఫెన్సింగు ఏర్పాటు చేస్తావు వదినమ్మా. ఎకరమా, రెండెకరాలా? ఏకంగా రెండువందల ఎకరాల పొలం. అంత పొలానికి ఫెన్సింగు ఏర్పాటు చేయా లంటే మాటలా? మోపెడు ఖర్చు అవు తుంది"

"అయితేకానీ!" అని ఓ రెండుక్షణాలు ఆగి, "ఇప్పుడు ఖర్చును చూసి భయపడితే ప్రతి ఏటా పంటను నష్టపోవాల్సి వస్తుంది. అందుకే ఎంత ఖర్చయినా ఫర్వాలేదు. కాస్త దగ్గరుండి పని చేయించు" చెప్పింది పరిమ ళాదేవి.

"తప్పకుండా" అన్నాడు సూర్యప్రకాశ రావు.

తర్వాత ఆ మాటా ఈ మాటా మాట్లా డుతూ కూర్చుంది పరిమళాదేవి.

"శశాంక ఏం చేస్తున్నాడు? వచ్చాడేగానీ ఈ ఇంటికి రాలేదు. మాకేమో వాడు ఎప్పట్లా ఇంటికి రావాలని, పిల్లలతో కలిసి హాయిగా గడపాలని ఆశగా వుంది" అంటూ శశాంక సందర్భాన్ని తీసుకువ చ్చింది శకుంతల.

"తల నొప్పిగా వుందని పడుకున్నాడు" మనవడి గురించి మరేం మాట్లాడలేకపో యింది పరిమళాదేవి.

"అయ్యయ్యో! మాత్రలు వేసుకున్నాడా లేదా? " వెంటనే గాబరాపడింది జానకీదేవి.

"చిన్నచిన్న రోగాలకి మాత్రలు వేసు కుంటే శారీరకంగా బలహీనమై పోతారుట. శారీరక దారుఢ్యం పెరగాలంటే అన్నింటినీ ఓర్చుకునే శక్తిని స్వయంగా పెంపొందించు కోవాలట. ఇంక నేనేం చేద్దును" అంది పరి



మళాదేవి. వెంటనే "పిల్లలేరీ? " అని అడిగింది చుట్టూ చూస్తూ.

"ఆడుకుందుకు బయటకు వెళ్లారు" అంది శకుంతల.

"పాపం మన కావేరమ్మ ప్రేమాదోమా అనుకుంటూ చక్కని సమయాన్ని పాడు చేసుకుంటోంది. ఇలా స్వేచ్ఛగా స్నేహితురాళ్లతో కలిసి వెళ్లగలుగుతుందా? " అంది పరిమళాదేవి బాధగా

"దాని ఖర్మ దాని ఇష్టం" నంగనాచిలా అంది శకుంతల.

"దేవుడు చేసేది అంతా మన మంచికోసమే అనుకోవాలి. ఎందుకంటే ఒకప్పుడు ఏమోగాని, ఇప్పుడుమాత్రం ఆడపిల్లల్ని నమ్మడానికి వీలులేకుండా పోయింది. ఆడపిల్లల్ని ఎక్కువకాలం ఇంట్లో పెట్టుకున్నా, ఎక్కువ చదువులు చదివించినా, వాళ్లు చేతికి రావడంలేదు. మొన్నటికి మొన్న మన టైలర్ నారాయణ కూతురు ముక్కూ మొహం తెలియనివాడితో లేచిపోయింది. చదువుకుంటున్నచోటే ఇద్దరూ ప్రేమించుకుని కథను ఇంతదూరం తీసుకువచ్చారు.

ఇప్పుడు మన కావేరి కూడా తక్కువ తినలేదు. కాపోతే లేచిపోవడం గట్రా చేయకుండా ఇంటి గౌరవం కాపాడింది. ఏది ఏమైనా ఆడపిల్లలు ఎప్పుడైనా ఒక ఇంటికి వెళ్ళేవాళ్ళే. వీళ్ళకు చదువు పనికిరాదు, ఏదో కొద్దిగా అక్షరజ్ఞానం, తెలిస్తే చాలు. ఏమాత్రం కనికరించి పై చదువులు చదివించే ప్రయత్నం చేయరాదు. చేస్తే గనుక చెడిపోతారు" ఏకధాటిగా మాట్లాడుతూ పోయాడు సూర్యప్రకాశరావు.

పరిమళాదేవి అతడి మాటలకు ఆశ్చర్యపోయింది.

"ఆడపిల్లలు అందరూ అలాగే వుంటారా? అలా అని భ్రమపడడం పొరపాటు. ఎందుకంటే ఆడపిల్లలయినా, మగపిల్లలయినా, అందరూ మన పిల్లలే" ఆశ్చర్యాన్ని పక్కకు పెట్టేస్తూ అంది పరిమళాదేవి.

"నిజమే పెద్దమ్మా! కాపోతే మన కావేరి పెళ్ళి మన ప్రమేయం లేకుండానే కుదిరిందికదా" అంది శకుంతల.

"ఆ!" అవును అన్నట్టుగా అంది పరిమళాదేవి.

తర్వాత మరో పదిహేను నిమిషాలవరకు ఉబుసుపోక మాటలు మాట్లాడి అక్కడ్నుంచి వెళ్ళిపోయింది పరిమళాదేవి. ఆమె వెళ్తుంటే తోడుగా వెళ్ళబోయింది శకుంతల. అయితే కూతురి అభిమానాన్ని సున్నితంగా వారిస్తూ, 'వద్దులే బేటా' అంది పరిమళాదేవి. అయినప్పటికీ విన్పించుకోకుండా "బుచ్చమ్మ కూడా వెంటరాలేదు. ఒక్కతివే ఎలా వెళ్తావు? " అంటూ వెంటే వెళ్ళింది శకుంతల.

ఇద్దరూ గేటుదాటేవరకు చూసి, ఆ తర్వాత తాపీగా ఇలా అన్నాడు సూర్యప్రకాశరావు.

"ఈ ముసల్దాని దగ్గర ఫెన్సింగ్ పేరుతో పది ఇరవైవేల దాకా నొక్కేయాల్సిందే"

★ ★ ★

"చదువుకుంటే అమ్మాయిలు చెడిపోతారని మీ చిన్నతాత అభిప్రాయం. మిగతా అందరి అభిప్రాయం కూడా అదే కావచ్చు. కాబట్టి అది ప్రేమలో పడకపోయినా దాని పెళ్లిని ఎలాగైనా సరే ఖచ్చితంగా జరిపించాలని ప్రయత్నించేవాళ్ళు.

ఇక రామలక్ష్మి విషయానికి వస్తే, ఆ పిల్ల తల్లిదండ్రుల అభిప్రాయం బహుచిత్రంగావుంది. ఆడపిల్లల్ని చదువుకోసం పంపిస్తే వాళ్ళను ఎవరో చెడగొడతారంట. పిచ్చి చాదస్తం వాళ్ళూనూ" డైనింగ్ టేబుల్ ముందుకూర్చుని వున్న మనవడికి ప్రేమగా గోరుముద్దలు తినిపిస్తూ చెప్పింది పరిమళాదేవి.

"ఎవరి ఇష్టం వాళ్ళది. కాపోతే తమరి దానధర్మాల్ని తగ్గించుకుంటే మంచిది" అన్నాడు శశాంక.





"ఊర్లో మొదట్నుంచి గొప్పగా బతికిన వాళ్ళం. అడిగినవాళ్ళకు అయిదో, పదో ఇవ్వడంవల్ల పోయేది ఏముంది?" అంది పరిమళాదేవి.

"అయిదూ, పదీ విషయాల్లో నేను ఎంటర్ కావడంలేదు. అది నీ ఇష్టం. కానీ ఇక్కడ మన కావేరి పెళ్ళికి, అవతల బుచ్చమ్మ మనవరాలు రామలక్ష్మి పెళ్లికీ అంత పెద్దమొత్తంలో డబ్బులు ఇవ్వడం ఐ డోంట్ ఏక్సెప్ట్"

వచ్చినరోజునుండి వాళ్ళమీద చిర్రుబుర్రు లాడుతున్నాడే తప్ప డబ్బు ప్రసక్తి తీసుకు రాలేదు శశాంక. కానీ ఆరోజు అనూ హ్యంగా తీసుకురావడం జరిగింది. అందుకు పెద్దగా ఆశ్చర్యపోలేదు పరిమళా దేవి. ఎందుకంటే మనవరాళ్ళు ఇద్దరి పెళ్ళికి తనే డబ్బు ఇచ్చేసంగతి అందరికీ తెల్సిందే. అలాగే అడపాదడపా ఆ కుటుం బానికి సహాయం చేస్తున్న సంగతీ అందరికీ తెల్సిందే. ఇక బుచ్చమ్మా వాళ్ళ గురించి ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరంలేదు. కారణం ఏంటంటే పనివాళ్ళకిగానీ, వాళ్ళ పిల్లలకుగానీ యజమానులే స్వంతఖర్చుతో పెళ్ళి జరిపించడం అనేది చాలావరకూ అత్యంత సహజమైన విషయం!

"అలా మాట్లాడతావేంరా?" మనవడి తీరును వారించింది పరిమళాదేవి.

"మాట్లాడ్డం కాదు, నాకు గనుక తిక్కరే గితే నేనే స్వయంగా ఈ సంసారాన్ని నడి పిస్తాను. అంటే... నీ అధికారం అంతా పడిపోతుంది అన్నమాట" అన్నాడు శశాంక.

"పిచ్చికన్నా! సంసారాన్ని నడిపే వయసు వుందట్రా నీకు" చిన్నగా నవ్వింది పరిమళా దేవి.

"వుంది... లేదు"

"అదేంట్రా?"

"అది ఏదైనా కానీయ్ గానీ ఇకనుండి నేను చెప్పినట్లుగా నడ్చుకో! అవసరమైతే నేను ఇక్కడే వుండి చదువుకుంటాను. నీకు అన్నివిధాలా తోడుగా వుంటాను"

"పల్లె వాతావరణం బాగున్నా, పట్నవాస జీవితమే బాగుంటుంది అంటావు. నువ్వు పట్నాన్ని వదిలి వస్తావంటే నాకు నమ్మకం కుదరడంలేదు"

"ఈ మనవడి మాటకు నువ్వు విలువ ఇవ్వకపోతే నా ఇష్టాన్ని చంపుకోక తప్పదు కదా" అంటూ గ్లాసుతో నీళ్ళు తాగి, గ్లాసును పక్కకు పెట్టేస్తూ లేచి నిల్చున్నాడు శశాంక.

"అప్పుడే చాలా?" అడిగింది పరిమళా దేవి.

"చాలు" చెప్తూనే వెలుపలికి నడిచాడు శశాంక.

"అక్కడ మేజామీద సోంపు పెట్టాను చూడరా" చెప్తూ చేయి కడుక్కుని మనవడి వెనకే నడిచింది పరిమళాదేవి.

అంతలో బయటి హాల్లో ఫోన్ మోగింది. వడివడిగా హాల్లోకి నడిచి ఫోన్ ఎత్తాడు శశాంక.

"హలో..."

"ఎవరూ శశాంకా" అవతల్నించి అడి గారు.

"ఆ... అవునంకుల్" మేనమామ గొంతును అట్టే గుర్తుపట్టేశాడు శశాంక.

"ఎలా వున్నావురా?" అడిగాడు మేన మామ ధనుంజయ.

"బావున్నాను అంకుల్"

"మీ నాన్నమ్మ బావుందా? నా తరపున నమస్కారాలు తెలియచేయి".

"సరే అంకుల్"

"ఆ... శశీ... నీతో కొన్ని విషయాలు సీక్రెట్‌గా మాట్లాడాలి. సో... ఒకసారి బయటినుండి ఇక్కడికి ఫోన్ చేయి. ఎందు కంటే అక్కడ ఇంట్లోంచి మాట్లాడ్తే మీ నాన్నమ్మకి మామీద అనవసరంగా చెడు అభిప్రాయం ఏర్పడుతుంది. మేం ఆమె మంచిని కోరుతున్నాం. కానీ అసలు విషయం ఆమెకు తెలీదు కాబట్టి, తనని



మోసం చేస్తున్నామనో లేదా అన్యాయం చేస్తున్నామనో అనుకుంటుంది"

"ఓకే అంకుల్"

"మరి ఫోన్ పెట్టేయనా? "

"ఓకే..." అంటూనే ఫోన్ పెట్టేసి వెనక్కి తిరిగాడు శశాంక.

"ఎవరూ ధనుంజయనా? " కాసింత దూరంలో నిల్చుని వున్న పరిమళాదేవి అడుగుతూ చేరువగా వచ్చింది.

"ఆ... అవును" అన్నాడు.

అదే సమయంలో బయటినుండి "అమ్మమ్మా" అని ఒకేసారి పిలుస్తూ లోపలికి వచ్చారు కావేరి, కస్తూరి. ఇద్దరూ చక్కగా ముస్తాబై వున్నారు.

కావేరి పట్టు లంగా, వోణీ ధరించింది. కస్తూరి పట్టులంగా, జాకెట్టు ధరించింది. చూడ్డానికి ఇద్దరూ ముచ్చటగా కన్పిస్తున్నారు.

"ఎంత చక్కగా కన్పిస్తున్నారే? " వాళ్ళిద్దరూ లోపలికి రాగానే మెచ్చుకోలుగా అంది పరిమళాదేవి.

"నా స్నేహితురాలి ఫంక్షన్‌కి వెళ్తున్నాం. ఇక్కడ నిలువుటద్దం వుందికదా, ఒకసారి చూసుకుని వెళ్దామని వచ్చాం" చెప్పింది కస్తూరి.

"అయ్యయ్యో! నా బంగారుతల్లులూ, అద్దంకోసం ఇక్కడికి వచ్చారా" అని పరిమళాదేవి అంటుండగానే "పట్టుబట్టలు వేసుకున్నాంకదా, ఎలావున్నాయో నీకు చూపించి వెళ్దామని కూడా వచ్చాం" అందుకుంది కస్తూరి.

"దేవకన్యల్లా వున్నారు" మనస్ఫూర్తిగా అంది పరిమళాదేవి.

"నిజంగానా? అయితే అద్దంలో చూసి తేల్చుకుంటాం" అని "రా అక్కా" అంటూ కావేరి చేయి పట్టుకుని లోపలికి వడివడిగా నడిచింది కస్తూరి.

"ఈ పిల్లలకు నిలువుటద్దం ఇప్పించాలి" వెళ్తున్న అక్కాచెల్లెళ్ళను చూస్తూ అంది పరిమళాదేవి.

"అంత అవసరం లేదేమో" ఆ వెంటనే చప్పున అన్నాడు శశాంక.

"అదేంట్రా? " అన్నట్టుగా చూసింది పరిమళాదేవి.

"ఎవరికోసమో నువ్వు ఖర్చులు పెట్టాల్సిన అవసరంలేదు" చివాలున అన్నాడు.

ఆమె కనుబొమలు ముడిపడ్డాయి.

"అవును, నాన్నమ్మా! డబ్బుంది కాబట్టే వాళ్ళు మనతో తమ అనుబంధాన్ని కొనసాగిస్తున్నారు. లేదంటే పరమశత్రువులుగా వ్యవహరించేవాళ్ళు" చెప్పి, ఆ వెంటనే అక్కడ్నుంచి విసవిసా వెళ్ళిపోయాడు శశాంక.

ఆమె మాత్రం అలాగే నిలబడి, వెళ్ళిపోతున్న మనవడివైపు అయోమయంగా చూస్తుండిపోయింది.

★ ★ ★

"అమ్మమ్మా! ఇప్పుడు హాయిగా వుందా? " పక్కమీద బోర్లా పడుకుని వున్న పరిమళాదేవి కాళ్ళు ఒత్తుతూ ప్రేమగా అడిగింది కస్తూరి.

"ఆ... వుంది" అంది పరిమళాదేవి.

"అమ్మమ్మా" అదే సమయంలో లోపలికి వచ్చింది కావేరి. ఆమె చేతిలో మూసివున్న స్టీలుపాత్ర వుంది.

"ఊఁ... ఏంటమ్మా... ఊఁ..." నీరసంగా మూలుగుతూ కావేరిని ఉద్దేశించి అంది పరిమళాదేవి.

"నీ ఆరోగ్యం బాగోలేదు కదా. అందుకే నీకోసం ఏం తీసుకువచ్చానో తెల్సా? " వచ్చి పక్కమీద కూర్చుంది కావేరి.

"ఊహూ... ఏం తెచ్చావు." అడిగింది పరిమళాదేవి.

"బార్లీ అన్నం తీసుకువచ్చాను. ఆరోగ్యం బాగాలేనప్పుడు ఈ అన్నం తింటే తగ్గిపోతుందటగా" అంది కావేరి.

"ఎవరు చెప్పారే? " ఆశ్చర్యపోతూ అతిప్రయత్నంగా వెల్లకిలా తిరిగింది పరిమళాదేవి.

"మొన్న నాకు జ్వరం వచ్చినప్పుడు అమ్మ





ఇదే వండిపెట్టింది" చెప్పింది కావేరి.

అపురూపంగా నవ్వుతూ లేచి కూర్చోబోయింది పరిమళాదేవి. "మెల్లగా అమ్మమ్మా". అంటూ చేతిలోని పాత్రను కస్తూరికి అందించి, పరిమళాదేవికి ఆసరా ఇచ్చింది కావేరి.

"నువ్వే వండావా?" అడిగింది పరిమళాదేవి.

"అవును. నేనే స్వయంగా వండాను. నేను వండబోతుంటే అమ్మ వండి ఇస్తానంది. కానీ నీకోసం నేనే స్వయంగా వండాలని అమ్మను వారించాను" చెప్పింది కావేరి.

"నా తల్లే" తన రెండు చేతుల్తో కావేరి కణతల్ని నిమిరి, తర్వాత తన కణతలకి ఆన్చుకుంది పరిమళాదేవి.

"ఇది కూడా తినొచ్చా అమ్మమ్మా" అదే సమయంలో ఆరిందాలా అడిగింది కస్తూరి.

"నేను చేసింది నీకోసం కాదు" అంటూ చెల్లెలి చేతిలోంచి పాత్రను చప్పున అందుకుని, "అమ్మమ్మకు నేనే తినిపిస్తాను" అంటూ మెల్లగా ఒక్కోముద్ద తినిపించడం ఆరంభించింది కావేరి.

"మనవరాళ్ళ ప్రేమ చూడమ్మో" అంటూ అంతలోనే లోపలికి వచ్చి, "అమ్మగారూ! సెసిబాబుగారు ఎక్కడికి వెళ్ళారు?" అడిగింది బుచ్చమ్మ.

"ఎందుకు?" కస్తూరి ప్రశ్నించింది.

"బాబుగారికోసం రాం సెంద్రారెడ్డిగారి కొడుకు వచ్చినాడు" చెప్పింది బుచ్చమ్మ.

"వాడు ఒడ్డుకి షికారుకి వెళ్ళాడని చెప్పు" అంది పరిమళాదేవి.

"అట్టాగే" అంటూ వెళ్ళిపోయింది బుచ్చమ్మ.

"అమ్మమ్మా! నాకో డౌటు" ఆమెకు అన్నం తినిపిస్తూనే అంది కావేరి.

"ఏంటి?"

"మరేంలేదు. నీకు శశిమీద కోపంరావడంలేదా?"

అమాయకంగా అడిగింది కావేరి.

"కోపం దేనికి?"

"అదే అమ్మమ్మా! శశి ప్రవర్తన మునుపటిలా లేదు కదా!"

"ఈ ప్రవర్తన కొన్నాళ్ళే! ఆ తర్వాత మళ్లీ మునుపటిలాగే వుంటాడు"

"నాకు నమ్మకం లేదు"

"ఎందుకు?"

"మమ్మల్ని చూడగానే ముఖం తిప్పేసుకుంటున్నాడు. లేదా గుర్రుమని చూస్తున్నాడు. పైగా నీపై కూడా వుండుండీ చిరుబుర్రులాడుతున్నాడు. పాపం నువ్వు మంచిదానివి! నీవేం తప్పు మాట్లాడ్తావని నీపై తను కోప్పడ్తాడు?"

"వాడికి పిచ్చిపట్టింది. అందుకే అలా చేస్తున్నాడు"

"ఆ పిచ్చి తగ్గదా?" కల్పించుకుంది కస్తూరి.

"తగ్గుతుంది" చెప్పింది పరిమళాదేవి.

"తను ఎలాగో వుండనీగానీ, నేను మాత్రం ఒకటి నిర్ణయించుకున్నాను అమ్మమ్మా!" అంది కావేరి.

"ఏం నిర్ణయించుకున్నావు?" అడిగింది పరిమళాదేవి.

"నువ్వు బాగా ముసల్దానివై పోయావు. ఈ సమయంలో నీకు ఎవరో ఒకరు తోడు వుండాలి. బుచ్చమ్మ వుంటున్నా, నీకు వుండాల్సింది అలాంటి తోడు కాదు. నీ అనే ఆత్మీయులే నీకు తోడుగా వుండాలి. అప్పుడే నీకు మంచి తృప్తి... సంతోషం కలుగుతాయి!

మరేమో నీకు ఎవ్వరూ తోడుగా లేరు. వుంటే శశి వుండాలి. కాని శశికి ఆ ఆలోచనే లేనట్టుంది. అందుకే నేను నీకు తోడుగా వుండాలనుకుంటున్నాను" అంది కావేరి.

కావేరి మాటలు విని పరిమళాదేవి ఏమనుకుందో తెలీదుగాని, ఐదారు క్షణాలు ఆమెవైపు ఆశ్చర్యంగా చూసి "చివరి

మాటను మనస్ఫూర్తిగా చెప్తున్నావా? " అడిగింది.

"ఏం? " కావేరిలో విస్మయం.

"ఇంకా రెండు నెలల్లో నీ పెళ్ళి! ఈ సంగతే మర్చిపోయినట్టున్నావు" గుర్తుచేస్తున్నట్టుగా అంది పరిమళాదేవి.

"తెలుసు"

"మరి? "

"పెళ్ళయినంత మాత్రాన పుట్టింటికి రాకుండా వుంటానా? అప్పుడు నీ దగ్గరే వుంటాను. ఎందుకో నిన్ను విడిచి వుండాలనిపించట్లేదు"

"... ... ..."

"ఈరోజునుండి కూడా ఇక్కడే వుంటాను"

"... ... ..."

"శశికి నీమీద అభిమానం తగ్గిపోయింది. తన అభిమానమంతా తన అమ్మమ్మగారి మీదే అన్పిస్తోంది. ఇందుకు తనమీద కోపం రావడంలేదుగాని, నీమీద జాలేస్తోంది"

"ఎందుకే? ఈవేళ ఇంత సానుభూతిగా మాట్లాడుతున్నావు? " అడిగింది పరిమళాదేవి.

"ఇన్నాళ్ళూ శశికి నీమీద బాగా ప్రేమ వుంది అనుకున్నాను. అందుకే నీ గురించి ఏమీ అన్పించలేదు. కాని ఇప్పుడు శశిని చూస్తుంటే నీ మీద ప్రేమలేనట్టుగానే అర్థమౌతోంది. అందుకే నీమీద జాలేస్తోంది" పరిమళాదేవికి జాగ్రత్తగా నీళ్ళు తాగిస్తూ చెప్పింది కావేరి.

"వాడిది ప్రేమలేమి కాదమ్మా! ఎదుగుతున్న వయసు తాలూకు వెర్రితనం" అంది పరిమళాదేవి.

"ఇంకో కారణం కూడా వుంది" ఏదో గొప్ప విషయం కనుక్కున్నట్టుగా మళ్ళీ కల్పించుకుంది కస్తూరి.

"ఏంటీ" చీకాగ్గా చెల్లెలివైపు చూసింది కావేరి.

"ఏంటమ్మా? " పరిమళాదేవి గొంతులో ప్రేమ.

"నీమీద ఈ కావేరక్క ఇంత ప్రేమ చూపించడానికి శశి బావ ఒక్కడే కారణం కాదు, నీవు తన పెళ్ళికి బోలెడన్ని డబ్బులు ఇస్తున్నావు కదా! అందుక్కూడా మరి!" సిసింద్రీలా కళ్ళింతచేసి మాట్లాడింది కస్తూరి.

"నీమొహం" చెల్లెల్ని కొట్టబోయింది కావేరి.

"అమ్మమ్మా..." అంటూనే చప్పున మంచందిగి ఆమడదూరం పరుగెట్టింది కస్తూరి.

"చూడు అమ్మమ్మా! ఈ కొంగరి ఎల్లమ్మ ఎలా మాట్లాడుతోందో? " ఫిర్యాదుగా పరిమళాదేవివైపు చూసింది కావేరి.

"పోనీలేవే! పెద్దదానివి, చిన్నది ఏమైనా మాట్లాడినా నువ్వు ఓర్చుకోవాలి" ఓదార్పుగా బుద్ధి చెప్పింది పరిమళాదేవి.

"సరే" బుద్ధిగా తలాడించింది కావేరి.

మరో అర్ధగంట తర్వాత శశాంక వచ్చాడు. అప్పటికే కస్తూరి ఇంటికి వెళ్ళిపోయింది. కావేరి మాత్రం పరిమళాదేవి దగ్గరే కూర్చుండిపోయింది.

"ఎలా వుంది నాన్నమ్మా? " రాగానే అడిగాడు శశాంక.

"బావుందిరా"

"నేను ఇచ్చిన ట్యాబ్ లెట్స్ వేసుకున్నావా? " అడుగుతూ వచ్చి పరిమళాదేవి నొసలుపట్టి చూశాడు అతడు.

"వేసుకున్నాను" చెప్పింది పరిమళాదేవి.

"మరి ఇంకా జ్వరం తగ్గలేదేంటీ? ట్యాబ్ లెట్స్ మార్చి అయినా తీసుకురావాలి" అని ఓ రెండు క్షణాలు ఆగి "ఆ... నాన్నమ్మా! నా కోసం వేణుగాని వచ్చాడా? " గుర్తొచ్చినట్లుగా అడిగాడు.

"వస్తే వాగు ఒడ్డుకి వెళ్ళావని చెప్పి పంపించాం" కావేరి చెప్పింది. కానీ ఆమె సమాధానాన్ని పట్టించుకోలేదు శశాంక.

"రాలేదా నాన్నమ్మా? " పరిమళాదేవిని





అడిగాడు.

"కావేరి చెప్తోంది గదరా" అంది పరిమళాదేవి.

"ఆ!" సరే అన్నట్టుగా చీకాగ్గా అని, మనసులో మాత్రం "ఆమెను నేను అడగలేదు" అనుకుంటూ అక్కడ్నుండి బయటకి నడిచాడు.

★ ★ ★

"అంతా నువ్వు చెప్పినట్లుగానే నడుచుకున్నాను" తల్లికి అతి సమీపంగా కూర్చుని చెప్పింది కావేరి.

పక్కనే తండ్రి వరప్రసాద్, అమ్మమ్మ జానకీదేవి, తాతయ్య సూర్యప్రకాష్‌రావులు కూర్చుని వున్నారు. అందరూ నేలమీదే కూర్చుని వున్నారు.

"మరి తను ఎలా ఫీలయ్యింది? " ఆసక్తిగా అడిగింది తల్లి శకుంతల.

"మనకు ఎంతమాత్రం అనుకూలంగా ఫీల్ కాలేదు" చెప్పింది కావేరి.

"మరి? " జానకీదేవిలో ఆదుర్దా.

"తనకు అసలు శశిమీద కోపంరాలేదు. అమ్మ వండియిచ్చిన బార్లీ అన్నాన్ని ఎంత తృప్తిగా తిందో, అందరి ఎడలా ఆమె మనసు కూడా అంతే తృప్తిగా వుంది" అని కాసేపాగి, "అయినా ఆ మంచి అమ్మమ్మతో ఈ నటనలు ఎందుకు? " విసుగ్గా అంది కావేరి.

"నీకు తెలీదే బంగారు! నీవు చాలా చిన్నపిల్లవి కాబట్టి ఇలా మాట్లాడ్తున్నావు! ఆ ముసల్దానికి మీమీద పూర్తి ప్రేమ ఏర్పడి, మనవడిమీద మనసు విరిగిపోతే, ఆ ఆస్తిపాస్థుల్లో ఎంతలేదన్నా సగానికి పైగా మీకు దక్కుతుంది" నూరిపోసింది శకుంతల.

"ఏమో!? " అపనమ్మకంగా అంది కావేరి.

"ఇందుకు ఉదాహరణగా మీ నాన్నగారి అక్కయ్య... అదే మీ పెద్దమేనత్త పరిస్థితిని ఒకసారి చూడు. తనని కొడుకూ కోడలూ బాగా చూసుకోవట్లేదని, అనాథపిల్లాడ్ని పెంచుకుని వాడినే తన వారసుడిగా ప్రకటించుకుంది" చెప్పింది శకుంతల.

కావేరి ఏం మాట్లాడలేదు. తల్లి మాటను మౌనంగా విని, తనలో తను మాత్రం "శశి మాత్రం అమ్మమ్మను బాగానే చూసుకుంటున్నాడు కదా!" అనుకుంది.

"అర్థమయ్యిందా? " అంది శకుంతల.

"శశి అలాంటివాడు కాదు కదా? " మనసులోని మాటను పైకి అనేసింది కావేరి.

"కాకపోయినా, "అవును" అనే భ్రమను కలిగించాలి. ఇందుకు నువ్వు, కస్తూరి, ఆ ముసల్దాన్ని ఇంకా ఇంకా ప్రేమించాలి!" చెప్పింది శకుంతల.

"కస్తూరి శుద్ధదండగ" అంది కావేరి.

"ఎందుకే? " కల్పించుకున్నాడు సూర్యప్రకాష్‌రావు.

"నేను అమ్మమ్మమీద ప్రేమ కురిపిస్తుంటే 'ఈ ప్రేమకు రెండో కారణం పెళ్ళికి డబ్బు ఇస్తున్నందుకే' అని అంది! దాని మొహం! దానికి అస్సలు నటించడం చేతకాదు. పైగా గుట్టురట్టు చేసేస్తుంది. అందుకే దాని పార్టనర్‌షిప్ మాత్రం నాకు వద్దు" అంది కావేరి.

"దాని గుణం తెల్సుకాబట్టే నటన గురించి నీ ఒక్కదానితో చెప్పి, దాంతో మాత్రం అమ్మమ్మకు జ్వరం వచ్చింది కాబట్టి తోడుగా వుండమని చెప్పి సహజంగా పంపించాం! అయినా దాంతో అయ్యే పని అంటూ ఏదీ వుండదు. కాబట్టి ఈ యాక్టింగ్‌లో నువ్వు ఒక్కదానివే పాల్గొని, ఎట్లాగయినా చేసి ఆ ముసల్దాని మనసును పూర్తిగా దోచేసుకో" చెప్పింది శకుంతల.

"సరే" తలాడించింది కావేరి.

"అవునే... దీనికి అన్నీ నీ బుద్ధులే వున్నాయి. చెప్పినట్టుగా నడ్చుకుంటూ మనకు సహకారంగా వుంటోంది. కాని ఆ చిన్నదానికి ఎవరి బుద్ధులు వచ్చినట్టు? ఎప్పుడు చూసినా తాకట్లూ తంటాలూనూ" శకుంతలతో అంది జానకీదేవి.

'అది చిన్నపిల్ల అయినందుకు దాని

తీరులో గడుసుదనం కనబడుతుందేగాని, వాస్తవానికి దానిలో వాస్తవికతే ఎక్కువగా కనబడుతుంది. ఆ వాస్తవికత మనకు పని కిమాలినతనంలా గోచరిస్తోంది. ఏం చేస్తాం మరి!' మనసులో అనుకున్నాడు వర ప్రసాద్.

"ఏమో... దరిద్రపు బుద్ధులు" తల్లి మాటకు సమాధానంగా అంది శకుంతల.

తర్వాత ఇంకెవ్వరూ ఏం మాట్లాడలేదు. సూర్యప్రకాష్‌రావు ఒక్కడే కల్పించుకుంటూ.

"అమ్మా కావేరీ! కొన్నాళ్ళ వరకు ఇలాగే అపారమైన ప్రేమను కనబర్చు ఆ ముస ల్దానిలో మార్పురాకపోతే ఆ తర్వాత మా ప్రయత్నాలేవో మేము చేసుకుంటాం!"



ఆరోజుకి శశాంక వచ్చి ఇరవైరోజులు అయ్యింది. వచ్చిన పది పన్నెండు రోజులకే వెళ్ళిపోవాలనుకున్నవాడల్లా కొంత ఆల స్యమే చేశాడు. కాగా, ఆరోజు ఎప్పట్లా పక్క టౌన్‌కి వచ్చి మేనమామకోసం ఎస్టీడీ ఫోన్ చేశాడు.

"అంకుల్! నాన్నమ్మలో అస్సలు మార్పు రావడంలేదు. అంతా తనవాళ్ళే అనుకుం టోంది" చెప్పాడు శశాంక.

"అది ఆమె సహజతత్వం! ఇలాగని నీకు సంబంధించిన ఆస్తిని వేరొకళ్ళు వినియోగిం చుకోవడం బాగుండదు కదా! వాళ్ళు ఇప్పుడు మేత పురుగులు. నీ ఆస్తిని కొద్ది కొద్దిగా మేస్తున్నారు. కొన్నాళ్ళుపోతే అంతా ఊడ్చిపడేస్తారు. మీ నాన్నమ్మకు ఈ విషయం బోధపడట్లేదు. అందుకే నీకు అన్యాయం చేస్తోంది. కాబట్టి ఆమెను నీదా రిలోకి తెచ్చుకునే ప్రయత్నాన్ని ఎంత మాత్రం నిర్లక్ష్యం చేయొద్దు. ఎప్పటికప్పుడు ఆమెను వారిస్తూనే వుండు!

ఒరేయ్! వారించమన్నానని ఆమె మనసు నొప్పించే ప్రయత్నం చేయొద్దు. ఆమె మనసు చాలా సున్నితం అని మనం దరికీ తెల్సిన విషయమే. కాబట్టి నీ వారింపు అనేది ఆమె మనసును కష్టపెట్టిన ట్టుగా వుండకుండా చూసుకో" చెప్పుకుపో యాడు మేనమామ ధనుంజయ.

"అదికాదు అంకుల్! నాన్నమ్మమీద నాకిప్పుడు పీకలదాకా కోపం వుంది. ఎందుకంటే నిన్నటికినిన్న బ్యాంకునుండి నాలుగు లక్షలు డ్రా చేసి వాళ్ళ మొహాన కొట్టింది. మూడు లక్షలు కట్నం కోస మట. లక్షరూపాయలు ఖర్చుకోసమట! ఇది న్యాయంగా వుందా? నాకు సంబం ధించిన డబ్బును నా కళ్ళెదుటే నాశనం చేస్తుంటే నాన్నమ్మ మనసును కష్టపెట్ట కుండా ఎలా వుండమంటావు?

అసలు నిన్ననే మీకు ఫోన్ చేయాలనుకు న్నాను. కాని ఈ దరిద్రపు ఏరియాలో కేబుల్ ప్రాబ్లమ్" శశాంక గొంతులో బాధతో పాటుగా ఆవేశం కూడాను.

"గాడ్! జరగొద్దు అనుకున్న పని జరిగిపో యింది" శశాంకను అనునయించాడు ధ నుంజయ.

"ఇప్పుడేం చేయాలి అంకుల్?" అడిగాడు శశాంక.

"మేము కల్పించుకోవడం బాగుండదు. ఎందుకంటే ఆమె ముందే బాధలో వున్న

మనిషి! ఇప్పుడు అందరం ఆమెను వ్యతిరే కించినట్టుగా కనబడ్తే చూసేవాళ్ళకు కూడా బాగుండదు. ఇలాగని ఆమె దానధర్మాలని చూసీచూడనట్టుగా వుండిపోవడం కూడా బాగుండదు" అన్నాడు ధనుంజయ.

"మరి ఇప్పుడేం చేయాలి? " మళ్ళీ అడిగాడు శశాంక.

"అదే అంతుబట్టడం లేదు" ధనుంజయలో కంగారు.

"కాపోతే ఒక్క నిర్ణయం అంకుల్"

"ఏంటీ? "

"నాన్నమ్మ అంటే నాకు ప్రాణం. నేనంటే ఆమెకు అంతకన్నా ప్రాణం! ఈ ప్రేమకోసమే నేను నా అమెరికా ప్రయాణాన్ని ఆపుకున్నాను కదా! కాని ఇప్పుడు నాన్నమ్మ ప్రేమ నాకు అవసరం లేదు. ఆమె ప్రేమను అడ్డుపెట్టుకుని నా భవిష్యత్ జీవితాన్ని నాశనం చేసుకోవాల్సిన అవసరం కూడా నాకు లేదు. అందుకే చదువుకోడానికి నేను అమెరికా వెళ్ళిపోతాను. ఇక తన ఇష్టం వచ్చినట్లుగా దానధర్మాలు చేసుకోనీ" శశాంకలో అదోవిధమైన పౌరుషం.

"నీ చదువు అమెరికాలో సాగడం మా అందరికీ ఇష్టమే! ఇష్టంలేనిది ఆమె ఒక్కదానికే! ఇన్నాళ్ళూ ఆమె ఇష్టానికే విలువ అందిస్తూ వచ్చాం. కాని ఇప్పుడు అర్థాంతరంగా ఆమె ఇష్టాన్ని కాదంటే, ఆమె తట్టుకోగలదా? " అడిగాడు ధనుంజయ.

"అది నాకు ఇప్పుడు సంబంధంలేదు"

"అదేంట్రా పరాయివాడిలా"

"నాకు విసుగొచ్చింది అంకుల్"

"అమ్మమీద అలక తాత్కాలికంరా"

"ఇన్నాళ్ళూ నాన్నమ్మను అమ్మ అనుకున్నాను. అమ్మకు దూరంగా అమ్మమ్మవాళ్ల ఇంట్లో వుంటున్నాను అనుకున్నాను. కాని ఇప్పుడు నా మాటని కాదన్న నాన్నమ్మలో అమ్మ కన్పించడం లేదు. మా అమ్మ నిజంగానే చచ్చిపోయింది" శశాంక గొంతు గద్గదమయ్యింది.

"రేయ్..." వారింపుగా అన్నాడు ధనుంజయ.

"తర్వాత మాట్లాడ్తానంకుల్" పెరిగిపోయిన బాధ గుండెను అతలాకుతలం చేస్తుంటే అంతకంటే మాట్లాడలేక, చప్పున ఫోన్ పెట్టేశాడు శశాంక.

★ ★ ★

"నాకు వున్నది నువ్వొక్కడివేరా! మరి ఈ ముసలిప్రాణాల్ని వదిలి దేశంకాని దేశం వెళ్ళిపోవడానికి నీకు మనసెలా ఒప్పుతోందిరా? " పరిమళాదేవి గొంతులో దీనత్వం.

"నాన్నమ్మా! అనవసరపు సెంటిమెంట్లతో నా ఆశయానికి అడ్డు తగలొద్దు. అసలు ఈ ప్రపంచంలో అన్నిటికంటే విలువైనది మనిషి గౌరవం! ఈ గౌరవాన్ని ముందుగా మనం దక్కించుకోవాలి" సౌండ్‌లెస్‌లో టీవీ చూస్తూ అన్నాడు శశాంక.

"నీవు మాట్లాడింది నాకేం అర్థంకాలేదు" అంది పరిమళాదేవి.

"అర్థంకావడానికి ఏముంది నాన్నమ్మా? నేను అమెరికావెళ్ళి చదువుకున్నాను అనుకో, ఈ పిచ్చి జనాలు మనల్ని అంతెత్తున చూస్తారు. అమెరికా అంటే ఆషామాషీ కాదు కదా; ఇక మన జీవితాంతం ఈ వెర్రి జనాల పొగడ్తలతో ఉక్కిరిబిక్కిరి కావల్సిందే!"

"పిచ్చివాడా! అమెరికాలో చదివితేనే జనాలు అంతెత్తున చూస్తారు అనుకుంటున్నావా? అలాంటి చదువులు ఏవో ఇక్కడ లేవా? "

"ఉండొచ్చు! కాని ఒక్కటి గుర్తుపెట్టుకో నాన్నమ్మా. హైద్రాబాద్ స్టార్‌హోటల్లో టీ త్రాగడం వేరు, మన టౌన్ ఇరాని హోటల్లో టీ తాగడం వేరు"

"అలా మాట్లాడ్తావేంరా? దేశాభిమానం వుండక్ఖల్లా"

"ఎందుకులేదు? నీమీద నాకు ఎంత ప్రేమో, ఈ దేశంమీద అంతకంటే ఎక్కువ ప్రేమ! ప్రేమ వుంది కదాని ప్రేమించు



కుంటూ చేతులు కట్టుకుని కూర్చుంటే, ఈ దేశం మనకు ఏమీ ఇవ్వదు నాన్నమ్మా! మనతో డబ్బు వున్నంత వరకే నీవు నమ్మిన అనుబంధాలు కొనసాగుతాయి. అది లేకపోతే అందరూ మనకు శత్రువులే అవుతారు

"ఇక్కడ నెలంతా బండచాకిరి చేసి మహా అంటే వేలల్లో సంపాయించగలం. కాని అక్కడ ఇదే కష్టం చేస్తే లక్షలకి లక్షలు సంపాదించగలం" అన్నాడు.

"నాకంటే డబ్బే ముఖ్యమా? "

"కాదు కాబట్టి మళ్ళీ తిరిగి వస్తాను" చెప్పాడు శశాంక.

"ఎప్పుడు తిరిగివస్తావో ఏమో..." పరిమళాదేవిలో దిగులు.

"త్వరలోనే! అంటే... నా చదువు అయిపోయాక కొన్నాళ్ళు ఉద్యోగం చేసి తిరిగివస్తాను" అని చెప్పి ఓ రెండుక్షణాలు ఆగి, "వచ్చేవరకు నువ్వు, ఈ ఆస్తి అంతా క్షేమంగా వుండాలి" అన్నాడు అతడు.

"ఈ దెప్పిపొడుపులే వద్దురా" ఈసారి అతడ్ని వారించింది ఆమె.

"సరే సరే" ఆమె మనసును ఎక్కువగా నొప్పించడం ఇష్టంలేకపోయింది అతడికి.

ఆమె ఇంకేం మాట్లాడలేదు. త్వరలో అమెరికా వెళ్ళిపోతున్న మనవడి గురించే ఆలోచిస్తూ బరువైన మనసుతో అలాగే కూర్చుండిపోయింది.

ఇన్నాళ్ళూ కూడా మనవడు తనకు దూరంగానే వున్నాడు. కాపోతే పీలుస్తున్న గాలి, నివసిస్తున్న గడ్డ ఒక్కటే! అందుకే ఎంతోదూరం అన్పించే ఆ కొద్దిదూరాన్ని అయిష్టంగానైనా ఒప్పుకోగలిగింది. కాని ఇప్పుడు? నిజంగానే ఎంతోదూరం వెళ్ళిపోతున్నాడు. ఆ దూరాన్ని తను నిజంగా తట్టుకోలేదు. మరి ఇప్పుడేం చేయాలి?

ఆలోచిస్తున్న పరిమళాదేవి ఉన్నట్టుండి ఏదో గుర్తుకువచ్చిన దానిలా చప్పున మనవడివైపు చూస్తూ "శశీ" మృదువుగా పిలిచింది.

టీవీ చూస్తున్న శశాంక ఏంటన్నట్టుగా తిరిగి చూశాడు.

"ఇన్నాళ్లూ నాకోసమే అమెరికా వెళ్ళను అన్నావు. ఇప్పుడేమో అకస్మాత్తుగా వెళ్తాను అంటున్నావు. ఇక్కడికి వచ్చాకే నువ్వు ఈ నిర్ణయం తీసుకున్నట్టుగా తోస్తోంది. ఇందుకు కారణం నేను నీ మాటల్ని విన్పించుకోవడం లేదనే కదూ? " అడిగింది పరిమళాదేవి.

తన మనసును చదివినట్టుగా సూటిగా ఆమె ఆ ప్రశ్న అడగ్గానే ఒక్కక్షణం ఆశ్చర్యపోయి, ఆ తర్వాత తేరుకుని "అదే కారణం అనుకో! మరి నువ్వు వాళ్ళతో కల్పించుకోవడం మానేస్తావా? " అడిగాడు అతడు.

వెంటనే ఆమె ఏం మాట్లాడలేదు. మనవడివైపు ఆశ్చర్యంగా కాసేపు చూసి, ఆ తర్వాత అదే ఆశ్చర్యంతో ఏదో అనబోయింది. అంతలోనే శశాంక అందుకుని "నాన్నమ్మా! నిజానికి నాకు ఎవరిమీదా కోపంలేదు. కాపోతే మన ఆస్తిపాస్తులు అనవసరంగా దుర్వినియోగం అవుతున్నాయని బాధ వుంది! అసలు దుర్వినియోగం అయినా కాకపోయినా, ఆస్తుల్ని పెంచుకోవడం ఎవ్వరికైనా అవసరమే కదా! అందుకే నేను అమెరికా వెళ్ళొస్తాను. అయితే నువ్వు మాత్రం వాళ్ళతో... అదే... మీచెల్లెలు వాళ్లతో కల్పించుకోవడం మానెయ్యాలి. సరేనా? " అన్నాడు.

ఆమె అలాగే చూస్తోంది. మళ్ళీ అతడే అన్నాడు. "ఈ విషయంలో నన్ను కాదంటే మాత్రం, నేను ఇంకెప్పుడూ ఇక్కడికి రాను"

"నీకంటే ఈ ప్రపంచంలో ఎక్కువ ఏమీ లేదురా నాకు" అంతకంటే చెప్పలేకపోయింది పరిమళాదేవి.

"ఇప్పుడు మంచి నాన్నమ్మవి" శశాంక గొంతులో మెచ్చుకోలు.

ఆమె చిరునవ్వు నవ్వింది. ఆ నవ్వులో కొండంత మురిపెం. ఆ మురిపాన్ని మురి

పెంగానే చూస్తూ నెమ్మదిగా అక్కడ్నుంచి వెలుపలికి నడిచాడు శశాంక.

★ ★ ★

రెండు నెలల కాలం గడిచిపోయింది. మంచి ముహూర్తాలు ఆరంభం అయినం దున కావేరి పెళ్ళి పెట్టుకున్నారు. అప్పటికి శశాంక అమెరికా వెళ్ళిపోయాడు. మనవ డికి ఇచ్చిన మాటప్రకారం తన స్వంత ఆత్మీ యులతో ముభావంగా మెలగలేకపోయిన పరిమళాదేవి, ఎప్పటికప్పుడు మనవడ్ని మోసం చేస్తూ వచ్చింది.

"కన్నా శశీ! నీ మాటను ఆచరిస్తూ ఆత్మీ యతల్ని దూరంచేసుకోలేకపోతున్నాను. అందుకే నన్ను క్షమించరా!" అని మన సులో తలుస్తూ వుండటమే కాదు, ఓరోజు తనవాళ్ళకి అసలు విషయం చెప్పేసింది కూడా!

"వాడొట్టి మొండి వెధవ! మీరంటే అకా రణంగా మండిపడుతున్నాడు. వాడిది తెలి యని తనం. కాబట్టి వాడి ప్రకారం మనం కూడా వెళ్తే ఈ అనుబంధాలకు అర్థమే వుండదు. అందుకే వాడి దృష్టిలో మన ఇరువురి కుటుంబాలూ మునుపటిలా కాకుండా ఎడబాటుగా కనిపించాలి. అందుకు మనమంతా నిజాయితీగా నటిం చాలి" అన్న పరిమళాదేవి మాటను అందరూ తు.చ. తప్పకుండా పాటించసా గారు. అయితే పెళ్ళి ఆహ్వానాన్ని అందు కుని-నామమాత్రానికి వచ్చిన శశాంక మేన మామ ధనుంజయ ఎదుటగా, పరిమళా దేవి పరిస్థితి నడిసముద్రంలో నావలా తయారయ్యింది.

'తను పెళ్ళిలో కలుపుగోలుగా తిరిగితే ధనుంజయ ద్వారా ఆ విషయం ఎలాగైనా శశాంకకి తెలియవచ్చు. కాబట్టి తను కూడా నామమాత్రానికి వచ్చినట్లుగా వుండాలి' అని తలుస్తూ వచ్చిన బంధువుల్లో ఒకపక్కగా కూర్చుండిపోయింది పరిమళాదేవి. అంతలో పట్టులంగా, జాకెట్టు ధరించివున్న కస్తూరి అక్కడికి ఆత్రంగా ఆయాసపడుతూ పరుగె ట్టుకువచ్చింది.

"అమ్మమ్మా... అమ్మమ్మా..."

"ఏంటీ? " మురిపెంగా కస్తూరిని దగ్గ రగా తీసుకుంది పరిమళాదేవి.

"నీకో నిజం చెప్తాను. నాకో పదిరూపా యలు ఇస్తావా? "

"ఇస్తాను"

"అయితే ముందే ఇవ్వు" చేయి చాచింది కస్తూరి.

"తీసుకో" అంటూ నడుం దగ్గర దోపు కున్న మడతలోంచి పదిరూపాయల నోటుని అందించింది పరిమళాదేవి.

"ఆ... ముసల్దాని చీర చూశావా? ముసలి వయసుకు ముసుగేసినట్టు...! అమ్మో వయసు ముదిరినా చీరమాత్రం అదిరింది" అని అమ్మ నీ గురించి అమ్మ మ్మతో చెప్పింది. ఇందాకే చెప్పింది. నీమీద ఒట్టు" కళ్ళింతచేసి అదో రహస్యం అన్న ట్లుగా చెప్పింది కస్తూరి.

"నీకు దెబ్బలు పడ్తాయి" భయపెట్టింది పరిమళాదేవి.

"ఎందుకు? " బేలగా ముఖం పెట్టింది కస్తూరి.

"ముందు నువ్వు ఇక్కడ్నుంచి వెళ్ళు" ఈసారి కసిరింది పరిమళాదేవి.

"నిజం చెప్తే తిడుతున్నావు. ఇంకోసారి చెప్పనులే" ముఖం చిన్నబుచ్చుకుని అంటూ, అక్కడ్నుంచి లేచి వెళ్ళిపోయింది కస్తూరి.

'ఈ పిల్లకు కాస్త భయం చెప్పేవాళ్ళు లేక రోజురోజుకీ మితిమీరిపోతోంది. ఎటుతిరిగీ నా మెప్పుపొంది ఏదో ఒకటి కొట్టేయాలని ఎంత చలాకీ ప్రయత్నం? ' తనలో తను అనుకుంటూ అక్కడ్నుంచి లేచి లోపలికి నడిచింది పరిమళాదేవి.

లోపల కూడా అంతా హడావిడిగా వుంది. కుడిపక్కగా వున్న గదిలో కావేరిని ముస్తాబు చేస్తున్నారు ముత్తయిదువలు.

వాళ్ళ పక్కనే కావేరి స్నేహితురాళ్ళు ఐదారుగురు వున్నారు. వాళ్ళు పట్టులంగా, జాకెట్లు ధరించి, లేతవయసుకు నిదర్శనంగా తోస్తున్నారు.

'ప్చ్! కావేరమ్మ మాత్రం పెద్దదైపోతోంది'

దిగాలుగా మనసులో తలుస్తూ ఆ గదిలోకి వెళ్ళింది పరిమళాదేవి.

"ఎలా వున్నాను అమ్మమ్మా? " ఆమె రాగానే అడిగింది కావేరి.

"బంగారు బొమ్మలా వున్నావు" చెప్పింది పరిమళాదేవి.

"నిజంగానా? " కళ్ళింతచేసింది కావేరి.

"అవును మరి" అంటూ కావేరి బుగ్గల్ని నిమిరి, వ్రేళ్ళని కణతలకు ఆన్చి తీసింది పరిమళాదేవి.

"నువ్వు ఇక్కడే వుండాలి. ఎక్కడికీ వెళ్ళొద్దు" కావేరిలో మారాం.

"ఇక్కడే వున్నానుగా? "

"ఇక్కడే అంటే పెళ్ళిలో అందరితోపాటుగా కాదు, నాపక్కలోనే..."

"నేను నీ పక్కలో కూర్చుంటే ఎలా? అవతల వచ్చినవాళ్లతో మాట్లాడొద్దూ? ఏ ఒక్కర్ని పలకరించకపోయినా చిన్నబుచ్చుకుంటారుకదా"

"అయితే కాసేపైనా కూర్చుని వెళ్ళు"

"సరే" అంటూ అక్కడే వున్న కుర్చీలో కూర్చుండిపోయింది పరిమళాదేవి.

ఆకుపచ్చరంగు చెంగావి పట్టుచీర, అదే కాంబినేషన్‌లో జరీఅంచు, జాకెట్టు, పూల జడ, నుదుట కళ్యాణతిలకం, తోడుగా అందాన్ని ఇనుమడింపజేస్తున్న ఆభరణాలు, దిగివచ్చిన దేవకన్యలా తోస్తోంది కావేరి. అందుకే పరిమళాదేవి మనవరాలి మీది నుండి కళ్ళను తిప్పుకోలేకపోతోంది.

ఇంతలో మళ్ళీ పరుగెట్టుకు వచ్చింది కస్తూరి.

"అమ్మమ్మా... అమ్మమ్మా..."

"ఏంటీ? " ప్రేమగా కస్తూరిని దగ్గరగా తీసుకుంది పరిమళాదేవి.

"ఇట్రా" అంటూనే పరిమళాదేవి చేయిపట్టిలాగింది కస్తూరి.

"ఎక్కడికి? "

"నువ్వు ముందు వచ్చేయ్..."

"పదా" అంటూ కస్తూరి వెంటే నడిచింది పరిమళాదేవి.

కస్తూరి నేరుగా లోపలి గదుల్లోకి వెళ్లింది. చివరి గదిలో జానకీదేవి, శకుంతల, సూర్యప్రకాష్‌రావులు మాత్రమే వున్నారు. వాళ్ళలో వాళ్ళు ఏదో సీరియస్‌గా మాట్లాడుకుంటున్నారు.

"చప్పుడు చేయకుండా విను" అంది కస్తూరి కానీ పరిమళాదేవిని శకుంతల గమనించింది.

పరిమళాదేవి భృకుటి ముడిచి ఆ గది తాలూకు కిటికీదాకా వెళ్ళింది. అదే సమయంలో శకుంతల,

"పెద్దమ్మ గనుక ఈ డబ్బులు ఇవ్వకపోయివుంటే నిజంగా మనం ఎన్ని అవస్థలు పడేవాళ్ళమో? " అంటూ బాధగా అంది.

అంతలోనే మాట మార్చిన శకుంతలను, మిగతా ఇద్దరూ అర్థం చేసుకున్నారు.

"అవును! మా అక్క దేవత" వంత పాడింది జానకీదేవి.

"వదినమ్మ పాదాలకి పదివేలసార్లు నమస్కారాలు చేసినా రుణం తీర్చుకోలేము" సూర్యప్రకాష్‌రావులో అత్యంత వినయం.

వాళ్ళ మాటలు విన్న పరిమళాదేవి కస్తూరివైపు కోపంగా చూసింది. ఆ తర్వాత ఇంకేమాత్రం ఆలస్యం చేయకుండా కస్తూరి చేయిపట్టి అక్కడ్నుంచి లాక్కెళ్లినట్లుగా వెళ్ళిపోయింది.

"నీమీద ఒట్టు అమ్మమ్మా! ఇందాక వాళ్ళు నిన్ను తిట్టుకున్నారు. నేను విన్నాను" వెక్తుంటే అంది కస్తూరి.

పరిమళాదేవి విన్పించుకోలేదు.

"నీకేమైనా కావలిస్తే మంచి మాటలతో అడిగి ఇప్పించుకో. ఇంతేగానీ ఇట్లాటి అబద్ధాలు చెప్తే మాత్రం నాలుక కోసేస్తాను"




అంటూనే వీపుమీద ఒక్కటి ఇచ్చుకుంది.

"నేను అబద్ధం చెప్పలేదు" అంటూ గయ్యిమని ఏడ్చింది కస్తూరి.

ఆ మాత్రానికే కస్తూరిమీద జాలేసింది పరిమళాదేవికి. అందుకే చప్పున దగ్గరకి తీసుకుని "సరేలే... సరేలే" బుజ్జగింపుగా అంది.

"ఏంటే ఏడుస్తున్నావు?" అదే సమయంలో గదిలోంచి వెలుపలకి వచ్చింది శకుంతల.

"ఏంలేదు. ఏదో తుంటరిపని చేస్తుంటే కొట్టానంతే" చెప్పింది పరిమళాదేవి.

"తుంటరితనం ముందుపుట్టి, తర్వాత ఇది పుట్టింది. దీంతో ఎలా వేగాలో ఏమో?" అంటూనే దగ్గరగా వచ్చి కస్తూరిని లోపలికి తీసుకెళ్ళబోయింది శకుంతల.

"మళ్ళీ దాన్ని కొడతావా ఏంటి?" గాభరాపడింది పరిమళాదేవి.

"ఏంలేదు" అంటూనే కస్తూరిని వేగంగా లోపలికి తీసుకెళ్ళి అట్నుంచి పెరట్లో ఒకపక్కగా ఏర్పాటుచేసిన వంటశాలలోకి వెళ్ళి, మండుతున్న కట్టెను చేతిలోకి విసురుగా తీసుకుని... అనూహ్యంగా కస్తూరి చేయి మీద వాత పెట్టింది శకుంతల.

"అమ్మా..." ఆ బాధకు గుండెలు అవిసేలా ఒక్కసారిగా కేకపెట్టింది కస్తూరి.

"అయ్యో...అయ్యో..." సమీపంగా వున్న వంటవాళ్ళతో పాటుగా, ఒకరిద్దరు బంధువులు కూడా కంగారుగా కస్తూరి దగ్గరికి వచ్చేలోపే... వెనకే వచ్చిన పరిమళాదేవి చప్పున శకుంతలను నెట్టేసి కస్తూరిని దగ్గరగా తీసుకుంది. ఆ పిల్ల పెద్దపెట్టున ఏడుస్తూ పరిమళాదేవిని అల్లుకుపోయింది.

"సిగ్గులేదటే? పిల్లను ఇంత రాక్షసంగా కాలుస్తావా? ఎంత కాఠిన్యమే నీకు? పిల్లలకు బుద్ధిచెప్పే పద్ధతి తెలియకపోతే తెలుసుకో. అంతేగాని ఆవేశంతో ఇట్లాంటి అనర్థం పనులు చేస్తే మాత్రం నేను ఒప్పుకోను" ఆవేశంకొద్దీ శకుంతలమీద కోప్పడి "నా బంగారు తల్లివి కదూ! వూరుకోమ్మా! ఇకనుండి నువ్వు నా దగ్గరే వుందువుగాని" అని చెప్పి కస్తూరిని అక్కడ్నుండి తీసుకెళ్ళిపోయింది పరిమళాదేవి.

కాసేపు అక్కడే నిలబడిపోయి, తర్వాత తను కూడా నెమ్మదిగా లోపలికి నడిచి తల్లిదండ్రులకోసం అటూ ఇటూ చూసింది శకుంతల. వాళ్ళు బయట వరండాలో పనివాళ్ళకు ఏదోపని పురమాయిస్తూ కనబడ్డారు. నిల్చున్నచోటునుండే వాళ్లను పిలవబోయింది. అంతలోనే పక్కనుండి వచ్చాడు భర్త వరప్రసాద్.

"శకుంతలా..."

"ఇంతసేపూ ఎక్కడికి వెళ్లారు?" అడిగింది శకుంతల.

"నా పనుల్లో నేను వున్నాను" అన్నాడు వరప్రసాద్.

"ఒకసారి మీరు డాబా మీదకు వస్తారా?" అంటూనే మెట్లవైపు నడిచింది శకుంతల.

"ఎందుకే?" అడుగుతూ వెనకే వెళ్ళాడు వరప్రసాద్.

"మనం సక్సెస్ అయినట్టే" డాబామీదకు వెళ్ళగానే అటూ ఇటూ చూసి, భర్తకు మాత్రమే వినబడేలా అంది శకుంతల.

"ఏ విషయంలో?" ఆసక్తిగా అడిగాడు వరప్రసాద్.

"ముసల్దాన్ని కాకా పట్టడానికి ఇన్నిరోజులూ కావేరిని ఉపయోగించుకున్నామా? అయితే అది బాగానే సక్సెస్ అయ్యిందికదా! కాగా కస్తూరి మాత్రం కాకా పట్టడంలో పనికిరానిది అనుకున్నాం. కాని అది మరో రూట్లో మనకు బాగా హెల్ప్ చేసింది. ఎలా అంటే... అదేదో తుంటరిపని చేస్తే అదే సమయమనుకుని దాని చేతిమీద బాగా వాత పెట్టాను" శకుంతల చెప్పుకుపోతోంది.

"అయ్యయ్యో..." కంగారు పడిపోయాడు వరప్రసాద్.

"మన బిడ్డను గాయపర్చడం నాకు మాత్రం ఇష్టమా? కాపోతే అవసరం. అందుకే మనసును రాయిచేసుకుని మరీ వాతపెట్టాను" అంది శకుంతల.

వరప్రసాద్ మాత్రం తట్టుకోలేనట్టుగా తల విదిలించి, నిలబడలేక నిలబడిపోయాడు అక్కడ.

"మనం ఇంత కష్టపడుతున్నది మన పిల్లల కోసమేకదా! కాబట్టి అవసరానికి చిన్నదాన్ని కష్టపెట్టానని బాధపడిపోవద్దు. ముందు నేను చెప్పేది విను" అంది శకుంతల.

"ఆ" సరే అన్నట్టుగా అన్నాడు అతడు. కాని అతడి మనసు మాత్రం కూతురివైపే వుంది.

"ఇప్పుడు ఆ కుర్రాడు శశాంక అమెరికా వెళ్ళిపోయాడు. మళ్ళీ తిరిగి వస్తాను అన్నాడేగాని, నాకు మాత్రం ఆ నమ్మకంలేదు. సంపాదనకు మరిగితే అక్కడే సెటిలైపోతాడు. కాబట్టి మనం రెండవసారి ప్లాన్ చేసినట్టుగా వాణ్ని తీసెయ్యడం అంత సులభమైన పనికాదు. అందుకే మొదటిసారి అనుకున్నట్టుగానే "కర్ర విరగకుండా పాము చచ్చే" ప్రయత్నం చేద్దాం.

ఇప్పుడు కస్తూరి మళ్ళీ మన ఇంటికి వచ్చినా, దాని తుంటరి మనస్తత్వాన్ని ఆసరా పెట్టుకుని దాన్ని ఆ ముసల్దాని ఎదురుగా కావాలని శిక్షిద్దాం. అప్పుడు ఆ ముసల్ది మన కస్తూరిని పర్మనెంటుగా తన ఇంటికి తీసుకువెళ్ళడం ఖాయం. ఆ తర్వాత ఆ ముసల్దాన్ని ఘోరంగా దెబ్బతీయాలి. ఎలా అంటే... ఆ ముసల్ది కింద పడి కాలో చెయ్యో విరగాలి. అప్పుడు బుచ్చమ్మను పక్కకు పెట్టేసి, ఆత్మీయులం మనమే సేవలు చేయాలి. ఆ సమయంలోనే మనవడికి విషయం తెలియజేసినట్టు చెప్పాలి. కాని మనం ఆ విషయాన్ని వాడికి తెలియజేసేదీ లేదూ, వాడు వచ్చి చూసేదీ లేదు. ఇంక ఎలాగూ వాడి అమ్మమ్మావాళ్లూ ఈ ముసల్దాని ఇంటికి రావడమే వుండదు" ఏకబిగిన చెప్పుకుపోసాగింది శకుంతల.

వింటూ తలాడిస్తున్నాడు వరప్రసాద్.

"ఇప్పటికే మనవడి ప్రవర్తనమీద ఆ ముసల్దానికి విసుగొచ్చింది. వాడి ప్రవర్తనకు కారకులం మనమే. కాబట్టి వాడికి వ్యతిరేకంగా మనం ఆ ముసల్దానితో ఇంకా ఇంకా కలివిడిగా వుండాలి. దీంతో ఆ ముసల్ది అటూ ఇటూ కానట్టుగా తయారవుతుంది. ఆ తర్వాత మనవడిమీదే విసుక్కోవడం ఖాయం!" ఈసారి భర్త భుజాలపై ఉద్వేగంగా చేయివేసింది శకుంతల.

అతడు చిన్నగా నవ్వి వూరుకున్నాడు.

★ ★ ★

పెళ్లి ముహూర్తం ఆసన్నమైంది. పెళ్లికొడుకు వరుణ్ పెళ్ళిపీటలమీద కూర్చుని వున్నాడు. పురోహితుడు వేదమంత్రాలు చదువుతున్నాడు. బంధువులు అందరూ పెళ్ళిపందిరినిండా కూర్చుని వున్నారు. పరిమళాదేవి కూడా అందరిలో ఒకరిగా కూర్చుని, కస్తూరిని తన దగ్గర ప్రేమగా కూర్చోబెట్టుకుని వుంది.

కాసేపటి తర్వాత ఐదారుగురు ముత్తయిదువలు కావేరిని కల్యాణవేదిక మీదకు తీసుకువచ్చారు. సిగ్గుల మొలకలా... సింగారి పువ్వులా వున్న కావేరి, పెళ్లికొడుక్కి ఎదురుగా వున్న పీటమీద ఒద్దికగా ఒదిగి కూర్చుంది.

పెళ్ళికి వచ్చిన వాళ్ళల్లో చాలామంది జనాలు, దంపతులు కాబోతున్న కావేరీ వరుణ్‌లను చూస్తూ, "చిన్న పిల్లలు! చూడ ముచ్చటగా వున్నారు. కాపోతే ఇంత త్వరగా పెళ్లిచేయాల్సిన అవసరం ఏమిటో?." అనుకున్నారు. కొందరైతే "ఇంత చిన్నవయసులో పెళ్ళిచేయడం దేనికి? ఛీఛీ" అని ఇరువురి తల్లిదండ్రుల్ని తమలో తాము తిట్టుకున్నారు. ఇంకొందరైతే "ఈ వయసులో పెళ్లి మాకు నచ్చలేదు" అని





తమలోతామే తోసిపుచ్చుకున్నారు. ఏ కొందరో మాత్రమే ఆ కొత్తజంటను మన స్ఫూర్తిగా మెచ్చుకున్నారు.

ఎవరైనా ఏమైనా అనుకోనీ! పెళ్ళి మాత్రం నిరాటంకంగా ముగిసింది. భోజన ఏర్పాట్లు బ్రహ్మాండంగా జరిగాయి. మటన్, చికెన్, ఎగ్ ఇలా ఏది ఇష్టం వున్నవాళ్ళకు ఆ వంటకం తయారుచేశారు. శాకాహారు లకు ప్రత్యేకంగా భోజన ఏర్పాట్లు గావిం చారు.

ఆ సాయంకాలానికే చాలామంది బంధు వులు తమ ఇళ్లకు వెళ్ళిపోయారు. మిగిలిన కొందరు మాత్రం కావేరి వెంట ఆమె మెట్టి నింటికి తయారవసాగారు.

రఘుబాబు వెళ్ళిపోయినా అతడిపేరు ఇంకా మిగిలేవుంది కాబట్టి, అతడి తరపున చాలామంది పెద్ద మనుషులు ఆ పెళ్లికి వచ్చి తలంబ్రాలు కాగానే వెళ్ళిపోయారు. వాళ్ళతోపాటుగానే ధనుంజయ కూడా వెళ్ళి పోయాడు. కాగా పరిమళాదేవి మాత్రం కస్తూరిని తీసుకుని తన ఇంటికి వచ్చింది. అక్కడ కూడా కొందరు బంధువులు విడిది చేశారు. వాళ్ళందరికీ అన్ని అవసరాల్ని బుచ్చమ్మే చూస్తోంది. ఆ విషయాన్ని రాగానే అడిగింది పరిమళాదేవి.

"ఏమే బుచ్చమ్మా! అందరికీ అన్ని అవస రాలు చూశావుకదా!"

"సూశాను అమ్మగోరూ"

"ఎవ్వరికీ ఏమీ తక్కువ కాకూడదు. లేదంటే మన పరువుపోతుంది"

"నాకు తెల్సులే అమ్మగోరూ!"

బుచ్చమ్మతో పరిమళాదేవి ఇంకేం మాట్లా డలేదు. "మీకు ఏం కావల్సినా మొహమాట పడకుండా బుచ్చమ్మను అడగండి" బంధు వులకు చెప్తూ కస్తూరిని తీసుకుని మేడమీది గదిలోకి వెళ్ళిపోయింది. అక్కడికి వెళ్ళాక పరిమళాదేవిని బిగ్గరగా చుట్టేస్తూ... "అమ్మమ్మా! నేను ఎప్పుడూ నీ దగ్గరే వుంటానూ? " అడిగింది కస్తూరి.

"సరే! నిన్ను ఎవరు వద్దన్నారు? " లాల నగా కస్తూరి వీపు నిమిరింది పరిమళాదేవి.

★ ★ ★

"ముసల్దానికి మనమీద అనుమానం రాలేదుకదా? " అనుమానంగా అంది శకుం తల.

"అనుమానం ఎందుకు వస్తుంది? " అడి గింది జానకీదేవి.

"పెళ్ళిలో మనం దాని గురించి మాట్లాడు కున్నాం చూడూ అప్పుడు ఆ ముసల్ది ఎవరో చెప్పి పంపినట్టుగా మన గది దగ్గ రకు రావడమంటే? " చివరగా రాగం తీసింది శకుంతల.

"యథాలాపంగా వచ్చి వుంటుందిలే" సర్ది చెప్పాడు సూర్యప్రకాష్‌రావు.

"కాదు కాదు, మన కస్తూరి చెవుల్లో మన మాటలు పడివుంటాయి. అదే వెళ్ళి ఆ ముసల్దాన్ని తీసుకువచ్చినట్టుంది. సమయా నికి నేను గమనించి మాట మార్చాను కాబట్టి, తుంటరిపని చేశావని ఆ ముసల్ది దాన్ని కొట్టినట్టుగా వుంది" అని శకుంతల అనగానే-

"అందుకే వేళాపాళా లేకుండా ఆవిడ విష యాల్ని మాట్లాడవద్దంటాను" అన్నాడు వర ప్రసాద్.

"నువ్వు చెప్పావుగా, తప్పక పాటిస్తాంలే!" వ్యంగ్యంగా అంది శకుంతల.

"ఇప్పుడు నేను ఏంతప్పు చేశానని ఆ వ్యంగ్యం? " చిన్నబుచ్చుకున్నాడు వరప్ర సాద్.

"చెప్పావని నేను అనడంలేదు. నోరు మూసుకుంటే చాలు అంటున్నాను" కసి రింది శకుంతల.

మరీ చిన్నబుచ్చుకున్నాడు వరప్రసాద్.

అక్కడ్నుండి వెళ్ళబోయాడు.

"ఇదిగో" పిలిచింది శకుంతల.

ఏంటన్నట్టుగా ఆగి చూశాడు వరప్ర సాద్.

"ఎప్పుడూ లేనిదీ ఈరోజు రోషం

పుట్టుకు వచ్చినట్టుంది. నీ రోషాన్ని ఎవ్వరూ పట్టించుకోరుగాని. ఈరోజు ఎక్కడికీ వెళ్ళొద్దు. నీతో చాలాపని వుంది" అంది శకుంతల.

"ఏంపని? " అడిగాడు వరప్రసాద్.

"ఈరోజు మనకు శుభదినం! ఆ ముసల్దానికి అశుభదినం! ఎందుకంటే సమయానుకూలాన్ని బట్టి ఆ ముసల్దానికి ఈరోజు కాళ్లూ, చేతులూ విరగబోతున్నాయి" అని శకుంతల చెప్పగానే-

"నియంతలమో, కర్తలమో, అసలు ఎవరమో తెలీదుగాని ఇంకాసేపట్లో అందుకు ముహూర్తం పెట్టేద్దాం" అన్నాడు సూర్యప్రకాష్‌రావు.

"సరే" అంటూ నెమ్మదిగా తలపంకించాడు వరప్రసాద్.



పరిమళాదేవి కర్ర కుర్చీలో కూర్చుని, తనముందు నిల్చుని వున్న కస్తూరి చేతిగాయానికి మందు పూస్తోంది.

పరిమళాదేవికి ఎడంగా కూర్చుని వుంది బుచ్చమ్మ. ఆమె కస్తూరి గాయంపైపే తీక్షణంగా చూస్తోంది.

"ఏంటే అలా చూస్తున్నావు? నీ దిష్టి తగిలి గాయం పెద్దదై పోయేట్టుంది" బుచ్చమ్మను గమనించిన పరిమళాదేవి సరదాగా అంది.

"అదిగాదు అమ్మగోరూ! నాకో సిన్న అనుమానం" అని ఆ వెంటనే "ఏందంటే... కాలిన దెబ్బ తగ్గుముకం పట్టింది సరే, మరి దెబ్బ పూర్తిగా తగ్గిపోయిన తర్వాత తెల్లమచ్చలు మిగిలిపోతాయిగదా అమ్మగోరూ! సూడ్డానికి ఆ మచ్చలు బొల్లిలా కనబడ్తే సూసేటోళ్లకు బాగుండదుకదా! అందుకే శానా బాద అయిపోతుంది నాకు..." బాధగా అంది బుచ్చమ్మ.

అందుకు చిన్నగా నవ్వింది పరిమళాదేవి.

"నవ్వుతున్నారు. అంటే మచ్చలు తగ్గిపోయే మందు తమరికి తెల్సున్నమాట! ఎందుకు తెల్వదూ? పెద్ద పెద్ద రోగాలకే పసర్లు తెలుసు తమరికి. ఈ సిన్నమచ్చలకి మందు తెల్వకుండా వుంటుందా? " అంటూనే ఆసక్తిగా ముందుకు జరిగింది బుచ్చమ్మ.

పరిమళాదేవిలో అదే చిరునవ్వు.

"ఆ మందు ఏంది అమ్మగోరూ? " అడిగింది బుచ్చమ్మ.

"మరేం లేదే! ఎండిన తుమ్మచెక్క వుంటుందికదా! ఆ చెక్కను బాగా నల్లగా పెనంమీద కాల్చి మెత్తగా పొడిచేసి, ఆ పొడిని కొబ్బరి నూనెలో కలిపి, రోజూ రాత్రిపూట పడుకోబోయే ముందు మచ్చల మీద పూస్తే సరి! కొందరికి కొన్నివారాల్లో, మరికొందరికి కొన్ని నెలల్లో, మచ్చలు పూర్తిగా మాయమై కాంతివంతమైన కొత్త చర్మం పుట్టుకువస్తుంది. అయితే ఇక్కడ ఒక్క విషయం గుర్తుపెట్టుకోవాలి. తుమ్మచెక్క అంటే మామూలు మురికితుమ్మగా పిలవబడే కంపతార చెట్టుకాదు, అరుదుగా కనిపించే మంచి తుమ్మచెట్టు తాలూకు చెక్కనే ఉపయోగించాలి.

"ఓలమ్మో... ఓలమ్మో... అన్నీ మనకు తెల్సిన మొక్కలే! కాని వాటిలోని




మయిత్యం మంత్రం ఎవ్వరికీ తెల్వదు..." అని ఇంకొంచెం ముందుకు జరిగి- "అవును అమ్మగోరూ! ఇంట్లో కోడలుపిల్లకు పొద్దుట్నుంచి ఒక్కటే బయటికి! చెంబుకీ దానికీ పోటీ పడినట్టుగా వుంది. ఏంసేయాలో సెప్పండి అమ్మగోరూ" అడిగింది బుచ్చమ్మ.

"పెరుగులో చింతకాయ చెట్నీ కలుపుకుని తాగమని చెప్పు" చెప్పి, "గాయం ఇప్పుడు కూడా నొప్పెడుతోందా? " కస్తూరిని అడిగింది పరిమళాదేవి.

"చల్లగా వుంది"

"అయితే వెళ్ళి పడుకో/పో"

"ఊహూ" తల అడ్డంగా వూపింది కస్తూరి.

"మరి? " అడిగింది పరిమళాదేవి.

"అమ్మ దగ్గరకి వెళ్తాను"

నవ్వింది పరిమళాదేవి. నవ్వుతూనే- "ఎంతయినా కన్నతల్లి కన్నతల్లే! అది కోపంలో ఇంత గాయం చేసిందేగాని దాని క్కూడా మనసంతా దీనిమీదే ఉండిఉంటుంది" అని, "బుచ్చమ్మా బాగా చీకటిపడింది, కాస్త ఆ టార్చిలైటు తీసుకుని దీన్ని వదిలిపెట్టి వచ్చేయ్" చెప్పింది.

"అట్టాగే అమ్మగోరూ" అంటూ అరచేతుల్ని నేలకు కష్టంగా ఆన్చి లేచి నిల్చుంది బుచ్చమ్మ.

బుచ్చమ్మ కస్తూరిని వెంట తీసుకుని బయలుదేరింది. అదే అదనుగా పరిమళాదేవి ఇంట్లోకి ప్రవేశించారు సూర్యప్రకాష్.

రావు, వరప్రసాద్ ఇద్దరూనూ.

అప్పటికి పరిమళాదేవి తన పడకగది లోకి వెళ్ళిపోయింది. మామా అల్లుళ్ళు ఆ విషయాన్ని గమనించారు.

"వదినమ్మ పడుకున్నట్టుందే? " గట్టిగానే అన్నాడు సూర్యప్రకాశరావు.

"అవును" వంతపాడాడు వరప్రసాద్.

వాళ్ళ గొంతు పరిమళాదేవికి వినబడిందో లేక ఏదైనా పని వుండి బయటకు వచ్చిందో తెలీదుగానీ బయటకు రాగానే వాళ్ళిద్దర్నీ చూస్తూ ఆశ్చర్యపోయింది.

"సూర్యం? "

"కస్తూరి కోసం వచ్చాం వదినమ్మా"

"కస్తూరిని ఇప్పుడే బుచ్చమ్మను తోడుగా ఇచ్చి పంపించాను" అంటూ అక్కడ్నించి ముందుకు నడుస్తూ, "కూర్చోండి సూర్యం! నాకూ నిద్దర రావట్లేదు" అంది పరిమళాదేవి.

మామాఅల్లుళ్ళు ఇద్దరూ ఒక్కో కుర్చీలో ఆసీనులు అయ్యారు. పరిమళాదేవి వచ్చి వాళ్ళ ఇద్దరికీ మధ్యగా వున్న కుర్చీలో కూర్చుంది.

"ఇంట్లో కస్తూరి లేకుండా వుండలేకపోతున్నాను" అన్నాడు సూర్యప్రకాశరావు.

"నేనూ అంతే" అన్నాడు వరప్రసాద్.

"ఆత్మీయతలు అలాగే వుంటాయి" అంటూ చిన్నగా నవ్వింది పరిమళాదేవి.

"అందుకేనేమో? ఆ పిల్లకోసం ఇద్దరం పరుగెత్తుకువచ్చాం" తను కూడా చిన్నగా నవ్వాడు సూర్యప్రకాశరావు.

తర్వాత కొంతసేపటివరకూ పిచ్చాపాటీ మాట్లాడుతూ కూర్చుండిపోయారు ముగ్గురూ. అప్పటికి బుచ్చమ్మ వచ్చేసింది. ఆమె వచ్చాక అందరికీ తెల్సిన విషయాల్నే మళ్ళీమళ్ళీ మాట్లాడ్డం అనేది తనదైన అలవాటుగా కొనసాగించడం మొదలుపెట్టింది.

"ఓలమ్మో... పెండ్లిలో మన కావేరమ్మగోరు ఎంత బొద్దుగా... ఎంత ముద్దుగా... కండ్లు మెరిసిపోయేటట్టు కనిపించినారు. పచ్చసీర కట్టుకుని, లచ్చిమిదేవత లెక్కన సొమ్ములు వేసుకుని, బారెడు జడకి గంపెడు పూలు పెట్టుకుని, సిన్మాయాక్టరు లెక్కన నడిసొస్తుంటే... అందరూ ఆయమ్మనే సూసినారు. ముసిముసిగా నవ్వుకున్నారు కూడా! అంతేనా? యువరాజు లెక్కన కొత్త పెండ్లికొడుకు పుస్తె గడుతుంటే మన కావేరమ్మ ఇంగ పరాయిపిల్ల అయిపోతుందని అమ్మగారి కండ్లల్లోనే కాదు, నా కండ్లల్లో కూడా నీళ్ళు

వచ్చాయి..."

"బుచ్చమ్మా! కాస్త నీ నోటికి తాళం వేసు కుంటావా? మేం అందరం హాయిగా బత కగలం" ఎప్పట్లా ఆమెను వారించింది పరి మళాదేవి.

"మాట్లాడ్తున్నాను అమ్మగోరూ" అమాయ కంగా అంది బుచ్చమ్మ.

"ఆ మాటలే ఇక చాలు" అంది పరిమళా దేవి.

బుచ్చమ్మ ఇంకేం మాట్లాడలేదు. ఆమెను చూస్తుంటే వరప్రసాద్‌కి నవ్వొచ్చింది. నవ్వుతూ "బుచ్చమ్మవ్వకి ఇదొక మహ చెడ్డ అలవాటు" అన్నాడు.

"అరవ నేర్చిన నోరు ఆరొద్దులకిగానీ ఆగ దంట, బుచ్చమ్మా...! వెళ్ళి మంచినీళ్ళు పట్రా" నవ్వుతూ చెప్పాడు సూర్యప్రకాశ రావు.

వెంటనే లేచి లోపలికి వెళ్ళింది బుచ్చమ్మ. అదే అవకాశంగా తలుస్తూ, "అరరే... అట్టాగే 'వాము' తెమ్మనడం మర్చిపోయానే" అన్నాడు సూర్యప్రకాష్ రావు.

"దగ్గు ఎవరికి?" అడిగింది పరిమళా దేవి.

"మీ చెల్లెలు ఈ ఉదయంనుండి దగ్గుతో ఒకటే బాధపడుతోంది. అవేవో మాత్రలు తెచ్చిస్తే ఎంతమాత్రం ఫలితం కనబడలేదు. ఇంగ్లీషు మందులు పనిచేయకపోయినా, వాములో ఉప్పు కలుపుకుని రాత్రివేళ తింటే ఉదయంవరకూ మంచి ఫలితం కనబడు తుందికదా..." అన్నాడు సూర్యప్రకాశరావు.

"బుచ్చమ్మను మళ్ళీ మళ్ళీ అటూఇటూ తిప్పడం దేనికి? పాపం! ఈమధ్యనే దానికి చత్వారం మొదలయ్యింది. నేనే వెళ్ళి తీసు కువస్తాను" చెప్తూనే లేచి లోపలికి నడిచింది పరిమళాదేవి.

"వెళ్ళదేమో అని భయపడ్డాను. వెళ్ళింది" ఆమె పూర్తిగా వెళ్ళిపోయేవరకు ఆగి, ఆ తర్వాత గుసగుసగా అన్నాడు సూర్యప్రకాశ రావు.

"నేను కూడా భయపడ్డాను" అదే రేంజ్‌లో అన్నాడు వరప్రసాద్.

కాసేపటి తర్వాత బుచ్చమ్మ మంచినీ ళ్ళతో, పరిమళాదేవి వాము పొట్లంతో వెలు పలికి వచ్చారు. అప్పటికి తమ పని పూర్తి గావించి, ఏమీ ఎరుగనట్లుగా ఎప్పట్లా కూర్చుని వున్నారు మామాఅల్లుళ్ళు.

సూర్యప్రకాశరావుకి అసలు దప్పికే కావ డంలేదు. అయినప్పటికీ చెంబుడు నీళ్లను గటగటా తాగేశాడు. ఇక జానకీదేవికి దగ్గూ లేదూ బొగ్గూలేదు. అయినప్పటికీ వాము పొట్లాన్ని అందుకుని జాగ్రత్తగా పట్టుకుని కూర్చున్నాడు వరప్రసాద్. తర్వాత మనసు నిండా తృప్తి నింపుకుని, మరో పదినిమి షాలు ఉబుసుపోక మాటలు మాట్లాడి, ఆ తర్వాత అక్కడ్నుంచి నెమ్మదిగా బయటప డ్డారు మామాఅల్లుడు.

బయట గేటుదాకా రాగానే చప్పున ఆగి పోతూ "మావయ్యా! వాము పొట్లం అక్కడే మర్చిపోయాను. వెళ్ళి తీసుకువస్తాను" అంటూనే తిరిగి ఇంట్లోకి వడివడిగా నడి చాడు వరప్రసాద్.

"వీడొకడు. మతిమరుపు సన్నాసి" మన సులో అల్లుడ్ని తిట్టుకుంటూ అక్కడే నిలబ డిపోయాడు సూర్యప్రకాశరావు.

వరప్రసాద్ ఇంట్లోకి వెళ్ళాడు. పరిమళా దేవి అప్పుడే మేడమీదకి వెళ్తోంది. బుచ్చమ్మ ఆవులిస్తూ అక్కడే కూర్చుని వుంది.

"ఏం బుచ్చమ్మా? నిద్రొస్తున్నట్లుగా వుంది. వెళ్ళి పడుకోరాదూ?" అంటూ వెళ్ళి అక్కడే పడివున్న వాము పొట్లాన్ని వంగి అందుకున్నాడు.

"ఏంటి అల్లుడూ?" తిరిగిచూస్తూ అడి గింది పరిమళాదేవి.

"వాము పొట్లాం. ఇక్కడే మర్చిపోయాను అత్తమ్మా" చెప్పి"బుచ్చమ్మా! మరేం అనుకో కుండా టార్చిలైటు తెచ్చిస్తావా?" అనడి





గాడు వరప్రసాద్.

"అయ్యో! బాబుగోరూ! దాంట్లో అనుకోవడం ఏముంది? " అంటూనే నెమ్మదిగా లేచి ఎధంగా వున్న గదివైపుగా నడిచింది బుచ్చమ్మ.

పరిమళాదేవి మేడమీదకి ఒక్కోమెట్టు మెల్లగా ఎక్కుతూ వెళ్తోంది. ఆమెను అలాగే చూస్తూ తన కుడిచేతిని నెమ్మదిగా పక్కనే వున్న పూలకుండీలోకి పోనిచ్చాడు వరప్రసాద్.

★ ★ ★

"అయ్యయ్యో! ఇదేం ఖర్మరా దేవుడా!" ఉదయాన్నే లేచి బాత్‌రూమ్‌కి వెళ్ళిన జానకీదేవి బలంగా అక్కడ జారిపడి, పెద్దపెట్టున గగ్గోలు పెట్టసాగింది.

"ఏమయ్యింది... ఏమయ్యింది? " అంటూ ఇంట్లో అందరూ అక్కడికి కంగారుగా చేరుకున్నారు.

"నాకు లేవడానికి కూడా రావట్లేదు దేవుడా" అందర్నీ చూస్తూ రాగం మరింత పెంచింది జానకీదేవి.

భర్త, అల్లుడు, ఇద్దరూ కలిసి ఆమెకు సాయంపట్టారు. అప్పటికే భయంతో ఆమె శరీరం చెమటలు కక్కింది. తోడుగా నిలువెత్తున వణికిపోతోంది.

"ఇదేంటి? రివర్స్‌కేసు? " శకుంతల తన లోతను కంగారుపడిపోసాగింది.

జానకీదేవి అలాగే గగ్గోలు పెడుతోంది. మామాఅల్లుడు ఇద్దరూ ఆమెను అలాగే ఒడిసిపట్టుకువెళ్ళి మంచంమీద పడుకోబెట్టారు. ఆ తర్వాత వరప్రసాద్ పరుగున వెళ్ళి ఊర్లో వుండే ఆర్.ఎం.పి. డాక్టర్‌ని వెంటపెట్టుకువచ్చాడు. ఆయన జానకీదేవికి ఏదో తనకి తెల్సిన చికిత్సను అందించి, ఏదో ఇంజక్షన్ ఇచ్చేసి వెళ్ళిపోయాడు.

"అమ్మమ్మకు ఇంతకూ కాళ్ళు విరిగాయా? నడుం విరిగిందా? నాకు ఏమీ అర్థం కావడంలేదు" అందాకా మౌనంగా వున్న కస్తూరి సందేహంగా అంది.

"ఖర్మకాలి ఒకవైపు ఏడుస్తుంటే, మరోవైపు నీ సందేహాలు? వెళ్ళవే ఇక్కడ్నుంచి..." కోపంకొద్దీ కసురుతూ కూతుర్ని కొట్టబోయింది శకుంతల.

"నేనేం చేశాను? " తప్పించుకుంటూ ముఖమంతా ముడుచుకుని అడిగింది కస్తూరి.

"ముందు ఇక్కడ్నుంచి వెళ్ళు" శకుంతలలో అదేకోపం.

"వెళ్తాలే" గండుమొహంతో చెప్పి "ఇంకెప్పుడూ నువ్వు నాతో మాట్లాడొద్దు" హెచ్చరింపుగా వేలు చూపిస్తూ అక్కడ్నుంచి వెళ్ళిపోయింది కస్తూరి.

"దాన్ని ఎందుకు తిట్టాలి? " వెళ్లిపోతున్న కూతుర్ని చూస్తూ భార్యమీద కోప్పడ్డాడు వరప్రసాద్.

"అది ఆల్ ఇండియా రేడియో! మనం ఇప్పుడు ఏం మాట్లాడుకున్నా బాహాటం చేసేస్తుంది" అని,

"అనుకున్నది ఒకటి, అయింది మరోటి అన్నట్టుగా ఏంటి ఇదంతా? పని కరెక్ట్‌గా పూర్తిచేశారా లేదా? " అనడిగింది శకుంతల.

"పని సంపూర్ణంగా పూర్తయ్యింది" కల్పించుకున్నాడు సూర్యప్రకాశరావు.

"మరి? " శకుంతలలో కంగారు.

"అదే అర్థంకావడంలేదు" చేతులు నలపసాగాడు వరప్రసాద్.

"ఈపాటికి ఆ ముసల్దానికి కాళ్ళో చేతులో విరుగుతాయని, ఆ వార్తను ఆనందంగా వినాలని, ఎంతో ఆత్రంగా ఎదురుచూస్తున్నాం. కానీ గోడకు విసిరిన బంతి వెనుతిరిగి మన ముఖాన్ని పచ్చడి చేసినట్టు ఏంటీ ఈ అన్యాయం? " శకుంతల అయోమయపడిపోసాగింది.

"ఇప్పుడు కంగారుపడి ప్రయోజనం లేదు. ఈ విషయం గురించి తర్వాత ఆలోచిద్దాంగానీ ముందు అత్తమ్మను టౌన్ హాస్పిటల్‌కి తీసుకెళ్దాం. అందించిన ప్రథ

ఘచికిత్స ఎక్కువసేపు పనిచేయదు. ఆలస్యం జరిగితే అనర్థాలు జరగవచ్చు" తొందరపెట్టాడు వరప్రసాద్.

"అల్లుడు నిజం మాట్లాడ్తున్నాడు. నన్ను తొందరగా తీసుకెళ్ళండి" ఒళ్ళంతా పాకుతున్న బాధని తట్టుకోలేక ఆయాసపడుతూ అంది జానకీదేవి.

"తీసుకువెళ్తాం... ఏడవద్దు" అనునయించింది శకుంతల.

"ఈ టైములో కారు అయితేనే సాఫ్ట్ జర్నీ చేయగలం. వేరే ఆటోగానీ, జీపుగానీ అంతగా బాగుండవు. అందుకే నేను వెళ్ళి కారు తీసుకువస్తాను" చెప్తూనే వెలుపలికి నడిచాడు వరప్రసాద్.

"కారు కిరాయికి తీసుకురావడం దేనికి? ఆ ముసల్దానికారు వుందిగా? " వెళ్తున్న భర్తకు గుర్తు చేసింది శకుంతల.

"అక్కడికే వెళ్తున్నాను" చెప్తూనే వెలుపలికి వచ్చేశాడు వరప్రసాద్. ఇప్పుడు అతడి పెదిమలమీద ఓ చిరునవ్వు.

"తాయెత్తులతో అమాయకుల్ని నాశనం చేయాలని అనవసరంగా కంకణాలు కట్టుకోవద్దండీ! ఆ దేవుడు మిమ్మల్నే నాశనం చేస్తాడు" అదే చిరునవ్వుతో మనసులోనే అనుకుంటూ, షర్టుకాలర్‌ని ఒకసారి ఎగరవేసుకున్నాడు వరప్రసాద్.

★ ★ ★

కావేరి పెళ్ళయి రెండునెలలు కావొచ్చింది. అప్పటికి జానకీదేవి గాయం పూర్తిగా తగ్గలేదు. కాపోతే ఆసుపత్రినుండి ఇంటికి వచ్చేసి వారానికి ఒకసారి అన్నట్లుగా ఆసుపత్రికి వెళ్ళి చికిత్స తీసుకుంటూ పూర్తిగా పడకమీదే విశ్రాంతి తీసుకుంటోంది.

జానకీదేవి విషయమై అల్లుడు వరప్రసాద్‌కి తప్ప ఇంట్లో అందరికీ అయోమయంగా ఉంది.

అసలు తాయెత్తు మహిమ వల్ల పరిమళాదేవికి శకుంతల ఆశించినట్టుగా కీడు జరిగి వుండేదా? అనేది వరప్రసాద్‌కి మొదట అర్థంకాలేదు. అతడికి మంత్రతంత్రాల మీద నమ్మకం తక్కువే. అయినప్పటికీ పరిస్థితి తనవరకు వచ్చేసరికి, అటూ ఇటూ కానట్టుగా తయారై 'ఎందుకైనా మంచిది' అనుకుంటూ వెనక్కి తీసుకువచ్చిన తాయెత్తును అగ్నికి ఆహుతి చేశాడు.

ఇక జానకీదేవి బాత్‌రూమ్‌లో జారిపడ్డానికి కారణాన్ని అవలోకిస్తే జానకీదేవి బాత్‌రూమ్‌కి వెళ్ళడానికి ముందు చల్లదనం కోసం నూనెతో ఒంటికి మర్దన చేసుకుని, ఆ బాత్‌రూంలోంచి వెలుపలికి వచ్చాడు వరప్రసాదు. ఆ సమయంలో కిందికి చిమ్మిన నూనె ప్రభావంవల్ల జానకీదేవి జారిపడింది. ఈ విషయాన్ని ఎవ్వరూ గ్రహించలేదు. వరప్రసాద్ కూడా ఎవరికీ చెప్పలేదు.

తల్లికోసం మళ్ళీ మంత్రగాడు మావూరయ్య దగ్గరకి వెళ్ళింది శకుంతల. వెంట వరప్రసాద్ వెళ్ళాడు. మునుపు వెళ్ళినప్పుడు శ్రీశైల క్షేత్రానికి అని చెప్పారు. ఇప్పుడు కూడా అదే మాట చెప్పారు. ఎందుకంటే మావూరయ్య శ్రీశైలానికి దగ్గర్లోనే వుంటాడు.

మావూరయ్య దగ్గరకి వెళ్ళాక తన మొదటి ప్రశ్నగా "స్వామీ! మీ తాయెత్తు మహిమ నా కన్నతల్లిపై పనిచేసింది. ఎందుకు ఇలా జరిగిందంటారు? " భక్తిగా అడిగింది శకుంతల. ఆమె ప్రశ్నకు సమాధానంకోసం మరేవో మంత్రతంత్రాలు చేసి 'దేవత పొరబడింది. అందుకే నీ కన్నతల్లిమీద ఫలితం కనబడింది' అని చెప్పి మరో తాయెత్తు ఇస్తూ, "ఈ తాయెత్తు తీసుకెళ్ళి నీ కన్నతల్లి తాళిబొట్టుకి కట్టు. వారంరోజుల్లో నీ తల్లికి నయమౌతుంది. నీవు అనుకున్న వ్యక్తికి నడుం విరుగుతుంది" చెప్పాడు మావూరయ్య.

"సరే స్వామీ" దోసిలిపట్టి తాయెత్తును అందుకుంది శకుంతల.





అంతా చూస్తున్న వరప్రసాదుకి మావూరయ్యను అంత ఇదిగా నమ్ముతున్న భార్య మీద ఎనలేని జాలేసింది. అందుకే తనలో తనే "పిచ్చిదానా" అంటూ నవ్వుకున్నాడు.

మొదటిసారి వచ్చినప్పుడు ఒక్క తాయెత్తుకోసం ఐదువేల రూపాయలు చెల్లించుకున్న శకుంతల ఈ మారు మరో ఐదువేల రూపాయల్ని చెల్లించుకుని తిరిగివచ్చింది.

"ఈమారు ఖచ్చితంగా ఆశించింది జరుగుతుంది" ఇంటికి రాగానే స్నానంచేసి మావూరయ్యను ఒకసారి మనసులో స్మరించుకుని తల్లి తాళికి తాయెత్తు కడుతూ అంది శకుంతల.

'వాడొక మంత్రగాడు, వాడికి మహిమలు వున్నాయి, వాడు చెప్పినట్టుగా మీరు ఆశించింది జరుగుతుంది? అంతా కల్ల! అయినా నష్టం లేదు కలలు కనండి!

వాడి గురించి నాకు ఇప్పుడు కాదు నూనూగుమీసాల వయసులోనే తెల్సు! వాడొక పచ్చి మోసగాడు. వాడికి ఏదో చిన్నా చితకా మంత్రాలు తెల్సుగాని పెద్ద మంత్రాలు మచ్చుకు తెలియవు. అయినా మంత్రాలకి చింతకాయలు రాలుతాయా నా గయ్యాళి పెళ్ళామా! నీలాంటి భక్తులు వాడికి వున్నారు కాబట్టి వాడు ఎంచక్కా సంపాదించుకుంటున్నాడు. తెలియక మీరు పోతుంటారు. వాడు నిజంగా మహిమ వున్నవాడైతే తాయెత్తును తప్పించిన నా పేరు ఎందుకు తెల్సుకోలేకపోయాడు? వెధవ సన్యాసి!" మనసులోనే అనుకున్నాడు వరప్రసాద్.

శకుంతల మాత్రం మావూరయ్య గురించి, అతడి మహిమల గురించి గోరంతలు కొండంతలుగా చెప్పుకుపోతోంది. అందుకు తల్లిదండ్రులు ఇరువురూ దరువేస్తున్నారు.

అంతలోనే బయటినుండి తలుపుతట్టిన శబ్దం వినబడింది.

వరప్రసాద్ మినహా మిగతా ముగ్గురు బయటిదిశగా గుర్రుగా చూశారు.

"ఇంకెవరూ? ఆవిడగారే! వెళ్ళి తలుపు తీయండి!" వెటకారంగా భర్తను ఉద్దేశించి అంది శకుంతల.

మారు మాట్లాడకుండా ఆ గదిలోంచి బయటకి నడిచి తలుపుతీశాడు వరప్రసాద్. ఎదురుగా పరిమళాదేవికి బదులుగా బుచ్చమ్మ కనబడింది.

"సిన్నమ్మగోరి పేరిట పూజ సేయించడానికి అమ్మగోరు గుడికి ఎల్లినారు. ఇంద... తోటకాడినుండి జామపండ్లు తెంపుకొచ్చినాను" చెప్తూనే తన చేతిలోని జనపనార సంచిని వరప్రసాద్‌కి అందించింది బుచ్చమ్మ.

"ఏ గుడికి వెళ్ళింది? " అడిగాడు వరప్రసాద్.

"ఊరిబయట సెంకరుడి గుడికి ఎల్లింది. నేను ఇప్పుడు అక్కడికే ఎల్తున్నాను. సిన్నమ్మగోరి ఆరోగ్యం బాగుందికదా? " బుచ్చమ్మ అడుగుతుంటేనే లోపల్నుంచి వచ్చిన శకుంతల.

"గడప అవతల్నుంచి అడగడం కాదే, అంత ప్రేమా అభిమానం వున్నదానివి లోపలికి వచ్చి పలకరించి వెళ్ళాలి" రాగం తీస్తూ అంది.

"నిజమే!" ఆ వెనకాలే వచ్చిన సూర్యప్రకాష్‌రావు కూతురికి వంతపాడాడు.

"కాని ఈవిడగారు మాత్రం గడప అవతల నిల్చునే అన్నీ అడుగుతోంది" మరోసారి దెప్పింది శకుంతల.

"సర్లేగాని, మా వొదినమ్మ ఎక్కడికెళ్ళింది? నువ్వు ఒక్కతివే వచ్చావు? " అడిగాడు సూర్యప్రకాష్‌రావు.

"వూరు చిన్నదే అయినా గుళ్ళకు మాత్రం కొదవలేదు. పాపం పెద్దమ్మ, కష్టపడి ప్రతి గుడీ తిరుగుతుంటుంది. ఈవాళ శంకరుడి గుడికి వెళ్ళిందట" చెప్పింది శకుంతల.

"అమ్మగోరూ" పిలిచింది బుచ్చమ్మ.

"ఏంటే? " లేని పెద్దరికం ప్రదర్శించింది

శకుంతల.

"తమరు నన్ను తప్పుగా అనుకుంటున్నారు. నేను తోటకాడినుండి వొస్తున్నాను గనుక ఇంట్లోకి రావడం లేదు. ఎందుకంటే... నా ఎంట ఏ గాలి వొచ్చిందో ఏమో? అసలే సిన్నమ్మగోరి ఆరోగ్యం బాగోలేదు. ఇప్పుడు నేను గుడికాడికి ఎల్తే, నా ఎంట వొచ్చిన గాలీ దూలీ అన్నీ పోతాయి!" చేతులు జోడించి చెప్పింది బుచ్చమ్మ.

"సర్లేగాని వెళ్ళవే" పురమాయింపుగా అంది శకుంతల.

బుచ్చమ్మ వెళ్ళిపోయింది. మరో అర గంట గడిచాక పరిమళాదేవి, బుచ్చమ్మ వచ్చారు. రాగానే తన చెల్లెలి స్వస్థతకోసం పూజ చేయించిన పసుపు, కుంకుమ, పువ్వులు, కొబ్బరికాయను రెండు నిముషాలు ఇంట్లో దేవుడి ముందు పెట్టించింది పరిమళాదేవి. ఆ తర్వాత శకుంతలచేత జానకీదేవికి పసుపు, కుంకుమల్ని పువ్వుల్ని ఇప్పించి, కొబ్బరికాయ ముక్కను మాత్రం తనే స్వయంగా చెల్లెలి నోట్లో వుంచింది.

"చూపించవే చూపించు. నీ అభిమానం ఎంత గొప్పగా వుంటే మాకు అంత లాభం!" పరిమళాదేవిని చూస్తూ మనసులోనే కసిగా అనుకుంది శకుంతల.

సూర్యప్రకాష్‌రావు మాత్రం మనసులోని దుర్బుద్ధిని పక్కకు పెట్టేసి కాసేపు నిజంగానే మంచివాడుగా మారిపోయాడు.

"వదినమ్మ పూజ ఫలించి దాని జీవితం అవిటిది కాకుంటే నాకు అంతేచాలు"

"భయపడవద్దు సూర్యం. నా చెల్లెలికి ఏమీకాదు" అంటూ జానకీదేవి తల దగ్గర కూర్చుంది పరిమళాదేవి.

"అమ్మగోరి మాటంటే బెమ్మదేవుడిమాటే" అక్కడే ఓ పక్కగా నేలమీద కూర్చుని వున్న బుచ్చమ్మలో పరిమళాదేవి పట్ల అవ్యాజమైన నమ్మకం.

★ ★ ★

"నేను మా అమ్మమ్మను చూసి వస్తాను" భర్త వరుణ్‌తో అంది కావేరి.

"నేను రాకూడదా? " అడిగాడు వరుణ్. అతడి గొంతులో చిలిపితనం.

"ఇద్దరం కల్సి వెళ్దాం"

"మళ్ళీ సాయంకాలానికల్లా వచ్చేయాలి. సరేనా? "

"అదేంటి? " కనుబొమ్మలు ముడిచిందామె.

"అదంతే..." సహజంగా అన్నాడతడు.

"అదేం కుదర్దు. కనీసం ఓ రెండ్రోజులైనా వుండాలి" ఆమె గొంతులో మారాం

"నేను సరే అంటాను అనుకో ఇంట్లో అమ్మావాళ్ళు ఒప్పుకోవద్దూ" అతడు అంటుంటేనే బయటినుండి కావేరికి పిలుపొచ్చింది.

"ఆంటీ... ఆంటీ... అమ్మమ్మ పిలుస్తోంది" వరుణ్ అక్క కూతురు ఆరేళ్ళ సౌజన్య ఆ గదిలోకి పరుగెత్తుకొచ్చింది.

ఆ పాపను చూడగానే భార్య భుజాల్ని పెనవేసుకుని అతిచేరువగా కూర్చుని వున్న అతగాడు, చప్పున తన బంధాన్ని సడలిస్తూ దూరం జరిగాడు. ఆమె కూడా తడబాటుగా దూరం జరుగుతూ చెదిరిన కొంగును సరిచేసుకుని, ఆ వెంటనే మంచందిగి, వడివడిగా పడకగదిలోంచి వెలుపలికి నడిచింది.

"ఏం చేస్తున్నావు కోడలుపిల్లా? " వంటగదిలోని అల్మారాలో సామాను సర్దుతున్న అత్త కామాక్షమ్మ తీయకనే తీసింది రాగం.

"ఆ..." తడబడింది కావేరి.

"సర్లేగానీ, వచ్చి అమ్మకు సాయం చేయి" తల్లికి సమీపంగా వేసివున్న స్టూలుమీద కూర్చుని, వేరుసెనగకాయలు నములుతున్న ఆడపడుచు రాధారాణి సైతం అదోమాదిరిగా రాగం తీసింది.

వాళ్ళ గొంతుల్లోని వ్యతిరేకతను పసిగట్టింది కావేరి. కానీ ఆమెకు ఏమీ అర్థంకా




లేదు.

"కొత్తపిల్లవి, అందునా చిన్నపిల్లవి అని ఇన్నాళ్ళూ ఊరుకున్నాను. ఎన్నోరోజులు ఊరుకోవడం నీకుగానీ మాకుగానీ మంచిది కాదు. కాబట్టి చెప్తున్నాను" అని కాసేపు ఆగి "చూడమ్మా! ఆడపిల్ల పుట్టింట్లో ఎలా వున్నా ఫరవాలేదుగానీ అత్తింటికి వచ్చాకా ఆచితూచి అడుగువేయాలి. మీ అమ్మ నీకు ఈ బుద్ధి నేర్పించనట్లుగా కనబడుతోంది. మీ అమ్మ నేర్పించకపోయినా నువ్వయినా తెల్సుకోవాలి. ఇంకెప్పుడూ పగటిపూట మీ భార్యాభర్తలు ఇద్దరూ పడకగదిలోకి వెళ్ళొద్దు. ఇంట్లో అత్తామామలు వున్నప్పుడు కనీసం మాట్లాడుకోవద్దు కూడా! ఎందుకంటే పొరపాటున వాడు సరసం చేశాడనుకో. చూసే మాకు చాలా ఇబ్బందిగా వుంటుంది. అర్థమయ్యిందా? " చెప్పుకుపోయింది కామాక్షమ్మ.

సాయంకోసం వచ్చి ఆమెకు చేరువగానే నిల్చునివున్న కావేరి కళ్ళల్లో చప్పున నీళ్ళు తిరిగాయి. కానీ కన్పించనీయలేదు. ఎడంగా తిరిగి తన పనేదో తను చేసుకుపోతూ "సరే అత్తమ్మా" అంది అమాయకంగా.

పుట్టింట్లో తనకు ఎప్పుడూ వ్యతిరేకత ఎదురు కాలేదు. ఎప్పుడూ కూడా తనమాటే నెగ్గింది. అలాంటిది ఇప్పుడు క్రమంగా వ్యతిరేకత ఎదురు కాబోతోంది. అంటే? అత్తింటి జీవితం ఇలాగే వుంటుందా?

కావేరికి అంతా అదోలా తోచింది. అన్నాళ్ళవరకూ కన్నవాళ్ళు దూరంగా వుంటున్నప్పటికీ మెట్టింటి ఆత్మీయతల మధ్య ఆనందంగానే వుండగలిగింది. కానీ ఆ ఆత్మీయుల చాటున దాగిన శాసనాల్ని మాత్రం ఆమె ఎంతమాత్రం భరించలేకపోయింది. అదే విషయాన్ని ఆరోజు రాత్రికే భర్తతో అంది.

"ఇలాంటి ఆదేశాల్ని నేను ఒప్పుకోను"

"అదేంటీ? అకస్మాత్తుగా ఆదేశాలు అంటున్నావు? నాకేం అర్థంకావడంలేదు" వరుణ్ గొంతులో విసుగు.

"ఇప్పుడు నేను ఏమన్నానని అంత విసుగు? " కొద్దిగా కోప్పడింది కావేరి.

"ఇప్పుడు టైం ఎంతయ్యింది? " అడిగాడు.

"పదిన్నర"

"నేను ఏం చేస్తున్నాను? "

"చదువుకుంటున్నావు"

"మరి ఈ సమయంలోనా నీ కంప్లైంట్స్? అసలే ఎగ్జామ్స్ టెన్షన్‌తో చస్తున్నాను. పదిహేను రోజుల్లో ప్రాక్టికల్స్ వున్నాయి. ఏమాత్రం ప్రిపేర్ కాలేదు. వీళ్ళ పాడు సెంటిమెంట్స్ నన్ను మొగుడ్ని చేశాయి. దీంతో రివిజన్ క్లాసులకు కూడా అటెండ్ కాలేకపోయాను" అతడు మాట్లాడుతుంటేనే మధ్యలో ఆపేసింది కావేరి. ఆమె గొంతు తీవ్రంగా ఉంది.

"ఇక చాలు"

అతడు చప్పున ఆగిపోతూ ఆమెవైపు కళ్ళార్పకుండా చూశాడు. ఆమె ఇంకేం మాట్లాడలేదు. విసురుగా పడుకుని, అదే విసురుతో నిండుగా దుప్పటి కప్పుకుంది.

"కావేరీ" ఆమె మీద చేయివేస్తూ మృదువుగా పిలిచాడు.

అతడి చేయిని విసిరికొట్టిందామె. "కోపంగా వుందా? " చిన్నగా నవ్వాడు అతడు.

"లేదు. తమరి నిర్వాకం బ్రహ్మాండంగా వుందిగా? అందుకే చాలా హాయిగా వుంది" అంటూనే భోరున ఏడ్చింది కావేరి.

"ఏయ్ కావేరీ" ఆదుర్దాగా ఆమెను వారించాడు అతడు.

"నాతో మాట్లాడొద్దు పో" ఎదిగీ ఎదగని వయసు ఆమెను మరింత ఏడిపించింది.

"ప్చ్! ఏడవద్దు. నీ బాధ నాకు అర్థమయ్యింది. అందుకే నిన్ను పట్టించుకోనట్లుగా మాట్లాడాను" అతడిలో ఆమెను ఓదార్చే ప్రయత్నం.

"అంటే?" కళ్ళనీళ్ళు తుడ్చుకుంటూ లేచి కూర్చుంది కావేరి.

"మా అమ్మ, అక్క, ఇద్దరిదీ ఒకే తత్వం. ఎదుటివాళ్ళు సంతోషంగా వుండడం వాళ్ళకి నచ్చదు. అక్కసుగా వుంటారు. తోడుగా వాళ్ళిద్దరికీ నాన్న వంత పాడతాడు. మంచంమీద వున్న నానమ్మ సైతం ఆ ముగ్గురికీ సరిజోడి. ఇలాంటపుడు నిన్ను వెనకేసుకురావాలా? వాళ్లను వెనకేసుకురా వాలా? నాకు రెండుకళ్ళూ ఒకటేకదా! అందుకే తప్పించుకునే ప్రయత్నం చేశాను" తన బాధను చెప్పుకుపోయాడు వరుణ్.

ఆమె భర్తవైపు ఆశ్చర్యంగా చూసింది.

"నువ్వు నన్ను అర్థం చేసుకోవాలి కావేరీ! ఇదివరకే నేను జీవితంలో స్థిరపడి వుండుంటే పరిస్థితులు మనకు అనుకూలంగా వుండేవి. కానీ నేను తల్లిదండ్రుల మీద ఆధారపడి బతుకుతున్నాను. చదువుకునే వయసులో పెళ్ళి చేసుకుని బాధ్యతను నెత్తిన వేసుకున్నాను. ఈ వయసుకి తగిన స్వేచ్ఛ, స్వతంత్రం మనిద్దరికీ లేదు. కేవలం విద్యార్థులుగా బతకాల్సిన మనం ఆలుమగలుగా బతుకుతున్నాం. ఇది వయసుకి మించిన భారం. నువ్వు సర్దుకుపోవడం నేర్చుకోవాలి. ఎందుకంటే నీ ఇష్టప్రకారం నడుచుకోడానికి నీ మొగుడు స్వతంత్రుడు కాడు" సునిశితంగా చెప్పుకుపోయాడు వరుణ్.

ఆమె అతడ్ని అలాగే గుడ్లప్పగించి చూస్తోంది. అతడు మళ్ళీ చెప్పుకుపోవడం ఆరంభించాడు.

"మన లోపం కూడా మనకు ఉన్నతంగా కన్పించవచ్చు. ఇందులో ఆశ్చర్యంలేదు. ఇందుకు మంచి ఉదాహరణలు మా వాళ్ళు. నాకు తెలిసి ఏనాడూ కూడా ఎదుటివాళ్ళ గొప్పతనాన్ని గానీ, ఆనందాన్నిగానీ వీళ్ళు ఒప్పుకోలేదు. ఇప్పుడూ అదే జరుగుతోంది. కాబట్టి పరిస్థితుల్ని నువ్వు అర్థం చేసుకోవాలి. అంతేగానీ పంతాలకీ, పట్టింపులకీ వెళ్ళి నువ్వూ వాళ్ళలో ఒకరిగా కలిసిపోవద్దు"



"ఎన్ని రకాలుగా ఆలోచించినా ఆ ముసల్దాన్ని బోల్తాకొట్టించలేకపోతున్నాం! మనవడిమీద ప్రేమను విరగ్గొట్టేసి ఆ ప్రేమను మన పిల్లలు ఒక్కరే స్వంతం చేసుకోవాలని ప్రయత్నించామా... అది అంతే సంగతులయ్యింది. కనీసం ఆ ముసల్దాని కాళ్ళూచేతులూ విరగొట్టేద్దామనుకున్నామా? అదీ అంతే సంగతులయ్యింది! మరి ఇప్పుడేం చేయాలి?" శకుంతలలో గందరగోళం.

"ఏంచేస్తావు? నోర్మూసుకుని కూర్చోవాలి" తాపీగా అన్నాడు వరప్రసాద్.

"ఈ వెధవ సలహా నాకు అక్కర్లేదుగాని, మొగుడివి కాబట్టి అడుగుతున్నాను. బాగా ఆలోచించి ఏం చేయాలో చెప్పు?" ఎటూ పాలుపోనట్టుగా అడిగింది శకుంతల.

"నీకు తొందర ఎక్కువ. తొందర అన్ని విషయాల్లో పనికిరాదు. అయినా నీవు తొందరపడుతున్నావు కాబట్టి, పాత పద్ధతికే శ్రీకారం చుడదాం"

"ఏపద్ధతి?"

"మన పిల్లలపై ఆ ముసల్దానికి ప్రేమ

కలిగే పద్ధతికి"

"ప్చ్! ఆలోచన సంతృప్తికరంగా లేదు" అంటూ లేచి ఆ గదిలోంచి వెలుపలికి నడిచింది శకుంతల.

వరప్రసాద్ మాత్రం వెళ్తున్న భార్యను నిట్టూరుస్తూ చూస్తూ కూర్చున్న మంచం మీదే అడ్డంగా నడుం వాల్చేశాడు.

★ ★ ★

"అమ్మా! మీ అల్లుడితో ఆలోచించి లాభంలేదు. ఏదైనా ఒక పథకం చెప్తాడనుకుంటే పాతచింతకాయ పచ్చళ్ళను నెమరు వేస్తున్నాడు. మనిషికి వయసు ఎదిగిందే గాని బుర్ర ఎదగలేదు. ఛ! ఒర్త్తి బర్రెను తెచ్చి నాకు కట్టబెట్టారు" లోపలి గదిలో వాలుకుర్చీలో కూర్చునివున్న జానకీదేవితో అంది శకుంతల.

"మరేం చేద్దామే? పరిస్థితుల్ని చూస్తుంటే నాకు భయమేస్తోంది. వాడు అమెరికా వెళ్ళాడు కాబట్టి, వాడి అవసరాల పేరు చెప్పి ఈ ముసల్దాని ఆస్తిలో ఏ కొంతయినా వాడి అమ్మమ్మగారు నొక్కేస్తారనిపిస్తుంది. అంతలోపే ఆస్తిని మన స్వంతం చేసుకోకపోతే మన ప్రాణాలు నిలువవు అన్పిస్తుంది" గాభరాపడిపోయింది జానకీదేవి.

శకుంతల ఏం మాట్లాడలేదు. ఆలోచిస్తూ నిర్లిప్తంగా కూర్చుండిపోయింది.

"శకుంతలా" పిలుస్తూ కొంతసేపటి తర్వాత వచ్చాడు వరప్రసాద్.

"ఆ" నిష్ఠూరంగా పలికింది శకుంతల.

"తల్లీకూతుళ్ళు ఏం నిర్ణయించుకున్నారు? " వచ్చి వాళ్ళకి సమీపంగా నిల్చున్నాడు వరప్రసాద్.

"ఇంకా నిర్ణయించుకోలేదు. నిర్ణయించుకోవాలి" జానకీదేవి గొంతులో అస్పష్టంగా ఎగిసిపడిన నిష్ఠూరం.

"మీకో నిజాన్ని చెప్పాలి" అన్నాడు అతడు.

ఏంటన్నట్లుగా చూశారు తల్లీకూతుళ్ళు ఇద్దరూనూ.

"ఏంటంటే... ఈ ఆస్తుల విషయాలు కొద్దిగా కఠినంగా వుంటాయి" అంటూ వెళ్ళి అక్కడున్న స్టూల్ పై కూర్చుని, "ఆ ముసల్ది తన మనవడ్ని పూర్తిగా విసిగించుకుని, తన యావదాస్తిని మనకు ధారాదత్తం చేయాలీ అని మొదట్నుంచీ ఆలోచిస్తున్నాం. అయితే..." వరప్రసాద్ మాట్లాడుతుంటేనే మధ్యలో అందుకుంటూ... "ఆస్తి మొత్తంగా అవసరంలేదు. సగానికిపైగా చాలు" అంది శకుంతల.

"అవసరంలేదు. మొత్తం కావాల్సిందే! చెప్పేకొద్దీ పాతమాట మాట్లాడ్తే నాక్కోపం వస్తుంది" కల్పించుకుంది జానకీదేవి.

"నేనూ అలాగే కోరుకున్నాను. కాని అదేదో హిందూచట్టం ప్రకారం మనకోరిక నెరవేరదట" చెప్పింది శకుంతల.

"చట్టాలు కూడా మనకు చుట్టాలే అవుతాయి డబ్బు బాగా ఖర్చుపెట్టుకుంటే" రాగం తీసింది జానకీదేవి.

"చుట్టాలుకావొచ్చు, కాకపోవచ్చు! కాబట్టి మంచం వున్నంతవరకే కాళ్ళు చాపుకోవాలి అన్నట్టుగా వచ్చినవరకే చాలనుకోవాలి. ఆశకి పోతే గోతిలో పడే ప్రమాదం వుంది. ఇందాక శకుంతల అన్నట్టు హిందూ చట్టం ప్రకారం స్వార్జితాన్ని తన ఇష్టమైన వాళ్ళు ఎవరికైనా ఇచ్చుకోవచ్చు. కాని పూర్వీకుల ఆస్తిపై మాత్రం కొడుకులకి, ఆ తర్వాత మనవళ్ళకి హక్కు వుంటుంది. ఇట్లాంటి ఆస్తిని మరొకళ్లకి ఇచ్చుకుంటే, హక్కుదారులు కోర్టుకి వెళ్ళి చట్టపరంగా విజయం సాధించవచ్చు. ఈ ముసల్దాని ఆస్తిలో ఇరవై ఐదు శాతం వరకు పెద్దల ఆస్తి వుంది. మిగిలిన డెబ్బైఐదు శాతం మాత్రం స్వార్జితం! ఈ స్వార్జితం మనకు దక్కాలి. అయితే నేను ముందు చెప్పినట్లుగా ఈ ఆస్తిపాస్తుల విషయాలు కఠినంగా వుంటాయి. ఎలా అంటే... హక్కుదారు తన స్వార్జితాన్ని సైతం తన ఇష్టప్రకారం



తన ఇష్టమైనవాళ్ళకు ఇచ్చేప్పుడు అందరి సమక్షం అవసరం. ముఖ్యంగా రక్తసంబంధీకుల సమక్షం లేకుండా అడుగు ముందుకు వేయలేరు. ఒకవేళ వేసినా, అవతలివాళ్ళు చేతకానివాళ్ళయితే ఫర్వాలేదు. కాకపోతేనే సమస్యలు వుంటాయి. మరి ఇప్పుడు శశాంక అమ్మమ్మవాళ్ళు చాలా తెలివైనవాళ్ళు, డబ్బూ దర్పం అన్నీ వున్నవాళ్ళు. ఇలాంటపుడు మనం అనుకున్నది సాధించడమంటే కొద్దిగా కష్టమైన పనే కదా! పైగా..." అని కాసేపాగాడు వరప్రసాద్.

తల్లీకూతుళ్ళు అతడ్ని ఆసక్తిగా, అయోమయంగా చూస్తున్నారు.

"శశాంక మేనమామ ధనుంజయగాడికి పొలిటికల్‌గా బాగా పరిచయాలున్నాయి. వాడి తెలివి నక్కలాంటిది కూడా! అందుకే ఈ ముసల్ది చావకముందే మంచి మాటల్తో నచ్చజెప్పి వినకపోతే మాయ మాటల్తో మభ్యపెట్టి ఆస్తిని ఈ ముసల్దాని పేరిట ఏదో కొంత వుంచేసి మిగతా మొత్తంగా అమ్మేసి, అమ్మగా వచ్చిన డబ్బుల్ని శశాంక పేరిట బ్యాంక్‌లో ఫిక్స్‌డ్ చేయాలనుకుంటున్నట్టుగా విన్నాను. ఇది ఆస్తి విషయం కాబట్టి వాళ్ళు కేర్‌ఫుల్‌గా అనుకున్న పనిని నెరవేర్చుకుంటారు. ఇదంతా ఎందుకంటే ఈ ముసల్ది మనపిల్లలకి కొద్దోగొప్పో ముట్టజెప్తోంది కాబట్టి" తీరిగ్గా పూసిగుచ్చిన చందాన చెప్పుకుపోయాడు వరప్రసాద్.

"ఆస్తుల విషయాలు ఎంత కఠినమైనవో, మనం అంతకన్నా కఠినమైనవాళ్ళం" నాయకి నాగమ్మలా పౌరుషంగా అంది శకుంతల.

"నేను చెప్పేది ఇదే! ఆస్తుల విషయాలు కఠినంగా వుంటాయనడంలో మనుషుల కఠినత్వాలే వుంటాయిమరి" అన్నాడు వరప్రసాద్.

అంతలో సూర్యప్రకాష్‌రావు నిద్రకళ్ళతో వచ్చాడు అక్కడికి.

"ఏంటయ్యా అల్లుడూ! కఠినత్వాలు గట్రా మాట్లాడుతున్నావు?" అల్లుడి వైపు చూశాడు సూర్యప్రకాష్‌రావు.

భర్తకు బదులుగా సమాధానం తనే చెప్పుకుపోయింది శకుంతల. విషయం తెల్సి సూర్యప్రకాష్‌రావుకి నోటమాటరాలేదు. అచేతనుడిలా కూర్చుండిపోయాడు.

"భయపడొద్దు. బాధ అంతకన్నా పడొద్దు. ఈ శకుంతలాదేవి చిటికేస్తే... అవతల వూర్లో కోడి కూయకముందే, ఈ వూర్లో చద్దిమూటలు చంకనెక్కుతాయి" చిటికేస్తూనే అంది శకుంతల.

"ఏమో? నాకు నమ్మకంలేదు. ఎందుకంటే ప్రతిసారీ పథకం వేస్తున్నావు, పౌరుషంగానే మాట్లాడుతున్నావు, కాని సాధించింది ఏమిటి?" అన్నాడు వరప్రసాద్.

భర్త మాటలకి చివ్వున చూసింది శకుంతల. అతడు అపశకునంలా మాట్లాడినందుకు ఆమెకు ఉక్రోషం వచ్చింది.

"ఈసారి మాత్రం గెలుస్తానని, అదే గెలుస్తామని నాకు బాగా నమ్మకంగా వుంది" నీళ్ళు నమిలాడు వరప్రసాద్.

"అదీ!" అలా మాట్లాడండి అన్నట్టుగా అంది శకుంతల.

★ ★ ★

కూతుర్ని చూసివద్దామని బయలుదేరి వెళ్లారు శకుంతల, వరప్రసాద్. అక్కను చూడ్డానికి తనూ రావాలని మారాంగా ఏడుపు మొదలెట్టింది కస్తూరి. కాని శకుంతల ససేమిరా అంది. వరప్రసాద్‌కి మాత్రం మనసు చివుక్కుమంది. అందుకే భార్యకు సర్దిచెప్పబోయాడు. అయినప్పటికీ శకుంతలలో మార్పులేదు. నిజానికి ఆమె దృష్టిలో తన ఇద్దరు కూతుళ్ళూ తనకి రెండు కళ్ళల్లాంటివారు. కాబట్టే వాళ్ళకోసం వాళ్ళ భవిష్యత్ నిర్మాణం కోసం అంతగా ప్రాకులాడుతోంది. కాగా ప్రస్తుతం తను వెళ్తున్నది పథకం ప్రకారం. కాబట్టి ఆరిందాలాంటి చిన్నకూతుర్ని వెంట తీసుకెళ్ళడం




ఆమెకు భావ్యం అన్పించలేదు.

"పాపం! కస్తూరి ఇంకా ఏడుస్తూనే వుండి వుంటుంది" ట్రైన్ దిగి ఆటోస్టాండ్‌వైపు నడుస్తూ అన్నాడు వరప్రసాద్.

"ఏడ్వనీ! ఏడిస్తే పోయేది ఏముంది? " అంది శకుంతల.

"అయినా నీ మొండి పట్టుదల ఏంటీ? ఎవరు చెప్పినా విన్పించుకోకుండా, దాని స్కూల్ వేస్ట్ అవుతుందని పాడినపాటే పాడుతున్నావు. అదేమైనా బోర్డుపరీక్షలు రాయబోతోందా ఏంటీ? "

"నేను రాయబోతున్నాను అనుకో"

"అదేంటీ? "

"ఏంటనేది తమరికి తర్వాత అర్థమవుతుంది"

★ ★ ★

కావేరి ఆటో దిగగానే ఇలా పరుగున ఎదురెళ్ళింది.

"ఎలా వున్నావమ్మా? అంతా కులాసానా? " తల్లి హృదయం స్వచ్ఛంగా స్పందిస్తుంటే అపురూపంగా కూతురి తల నిమిరింది శకుంతల.

"నేను సర్లేగాని మీరు అందరూ బావున్నారు కదా? అమ్మమ్మ, తాతయ్య, చెల్లెలు, అంతా ఓకే కదా? " తల్లి చేతిలోని బ్యాగును తన చేతుల్లోకి తీసుకుంటూ అడిగింది కావేరి

"ఎప్పుడొచ్చారు అన్నయ్యా? " వచ్చినప్పుడే ఇంట్లోంచి చూసినప్పటికీ, కాసింత ఆలస్యంగానే వెలుపలకి వస్తూ ఆప్యాయంగా పలకరించింది కామాక్షమ్మ.

"ఇప్పుడే వస్తున్నాం వదినా? " అంతే ఆప్యాయంగా సమాధానం చెప్పింది శకుంతల.

అందరూ ఇంట్లోకి వెళ్లారు. కామాక్షమ్మ హడావిడి పడుతోంది. అందుకు కావేరి సహకరిస్తోంది. రేపోమాపో అన్నట్టుగా వున్న ముసలమ్మ సైతం వరప్రసాద్ దంపతుల్ని యోగక్షేమాలు అడుగుతోంది.

"నా బిడ్డ అదృష్టవంతురాలు. పుట్టింటి సుఖాన్ని ఇక్కడ అనుభవిస్తోంది" అంతా చూస్తూ మనసులో అనుకుంది శకుంతల.

కావేరి మాత్రం తన బాధల్ని తల్లిదండ్రులతో ఎప్పుడెప్పుడు చెప్పుకోవాలా అని ఎదురుచూస్తూ, అత్తగారి నటనని లోలోపలే తిట్టుకుంటోంది.

సాయంకాలం అనగా ట్యూషన్‌నుండి వచ్చిన వరుణ్ అత్తామామల్ని చూడగానే ఆశ్చర్యపోయాడు. ఆ వెనకాలే వచ్చిన వరుణ్ తండ్రి కూడా వియ్యాలవారిని చూసి ఆశ్చర్యపోయాడు.

"వచ్చేముందు ఫోన్ చేద్దామనే అనుకున్నాం. కాని మా వూర్లో కేబుల్ ప్రాబ్లం. ఇక జర్నీ మధ్యలో ఫోన్ చేయడానికి వీలు పడదు" ఆ ఇద్దరి ఆశ్చర్యాన్ని చూస్తూ సమాధానం ఇచ్చుకున్నాడు వరప్రసాద్.

"ఇలా సర్‌ప్రయిజింగ్ గానే బాగుంటుంది" అన్నాడు వరుణ్ తండ్రి రామారావు.

తర్వాత మాటల సందళ్ళు రాత్రి ఏడుగంటలవరకు కొనసాగాయి. అందరిలో ఒకళ్ళుగా కూర్చునివున్న శకుంతల-కావేరిల మనసులు అందరికీ భిన్నంగా వున్నాయి. వాళ్ళిద్దరూ సమయం కోసం చీకాగ్గా ఎదురు చూస్తున్నారు. రాత్రి పదిగంటలకు వాళ్ళు అనుకున్న సమయం అనుకూలించింది.

డాబా మీద తల్లిదండ్రులు, కూతురు, ముగ్గురు మాత్రమే వున్నారు.

"కావేరీ" మెల్లగా పిలిచింది శకుంతల.

"ఏంటమ్మా? " పలికింది కావేరి.

"అత్యవసరమైన పనిమీద ఇక్కడికి వచ్చానే"

"ఏంపని? "

"అదే, ఆ ముసల్దాని విషయంలో"

"అంటే? "

"ఆ...ఏంలేదు. మొదట్నించీ మనం అనుకుంటున్న పనిని ఒకేసారి మొత్తంగా



కాకుండా, కొద్దికొద్దిగా నెరవేర్చుకుందామని అనుకుంటున్నాను"

"ఏవిధంగా? "

"దాని ఆస్తిలో సగానికి పైగా మనకు చెందాలనేదే మన కోరిక! అనుకున్నదంతా ఒకేసారి కొట్టేద్దామనుకున్నా అది కాని పనిలా వుంది. కాబట్టి ప్రస్తుతం అనుకుంటున్న ప్రకారం, మొదట పాత్రధారివి నువ్వు కావాలి. ఎలా అంటే... ఈ అత్తింటి అనురాగాన్ని ఆ ముసల్దాని ఎదుటగా మర్చిపోవాలి. వీళ్ళు నిన్ను రాచిరంపాన పెడుతున్నట్టుగా, భర్త అనేవాడు సైతం కనీస ప్రేమకు దూరం చేస్తున్నట్టుగా, అత్తిల్లు దిన దిన నరకం అయినట్టుగా, కళ్ళనీళ్ళు పెట్టుకోవాలి. దీంతో దెబ్బకి పిట్ట చచ్చినట్టుగా ఆ ముసలి పీనుగ హృదయం ద్రవించిపోతుంది. అప్పుడిక నువ్వు అనుకున్న ప్రకారం ప్రొసీడ్ కావొచ్చు" మునుపటికంటే గొంతు తగ్గించి చెప్పుకుపోయింది శకుంతల.

"ఓసి దరిద్రపు మొహమా! ఇది మన పిల్ల జీవితం. అనవసరపు ఐడియాలువేసి దీని సంసారంలో నిప్పులుపోసే పనిచేయొద్దు. నువ్వు పనిగట్టుకుని ఇక్కడికి వచ్చేప్పుడే, ఇలాటి పనికిమాలిన ఐడియా ఏదో ఒకటి వేసేవుంటావనుకున్నాను. అనుకున్నది నిజమైంది" పెళ్ళాంమీద కోప్పడ్డాడు వరప్రసాద్.

పళ్ళు నూరుతూ కళ్ళెర్రజేసింది శకుంతల.

"ఈ విషయంలో మాత్రం నేను నీకు భయపడనే. ఇది నా కూతురి జీవితం. దాని జీవితంలో ఏమాత్రం వడగాలి వీచినా నేను సహించను" కఠినంగా అన్నాడు వరప్రసాద్.

"అదేంటీ ఎప్పుడూ లేని పౌరుషం? " విరుచుకుపడింది శకుంతల.

"మీ గొడవ చాలించండి" మరేదో అనబోయిన తండ్రిని వారిస్తూ అందీ కావేరి.

"అది కాదమ్మా" కూతుర్ని సంయమనం చేయబోయాడు వరప్రసాద్.

"నాకేం చెప్పొద్దు నాన్నా" అంది కావేరి.

"అది నా కూతురు. నామాట వింటుంది" కల్పించుకుంది శకుంతల.

"నేను ఎవ్వరిమాటా వినను" అంటూనే ఏడ్చింది కావేరి. తల్లిదండ్రులు ఇద్దరూ గాభరా పడిపోయారు.

"అమ్మ నన్ను నటించమంటోంది. కానీ నాకు ఈ ఇంట్లో నిజంగానే కష్టాలు వున్నాయి. వరుణ్ కూడా వాళ్ళమ్మ మాటనే మాట్లాడ్తాడు" ఏడుస్తూనే చెప్పింది కావేరి.

"కావేరీ..." శకుంతల మనసు విలవిలలాడింది.

"మరి ఎప్పుడూ కూడా ఒక్కమాటైనా చెప్పలేదేంటమ్మా? " బాధపడిపోయాడు వరప్రసాద్.

"ఈ చిన్న వయసులో నాకు పెళ్ళి చేశారు. జీవితం పంజరంలో ఇరుక్కున్నట్టుగా వుంది. నా గొంతుకోసిన వాళ్ళతో నా బాధల్ని ఎందుకు చెప్పుకోవాలి? " కావేరి ఏడుస్తూనే వుంది.

కూతురి మాటలకి కిమ్మనలేకపోయారు తల్లిదండ్రులు. పెళ్ళి విషయంలో మొదట్నుండీ తృప్తిగానే కనిపించిన కూతురు, పెళ్ళయ్యాక కూడా తృప్తిగానే కనిపించింది. దీంతో ఆమె జీవితం 'బంగారం' అనుకున్నారు. కాని కల కల్ల అని తెలీగానే కన్న హృదయాలు తట్టుకోలేకపోయాయి. అంతకుమించి కూతురి బాధ తమ పొరపాటుని ఎత్తి చూపుతుందని కూడా వాళ్లు ఊహించలేకపోయారు. అదేవిషయాన్ని బరువుగా అంది శకుంతల.

"మంచి సంబంధం కదాని తొందరపడి ఇచ్చేశాం. ఆ ముసల్ది చెప్పిన మాటల్లో వాస్తవం వున్నప్పటికీ పట్టించుకోలేక పోయాం..."

కావేరి ఏడుస్తూనే వుంది. వరప్రసాద్




ఆమెను లాలనగా ఊరడిస్తున్నాడు.

"కావేరీ! బాధపడొద్దమ్మా! వాస్తవానికి ఆ ముసల్దాని మాటల్లో సత్యం వున్నా, దాన్ని మనం పట్టించుకోకూడదు. పట్టించుకుంటే బాగుపడలేం. ఇప్పుడు నీకు కష్టాలు వచ్చాయని ఈ సంబంధాన్ని తిట్టుకోవాల్సిన అవసరం లేదు. ఎందుకంటే మొదట కష్టపడ్డ వాళ్ళే తర్వాత సుఖపడ్తారు. దేవుడు చేసేది అంతా మనమంచికోసమే..." ఆ వెంటనే శకుంతలలో మార్పు.

"ఏడ్వొద్దు బేటా! కష్టాలు ఎప్పుడూ వుండేవికాదు. అవి నీటిబుడగల్లాంటివి" కూతురి కన్నీళ్ళు తుడిచాడు వరప్రసాద్.

"మున్ముందు నీ మొగుడు చాలా గొప్పవాడౌతాడు. అప్పుడు ఈ కష్టాలన్నీ, నిన్ను కష్టపెట్టే నీ అత్తామామలకు తగలడం ఖాయం" మెటికలు విరిచింది శకుంతల.

"మావయ్య మామూలుగా మంచివాడే" చెప్పింది కావేరి.

"ఎవ్వడూ మంచోడుకాదు. అందరూ ఒక గూటి పక్షులే" అని కాసేపు ఆగి- "మనం మన వూరెళ్దాం పద" అంది శకుంతల.

"అంటే నీ వుద్దేశ్యం?" వెంటనే భార్య వైపు తిరిగాడు వరప్రసాద్.

"నా ఉద్దేశ్యంలో ఏ తప్పూలేదు. ఊరట కోసం రెండ్రోజులు తీసుకువెళ్దాం అంటున్నాను" చెప్పింది శకుంతల.

★ ★ ★

మరుసటిరోజు...

కావేరిని తమవెంటే తీసుకువచ్చారు తల్లిదండ్రులు. రాగానే కావేరి పరిస్థితి గురించి ఇంట్లో ఏకరువు పెట్టింది శకుంతల. వింటూనే బెంబేలెత్తిపోయారు అమ్మమ్మ, తాతయ్యలు.

ఇక కావేరి వచ్చిందని తెలియగానే ఆఘమేఘాలమీద పరుగెత్తుకువచ్చిన పరిమళాదేవి, ప్రేమకొద్దీ కావేరిని చప్పున వాటేసుకుంది. అందరి ప్రేమానురాగాల మధ్యా ఉక్కిరిబిక్కిరి అయిపోతున్న కావేరికి ఏడుపు ఆగలేదు. కావేరి పరిస్థితి తెల్సిన పరిమళాదేవికి కూడా కన్నీళ్ళు ఆగలేదు. అలాగని ఎంతోసేపు అక్కడే వుండిపోలేదు పరిమళాదేవి. ఎవరో వచ్చి ఏదో పనివుందని పిలవడంతో "మళ్ళీ వస్తానంటూ" తప్పని పరిస్థితిలో వెళ్ళిపోయింది.

"నా మొగుడు నన్ను తన వ్యాపారం కోసం మూడు లక్షలు నగదు తీసుకురమ్మంటున్నాడు. అనేది ప్రస్తుతం నీవు ఒంటబట్టించుకోవాల్సిన పాఠం! ఈ పాఠాన్ని నెమరేసుకుంటూ ఆ ముసల్ది మళ్ళీ వచ్చే సమయానికి ఏడుస్తూ పడుకో! మ్యాటరు మేము వివరిస్తాం" పరిమళాదేవి వెళ్ళిపోగానే కావేరికి నూరిపోసింది శకుంతల.

"ఇట్లాంటి అబద్ధాలు కొంపల్ని కొల్లేరు చేస్తాయి" హెచ్చరించాడు వరప్రసాద్.

"తమరు వూరుకోండి అల్లుడూ! నా కూతురికి అన్నీ తెల్సు" చేతకాని స్థితిలో సైతం డబ్బుకు అర్రులు చాచింది జానకీదేవి.

"ఏం తెల్సు?" రెట్టించాడు వరప్రసాద్.

"అల్లుణ్ణి నిజంగానే అడగమంటాను. ఆ విషయం వాడి తల్లిదండ్రులకి తెలియనీయవద్దంటాను. వచ్చిన డబ్బును వాడుకోకుండా కావేరి పేరిటే ఫిక్స్డ్ చేయిస్తాను. దీంట్లో వచ్చే నష్టం ఏముంది?" పొగడ్తగా మాట్లాడింది శకుంతల.

"నీ తెలివి ఏడ్చినట్టే వుంది. ఈరోజు నాటకం ఆడినవాడు, రేపు నిజంగానే వేధిస్తే ఎలా వుంటుందో మీకు అర్థం కావడంలేదు" వివరించాడు వరప్రసాద్.

"నువ్వు మాకేం చెప్పక్కర్లేదు, వెళ్ళిపో" తెగేసి చెప్పింది శకుంతల.

పరిస్థితిచూస్తే మాటామాటా పెరిగి గాలివానలా మారే సూచనలు కనిపిస్తున్నాయి. అది గమనించిన వరప్రసాద్ మారు మాట్లాడలేదు. సమయానుకూలంగా సమస్యను పరిష్కరించుకోవాలని అక్కడ్నుంచి మారు మాట్లాడకుండా వెళ్ళిపోయాడు.

"బేటా! నీవు మీనాన్న మాటల్ని గురించి పట్టించుకోవద్దు. సంపాయించడం చేతకాదు గాని, సమస్యల గురించి మాత్రం లెక్చర్స్ ఇస్తాడు. ఇట్లాంటివాళ్ళు లెక్చర్ ఇవ్వడానికే తప్ప ఎందుకూ పనికిరారు. నీవు నామాట విని, నేను చెప్పినట్టుగా నడుచుకో" మొగుడు వెళ్ళిపోగానే కూతురి తలను ప్రేమగా నిమురుతూ చెప్పింది శకుంతల.

"సరే" గుండెలోతుల్నుండే సమాధానమిచ్చింది కావేరి.

★ ★ ★

ఆ సాయంకాలమే మళ్ళీ వచ్చింది పరిమళాదేవి. వెంటే అరటిపళ్ళు, ద్రాక్షపళ్ళు, బత్తాయిపళ్ళు, తీస్కుని బుచ్చమ్మ కూడా వచ్చింది.

తల్లి చెప్పిన సూత్రాల్లో ఒక సూత్రాన్ని పాటిస్తూ, ముసుగేసుకుని పడుకుంది కావేరి.

"అత్తింట్లో బాధలున్నాయని, పుట్టింట్లో కూడా ఏడుస్తూ వుండరాదు. లేమ్మా బంగారూ" పిలుస్తూ కావేరి పడుకున్న మంచంవైపు నడిచింది పరిమళాదేవి.

"దాని చిన్న హృదయానికి పెద్దగాయమే తగలింది పెద్దమ్మా" బాధగా చెప్పింది శకుంతల.

"పెద్దగాయమా? " కనుబొమ్మలు ముడుస్తూ కావేరి తల దగ్గర కూర్చుంది పరిమళాదేవి.

"గంట క్రితం వరకు మాకు కూడా తెలీదు. మామూలు కష్టాలు మాత్రమే అనుకున్నాం. కాని అది అదేపనిగా ఏడుస్తుంటే మీ చెల్లెలు బుజ్జగించి అడిగింది. ఇంకేం? మా గుండెలే పగిలాయి. అది భయపడుతూ చెప్పిన విషయం, మా పరిస్థితుల్ని సవాలు చేశాయి. ఏంచేయాలో అర్థం కావడంలేదు" ఒక్కోమాటను తీరిగ్గా తీసిపెట్టిన చందాన చెప్పుకుపోయి ముక్కు చీదింది శకుంతల.

"ఏంటే? నాకు ఏమీ అర్థంకావడంలేదు" అయోమయపడింది పరిమళాదేవి.

"దాని మొగుడికి మూడులక్షలు కావాలట. ఆ డబ్బుల్ని దీని పేరిట ఫిక్స్‌డ్ చేయించాలట. ఆ డబ్బుతో ఏదైనా మంచి వ్యాపారాన్ని భవిష్యత్తులో ఆరంభిస్తాడట! ఏంటో అంతా ఖర్మ! ఎప్పుడో భవిష్యత్తులో ఆరంభించే వ్యాపారానికి ఇప్పుడే డబ్బులు కావాలంట. లేదంటే మనపిల్ల పుట్టింట్లోనే వుండాలంట" శకుంతల ముక్కుచీదుతూనే వుంది.

"ఈ చిన్న వయసులో వాడికి ఇదేం దుర్బుద్ధి? ఈ బుద్ధి ఆ పిల్లాడికి స్వతహాగా పుట్టిందికాదు. తల్లిదండ్రులు నేర్పించివుంటారు! ఏంటో ప్రేమపెళ్ళిళ్ల కూడా కట్నాల్నే ఆశిస్తున్నాయి" అంది పరిమళాదేవి.

"అందరం అదే అనుకుంటున్నాం" అంది శకుంతల.

"ఇందుకు ఎవ్వరూ ఏడ్వాల్సిన అవసరం లేదు. అంతా నేను చూసుకుంటాను" పరిమళాదేవి మాటలో గట్టిధైర్యం.

"ఓసి ముసల్దానా! వెళ్ళి ఎదురుబడి నిలదీస్తావా ఏంటీ? " మనసులోనే భయపడిపోయింది శకుంతల. పైకి మాత్రం ఆ తాలూకు భావాల్ని కనబడనీయలేదు. మిగతావాళ్ళు కూడా లోలోపల బెంబేలు ఎత్తిపోయినా పైకి గంభీరంగా కనబడుతున్నారు.

"కావేరీ! నువ్వు ఏడ్వొద్దు. ఆడపిల్ల ఏడిస్తే అరిష్టం అంటారు. అందుకే కష్టాల్లో కూడా ఆడపిల్ల కన్నీళ్ళు పెట్టుకోకూడదని పెద్దలు మరీ చెప్పారు. లే, లేచి స్నానంచేస్తే శరీరమే కాదు-మనసు కూడా హాయిగా వుంటుంది" కావేరిని లేపి కూర్చోబెట్టింది పరిమళాదేవి.

ఏడ్చీఏడ్చీ కావేరి ముఖం ఎర్రగా కందిపోయివుంది. ఇంక ఏడ్చే శక్తి లేనట్టుగా డీలా పడిపోయింది.

"అయ్యో! ఎట్లావుండేదానివి ఎట్లా మారిపోయావే? " మనవరాలిని చూస్తూ గుండె




పట్టుకుంది జానకీదేవి.

"మన పిల్ల మునుపు ఎట్లా వుండేదో రెండ్రోజులు పోతే మళ్ళీ అట్లాగే తయారవు తుంది. అనవసరంగా కంగారుపడిపోవద్దు" తనలోని కంగారును అణుచుకుంటూ గుండెధైర్యంతో మాట్లాడింది పరిమళాదేవి.

కావేరి తిరిగి పడుకోబోయింది. పరిమళా దేవి వారిస్తూ, "పడుకోవద్దు, వెళ్ళి స్నాం చేసిరాపో" చెప్పింది. కావేరి ఎక్కువసేపు చెప్పించుకోలేదు. ఆ వెంటనే నెమ్మదిగా మంచందిగి బాత్‌రూమ్‌వైపు వెళ్ళిపో యింది.

"ప్రేమాదోమా అంటూ పెళ్లిచేశారు. చూశారా? దాని లేతప్రాయం ఎంత గాయ పడిందో? తెలివి లేని ఆలోచనలు జీవి తాల్ని ఇలాగే చేస్తాయి" కావేరి వెళ్ళిపోగానే పరిమళాదేవి గొంతు గద్గదమయింది.

సమాధానంగా ఎవ్వరూ కిమ్మనలేదు.

"అయినా, జరిగిన పెళ్ళి గురించి ఇప్పుడు బాధపడి ప్రయోజనంలేదు. పరిస్థితుల్ని చక్కదిద్దడానికి ప్రయత్నించాలి. లేదంటే దాని చిన్ని గుండె వెయ్యిముక్కలయ్యే ప్రమాదం ఎంతయినా వుంది" పరిమళా దేవే మాట్లాడింది.

"ఎలా చక్కదిద్దుతావు పెద్దమ్మా?" అడగకూడదు అనుకుంటూనే అడిగింది శకుంతల.

"డబ్బు మాత్రం ఇవ్వకూడదు" పరిమళా దేవి నోటినుండి వెలువడిన మాట, ఇటు శకుంతల అటు సూర్యప్రకాష్‌రావు దంప తుల నెత్తిమీద పిడుగువచ్చి పడిన భ్రమను కలిగించింది. కాని ఆ తాలూకు భావాల్ని ఎవ్వరూ కూడా బయల్పడనీయలేదు.

"ఒక్కసారి డబ్బు ఇచ్చామనుకో, మళ్ళీ మళ్ళీ కావాలంటారు. అందుకే ఇప్పుడే వాళ్ళ నోళ్ళని మూయించాలి? ఈ విష యంలో మీరేం కలుగజేసుకోవద్దు. మొదట మంచి మాటలతో నేనే చెప్పి చూస్తాను. వినకపోతే ఎలా బుద్ధిచెప్పాలనేది కూడా నేనే ఆలోచిస్తాను" స్థిరంగా అంటూ లేచి నిల్చుంది పరిమళాదేవి.

"నేను వెళ్తాను" చెప్తూనే ముందుకు నడి చింది పరిమళాదేవి.

తీసుకువచ్చిన పండ్లబుట్టను తీసుకెళ్ళి సమీపంగా వున్న టేబుల్‌మీద పెడుతూ "అమ్మగోరూ, పండ్లు ఇక్కడ 'పెడ్తున్నాను" శకుంతలకి చెప్పి, పరిమళాదేవి వెనకాలే బయలుదేరి వెళ్ళింది బుచ్చమ్మ.

వాళ్ళిద్దరూ తల వాకిలి దాటి వెళ్ళేవరకు మౌనంగాచూసి, ఆ తర్వాత గుండెలమీద చేయివేస్కుని "అమ్మ నా ముసల్దానా" భయంగా అంది శకుంతల.

"ఇప్పుడెలా తప్పించుకుంటావే?" అందాకా నోరు మెదపకుండా ఒకపక్కగా కూర్చునివున్న వరప్రసాద్ మెల్లగా నోరువి ప్పాడు.

"అదే అర్థం కావడంలేదు. ఏదైనా ఉపా యాన్ని సూచించు" శకుంతలలో అదే భయం.

"అందరం కల్సి ఆలోచిద్దాం" ధైర్యమి చ్చాడు సూర్యప్రకాష్‌రావు.

"ప్చ్" కలవరపడిపోయింది శకుంతల.

"అమ్మా..." అదే సమయంలో బయటి నుండి పరుగెట్టుకు వచ్చింది కస్తూరి.

"ఆకాశవాణి వచ్చేసింది. జాగ్రత్త" గొంతు తగ్గించి అప్రమత్తతని సూచించింది శకుంతల.

★ ★ ★

"డిగ్రీ పూర్తికాగానే మా అబ్బాయిని వ్యాపారంలో దింపాలనుకుంటున్నాం. కాబట్టి మాకు డబ్బు కావాలి. అందుకు కావాల్సిన మొత్తం డబ్బును మేము అడ గడం లేదు. సగం డబ్బు కావాలంటున్నాం. ఇందులో తప్పులేదనుకుంటాను" సౌమ్యంగా మాట్లాడింది కావేరి అత్తమ్మ కామాక్షమ్మ.

"ఏకంగా మూడులక్షలు అడిగితే మేము ఎక్కడ్నుంచి తేగలం? అయినా అడిగిన కట్నం ఇచ్చుకున్నాం, అదనపు లాంఛనాలు

ఇచ్చుకున్నాం" అంది పరిమళాదేవి.

"మేము ఆ విషయాలు కాదనడంలేదు" అంది కామాక్షమ్మ.

"కాదనకపోవడం బాగానే వుంది. కాని మళ్ళీ కావాలీ అనుకోవడంలోనే అర్థంలేదు" సూటిగా అనేసింది పరిమళాదేవి.

"అర్థం ఎందుకులేదండీ? మా బాబు బిజినెస్ చేయాలి" అని కామాక్షమ్మ అంటుంటేనే పరిమళాదేవి వెనకగా కూర్చుని వున్న వరప్రసాద్ పక్కనే వున్న భార్యవైపు భయంగా చూశాడు. "ఎందుకు?" అన్నట్లుగా ఆమె కనుబొమ్మలు ఎగరవేసింది. సమాధానంగా లేచి బయటకి వెళ్ళాడు వరప్రసాద్. ఒక నిముషం తేడాతో తను కూడా బయటకి వెళ్ళింది శకుంతల.

"బిజినెస్ మంత్రాన్ని ఆవిడగారికి ఒంటబట్టించావు. మరి రేపొద్దున బిజినెస్ చేయకపోతే, మీ పెద్దమ్మ ఏమంటుంది?" గొంతు తగ్గించే అయినా ఆవేశపడ్డాడు వరప్రసాద్.

"పిచ్చిగాని పట్టిందా?" అని ఓ చిరునవ్వును తేలికగా నవ్వి- "అత్తింటివాళ్లు రకరకాల కోరికలు చెప్పి, కారణాలు చెప్పి, డబ్బు లాగాలని ప్రయత్నిస్తుంటారు. అవన్నీ నిజం చేసి చూపెట్టాలని నిబంధన లేదు. ఆడపిల్ల జీవితం కదా! ఆ తర్వాత గట్టిగా కూడా ఎవ్వరూ నిలదీయలేరు" అంతకంటే తేలికగా చెప్పింది శకుంతల.

లోపల కామాక్షమ్మకు, పరిమళాదేవికి వాదన జరుగుతూనే వుంది.

"పెళ్ళయి ఏడాది కూడా కాలేదు. కొత్త దేవతను కోటి వరాలు కోరాల్సిందే అన్నట్టుగా ఇప్పుడే ఇంత పెద్దమొత్తంలో డబ్బును అడిగితే ముమ్ముందు ఇంకెంతో అడుగుతారు? అయినా మా వద్ద ఇప్పుడు డబ్బులేదు. మీరు ఖచ్చితంగా కావాలి అనుకుంటే, మీ అబ్బాయి వ్యాపారం మొదలెట్టినప్పుడు తప్పకుండా ఇచ్చుకుంటాం. అంతవరకు ఒక్కపైసా కూడా ఇవ్వం" తెగేసి చెప్పింది పరిమళాదేవి.

"అలా అయితే మీ అమ్మాయి మాకు అవసరంలేదు" తను కూడా తెగేసి చెప్పింది కామాక్షమ్మ.

ఆమె మాటకు పరిమళాదేవి ఒక్కక్షణం నివ్వెరపోయింది. ఆ తర్వాత తమాయించుకుంటూ "మా అమ్మాయి మీకు అవసరం లేకపోయినా, మా అమ్మాయి మాకు బరువు కాదు" చెప్పింది పరిమళాదేవి.

"అంటే?"

"మా అమ్మాయిని మావెంటే తీసుకెళ్ళిపోతాం"

"సంతోషం"అని చెప్పి, ఇంకొక్కక్షణం కూడా అక్కడ కూర్చోకుండా లోపలికి వెళ్ళిపోయింది కామాక్షమ్మ.

పరిమళాదేవి శకుంతలా వాళ్ళకోసం వెనక్కి చూసి, ఆ తర్వాత లేచి బయటకి నడిచింది.

ఏడుస్తూ గోడవారగా నిలబడివుంది శకుంతల. "ఏంటే?" గాభరాపడింది పరిమళాదేవి.

"కావేరి జీవితం" వెక్కిళ్ళ మధ్య చెప్పింది శకుంతల.

"నేను వున్నానుగా" ఓదార్పుగా అంది పరిమళాదేవి.

★ ★ ★

సాయంకాలానికల్లా ఇంటికి తిరిగి వచ్చేశారు అందరూ! కావేరి స్తబ్దుగా వుండిపోయింది. తనను అటూఇటూ తిప్పుతూ తన జీవితాన్ని ఆస్తుల వలయంలో పావుని చేస్తున్న తల్లిని గాని, అందుకు సపోర్టు చేస్తున్న అమ్మమ్మ, తాతయ్యలనుగాని కించిత్ మాట కూడా అనలేదు.

ఇక శకుంతల మాత్రం అదేపనిగా ఏడుస్తోంది. వరప్రసాద్ పరిస్థితిని చక్కదిద్దడం కోసం విపరీతంగా ఆలోచిస్తున్నాడు. అందరికీ పరిమళాదేవి ధైర్యం చెప్తోంది.

"శకుంతలా! నీ ఆశ పరిస్థితుల్ని ఎలా




మార్చేస్తుందో ఏమో? " రాత్రి పడుకునే ప్పుడు మెల్లగా అన్నాడు వరప్రసాద్.

"అంతా సవ్యంగా జరిగిపోతుంది. నా ఏడుపు నా కూతురి సంసారం కోసమేనని ఆ ముసల్దానికి అర్థమయ్యింది. కాబట్టి రేపోమాపో మనసు మార్చుకుని అడిగిన డబ్బు ఇచ్చేస్తుంది. ఒకవేళ ఇవ్వకపోతే నా ఏడుపుని ఇంకింత పెంచేస్తాను" అంది శకుంతల.

"రాక్షసీ" మనసులోనే తిట్టుకుని "ఇట్లాంటి నాటకాలు ఒక్కోసారి ఉపద్ర వంలా ముంచుకొస్తాయి. అప్పుడు నీవు గాని, నేనుగాని ఏమీ చేయలేము" అన్నాడు వరప్రసాద్.

"ఇప్పుడు అంత సీన్‌లేదుగాని, హాయిగా పడుకోండి" చెప్పింది శకుంతల.

ఆమెతో మరేం మాట్లాడలేదు వరప్ర సాద్. "నీవు ఈ జన్మలో మారవు" తనలో తనే గొణుక్కుంటూ అటు తిరిగి పడుకు న్నాడు వరప్రసాద్.

★ ★ ★

మరుసటిరోజు ఉదయాన్నే కామాక్ష మ్మకు ఫోన్ చేసింది శకుంతల.

"బాగా యాక్ట్‌చేశారు. రాత్రే ఫోన్ చేసి థాంక్స్ చెబ్దామనుకున్నానుగాని, లైను కల వలేదు" అంది శకుంతల.

"నా మాటలు అసలు నాటకంలా లేవు కదూ? " అంది కామాక్షమ్మ.

"అవును! మీరు మంచి యాక్టర్" కితాబు ఇచ్చింది శకుంతల.

"నేను యాక్టర్‌ని కాదు" స్థిరంగా అంది కామాక్షమ్మ.

"కాదుగాని యాక్షన్ బాగా చేశారు" ఆమె మనసు వెంటనే అర్థంకాని శకుంతల తన మాటను సరిచేసింది.

"కాదమ్మా వియ్యపురాలా! మొదట నీవు నాతో నాటకం గురించి మాట్లాడినప్పుడే, నేను నా స్వార్థం గురించి ఆలోచించాను. వచ్చే ఆ మూడు లక్షలూ మీ అమ్మాయి... అదే మా కోడలమ్మ పేరిట ఫిక్స్‌డ్ చేయిం చాలని అందంగా కలలు కన్నావు. ఇందు వల్ల తల్లిగా నువ్వు తృప్తిపడ్డావు. కాని అత్తగా నేనెలా తృప్తిపడగలను? ఎన్నాళ్ళ కయినా ఆ డబ్బు నా కొడుకుదే కదాని సర్దిపుచ్చుకునే సహనం కూడా నాలో లేదు. ఎందుకంటే భవిష్యత్తులో ఎప్పుడో నా కొడుకు అనుభవించే డబ్బులో సగ భాగం నేను అనుభవించాలని వుంది. అదేనమ్మా... నీకుమల్లే నాకూ ఆశ వుంది" అంటూ చివరగా చిన్నగా నవ్వింది కామాక్షమ్మ.

అప్పటికి శకుంతలకు ముచ్చెమటలు పట్టాయి. వెంటనే ఏం మాట్లాడలేకపో యింది.

"ఏమ్మా! విన్నావా? " తనే అడిగింది కామాక్షమ్మ.

"అ...అ... ఇది మరీ అన్యాయమండీ" గొంతును బలవంతంగా పెగుల్చుకుంది శకుంతల.

"అన్యాయంకాదు, న్యాయమే! ఆలోచించు కోండి మీ ఇష్టం!" చెప్పి, శకుంతల సమా ధానం కోసం ఎదురు చూడకుండానే ఫోన్ పెట్టేసింది కామాక్షమ్మ.

శకుంతల అలాగే శిలాప్రతిమలా నిలబ డిపోయివుంది. ఆమె కాళ్ళూ చేతులు వణు కుతున్నాయి.

"ఏమంటోంది? " పరిస్థితిని కొంతవరకు అర్థం చేసుకున్న వరప్రసాద్, ఆరా తీస్తున్న ట్టుగా అడుగుతూ ఆమె దగ్గరకు వచ్చాడు.

"మన కొంపముంచాలనుకుంటోంది" టెన్షన్‌తో చెప్పింది.

"అదేంటే? " బెంబేలు ఎత్తిపోయింది జానకీదేవి.

"కొండనాలికకు మందేస్తే వున్న నాలిక వూడిపోయిందా ఏం? " కంగారుపడిపో యాడు సూర్యప్రకాష్‌రావు.

అందరికీ అతీతంగా కావేరి మాత్రం మౌనంగా భావరహితంగా కూర్చుండిపో

యింది.

శకుంతల అతి కష్టంమీద పరిస్థితిని వివరించింది. అంతా విన్నాక వరప్రసాద్ పెళ్ళాన్ని కోపంతో కొట్టవచ్చాడు.

"ఏంటయ్యా? మా కళ్ళెదుటే మా పిల్లను కొట్టడానికి నీకెంత ధైర్యం" విసురుగా అడ్డుకున్నాడు సూర్యప్రకాష్‌రావు.

"అవతల నా కూతురి జీవితం నాశనమౌతోంది" ఆవేశంగా అన్నాడు వరప్రసాద్.

"అది నీ ఒక్కడికే కూతురు కాదు, నా కూతురికి కూడా కూతురే! ఇన్నాళ్ళకి పెద్ద మగాడివైపోయావు" కళ్ళెర్ర జేశాడు సూర్యప్రకాష్‌రావు.

"సంపాదించడం ముందు నేర్చుకుని, ఆ తర్వాత పెళ్ళాంమీద చేయి చేసుకో" శకుంతల అంది.

"నాకు అవకాశం వున్నంతవరకు నేను సంపాదిస్తున్నాను. అవకాశాన్ని మించి లక్షలు కోట్లు సంపాదించి మీకు ఇవ్వాలంటే, అది నాకు ఈ జన్మలో కాని పని" అన్నాడు వరప్రసాద్.

"ఏదోనయ్యా అల్లుడూ! అనవసరంగా ఆవేశపడకుండా ముంచుకొచ్చిన పరిస్థితిని చక్కదిద్దే మార్గం గురించి ఆలోచించండి" అంటూ బయటకి సామరస్యాన్ని బోధించినా, లోపలమాత్రం "నీకు ఈ ఆవేశం ఒక్కటే తక్కువ! గాజులు తక్కువైన ఆడంగి వెధవ" అనుకుంది జానకీదేవి.

"అది కాదు అత్తమ్మా! ఇప్పుడు మీ కూతురి నిర్వాకం వల్ల ఎంత ఆపద వచ్చిపడిందో చూస్తున్నారుగా! ఇటు మన కుటుంబంలో మనకే ఐక్యత కొరవడిందని అందరికీ తెల్సిపోయింది. అటు మనపిల్ల సంసారాన్ని మనమే చేతులారా విడిదీసినట్టయ్యింది. అయినా పిల్లను సుఖంగా చూసుకోలేని ఆ కామాక్షమ్మతో నాటకాలు ఆడించడం ఏమైనా సబబుగా వుందా? ఈ ఇంట్లో నేనొక చెత్తను కాబట్టి నా మాటను కూడా చెత్తలా తీసేసి అడుగు ముందుకు వేశారు. ఇప్పుడు అనుభవించండి.

నిప్పును ముట్టుకుంటే కాలుతుందని తెల్సీ కూడా ముట్టుకున్నారు. మరి గాయాల్ని ఎలా మాన్పుకుంటారో అంతా మీ ఇష్టం" నిష్ఠూరంగా చెప్పి అక్కడ్నుంచి వెళ్ళిపోతూ "కావేరీ! ఇట్రామ్మా!" పిలిచాడు వరప్రసాద్

"అమ్మా! నాన్నా! ధైర్యంగా వుండండి. ఈ శకుంతల సముద్రాన్ని కూడా ఈదగలుగుతుంది" వీడని ఆత్మవిశ్వాసంతో అంది శకుంతల.

"అందులో మునిగిపోకుండా జాగ్రత్త పడితే చాలమ్మా" తండ్రి వెనకాలే వెళ్తున్న కావేరి, ఆగి చూస్తూ మరీ అంది.

"ఏంటే? నువ్వు రివర్సు అయిపోయావా? " కళ్ళింత చేసింది శకుంతల.

"నీమీద నాకేం కోపంలేదు. కాపోతే ఇక నుండి నాకు కష్టాలు ఎక్కువయ్యిపోతాయేమోనని భయంగా వుంది" బరువుగా అంది కావేరి.

"అయ్యో నా తల్లీ! నీకు అలాంటి సమస్య రాకుండా నేను కాపాడుకుంటాను" అంది శకుంతల.

కావేరి అందుకు ఏం మాట్లాడలేదు. బయటికి వెళ్ళిపోయింది.

★ ★ ★

నెలరోజులవరకు పుట్టింట్లోనే వుండిపోయింది కావేరి. తన నాటకం కూతురి సంసారాన్ని పాడుచేసిందనే బాధ శకుంతలలో ఎంతమాత్రం కనబడలేదు. నెలరోజులు గాని, రెండునెలలుగాని తన కూతురు తన ఇంట్లో వుండటం అనేది నష్టంకాదని ఆమె మనఃస్ఫూర్తిగా తలిచింది. ఎందుకంటే 'తను కోరుకున్న మూడులక్షల రూపాయల్లో, సగభాగం కామాక్షమ్మకి పోగా మిగతా సగభాగమైనా తన కూతురికి దక్కుతుంది. అయాచితంగా వచ్చిన డబ్బు ఎంతయితేనేం? ఈసారి కొంత డబ్బు అన్యాయమైపోయినా, రెండవసారి అన్యాయం కాకుండా చూడాలి.





అందుకు పకడ్బందీగా వ్యూహాన్ని పన్నాలి!' అని అనుకుంది కాబట్టి.

శకుంతల ఊహించినట్టుగానే నెలరోజుల తర్వాత పరిమళాదేవి మనసు మారిపోయింది. "ఆడపిల్ల ఎన్నాళ్లని అత్తింటిని వదిలి పుట్టింట్లో వుంటుంది? అరిటాకు లాంటి ఆడకూతురి జీవితాన్ని పౌరుషాలకి పోయి పాడుచేసే ధైర్యం ఎవరికి వుంటుంది? " అని వాపోతూ వాళ్లు అడిగిన మూడులక్షల రూపాయల్ని ఇవ్వడానికి సిద్ధపడింది.

కావేరి పేరిట ఆ మూడులక్షల్ని ఫిక్స్‌డ్ చేయడానికి కామాక్షమ్మ ఒప్పుకోలేదు. "బిజినెస్ అన్నామేగాని, ఇప్పట్లో బిజినెస్ ప్రారంభించే ఉద్దేశ్యాన్ని మళ్ళీ మానుకున్నాం. మాకు ఇప్పుడు డబ్బుతో చాలా అవసరం వుంది. డబ్బు మీది కాబట్టి లక్షాయాభైవేల రూపాయల్ని మీ అమ్మాయి పేరిట బ్యాంక్‌లో ఫిక్స్‌డ్ చేయండి. మిగతా లక్షాయాభైవేలు మా చేతికి ఇవ్వండి. ప్లాట్లు కొనాలనుకుంటున్నాం. ఆ ప్లాట్లు రేపొద్దున్న మీ అమ్మాయికే చెందుతాయి. కాబట్టి డబ్బు అడిగి మిమ్మల్ని కష్టపెడుతున్నాం అని కూడా మీరు అనుకోవద్దు" నంగనాచిలా మాట్లాడింది.

పరిమళాదేవి పాతకాలం మనిషైనా కొత్తకాలం పోకడలన్నీ ఆమెకు తెలుసు. ఆడపిల్లను కట్నంకోసం వేధిస్తున్నారని న్యాయం కోసం ఆమె పోరాటం చేయగలదు. అంత శక్తియుక్తులు ఆమెకు వున్నాయి. కానీ మైనార్టీ తీరని పెళ్ళి కాబట్టి ఆమె అడుగు ముందుకు పడలేదు. పైగా తను న్యాయం, అన్యాయం అంటూ గొంతుచించుకునే ప్రయత్నం ఎంతమాత్రం చేసినా, వాళ్ళు 'విడాకుల' అస్త్రాన్ని సంధించడానికి సిద్ధంగా వున్నారు. అందుకు బలమైన కారణాల్ని సృష్టించేందుకు కూడా వాళ్ళు ఏమాత్రం వెనక్కి లేరు. అసలే కలికాలం! నాగరికత పెరిగినా, ఆధునిక భావాలు చైతన్యాన్ని సాధించినా, ఆడపిల్ల ఆ నాటినుండి ఈనాటివరకు 'ఆడపిల్ల'గానే వుండిపోయింది. అభివృద్ధి ఆమె జీవితాన్ని మార్చేసిందిగాని, 'స్థానాన్ని' మాత్రం మార్చలేదు. కాబట్టే పరిమళాదేవి కిమ్మనలేదు. కాపోతే 'గొంతెమ్మ కోరికల్ని ఇంకెప్పుడూ కోరమని' తమ బంధువుల్లోనే కొందరి పెద్దల మధ్య వాళ్ళ చేత చెప్పించుకుని డబ్బు ఇవ్వాలనుకుంది.

అందుకు కూడా వాళ్ళు సిద్ధపడలేదు. 'పదిమందిలో మా పరువు తీయాలనుకుంటున్నారా? ' అంటూ విలువల గురించి మాట్లాడారు. మాట్లాడిన వాళ్ళల్లో కామాక్షమ్మ, మూలన వున్న ముసలమ్మ వున్నారు. తోడుగా అరాకొరా మాటల్ని ఆడపడుచు రాధారాణి మాట్లాడింది. అందుకు తక్కువ తినని పరిమళాదేవి" మా దగ్గర వున్న డబ్బు కొంత, అప్పుచేసి కొంతా తెచ్చి ఇస్తున్నాం. దయచేసి ఇంకెప్పుడూ మమ్మల్ని డబ్బు అడగవద్దు. మీకు డబ్బు అవసరమైతే మా అమ్మాయిని ఖజానా అనుకోవద్దండి. అది చిన్న పిల్ల. దాన్ని కోడలిగా కాకుండా కూతురిలా చూసుకోండి" కన్నీళ్ళతో చెప్పింది.

ఇక సమస్య సద్దుమణిగింది. మిగతా లక్షాయాభైవేలు కూడా ప్లాట్లరూపంలో ఎప్పటికైనా తన కూతురికే దక్కుతాయని భ్రమపడిన శకుంతలకి అసలు నిజం తెల్సేసరికి నెత్తిన ఎవరో బలంగా మోదినట్టయ్యింది. మిగతా సగం తనక్కావాలి అంటూనే ప్లాట్లు అంటూ భ్రమపెట్టిన కామాక్షమ్మ, ఆ సగాన్ని తన కూతురు రాధారాణికి కట్నం కింద ఇచ్చేసింది.

ఈ విషయమై నిలదీయలేకపోయింది పరిమళాదేవి. ఎందుకంటే... తమకు తెలియకుండా ఎప్పటినుండో వుండివున్న ధర పలకని ప్లాట్లు తమ ప్రశ్నకు సమాధానాలుగా వున్నాయి. అయినా ఆడపిల్ల విషయంలో మరీ నిలదీయడం బాగుండదు అనుకుంటూ "కావేరికి మల్లే ఆడపడుచు

రాధారాణికి కూడా అత్తింటి ఆరళ్ళు వుండి వుంటాయి. పోనీలే పాపం" అని పెద్ద మనసుతో తలచింది. కాని రాధారాణికి ఎలాంటి కష్టాలు లేవని, ఆమె మొగుడిగారి స్థానం వరప్రసాద్‌లాంటిదేనని, పరిమళా దేవి ఎట్టిపరిస్థితుల్లోనూ తెల్సుకోలేదు.



"అమ్మగోరూ! తమరు ఎప్పుడూ గూడా పెద్దమనసుతో వుంటారు. గప్పట్లో నాకు సాయంచేసి నా కాపురం నిలబెట్టారు. నా మనవరాలి పెళ్ళిచేసి మా కష్టాల్ని గట్టెక్కించారు. అంతేనా? ఇంకా ఇంకా మాకు సాయపడుతూనే వున్నారు.

నిజ్జంగా తమరు దేవతలాంటోళ్లు. గందుకే కపటం లేకుండా సెల్లెలి సంసారాన్ని ఆదుకుంటున్నారు. సెల్లెలి మనవరాలి సంసారాన్ని గూడా ఆదుకుంటున్నారు. ఇట్టాంటి తమర్ని ఆ దేవుడు సల్లంగ జూడాలా! కాని ఆ దేవుడికి దయ లేదు. గందుకే తమరి పేగు తెంచినారు!

"ఏదోలే అమ్మగోరూ! సిన్నబాబు సల్లంగ వుంటే సాలు? తమరి పున్నెమంతా సిన్న బాబుకి దక్కితే సాలు..." అలవాటుగా వల్లె వేస్తూ పోతోంది బుచ్చమ్మ.

"ఆపుతావా ఇంక" అంది పరిమళాదేవి.

"సెప్తున్నాను అమ్మగోరూ"

"తెల్సిందే కదా! కాపోతే పొగిడేస్తున్నావు"

"అవును మల్ల! తమరు గొప్పోళ్ళు కాబట్టి గొప్పగొప్ప పనులు జేస్తరు. గా పనుల్ని మాలాంటి బోటోళ్ళు సెప్పుకుంటరు" అంది బుచ్చమ్మ.

"చెప్పుకోవడం తర్వాతగాని, అల్లుడుగారు వస్తున్నారు వెళ్ళి చాయ్ తీసుకురా పో" చెప్పింది పరిమళాదేవి.

బుచ్చమ్మ ఒకసారి బయటకి చూసి "అయ్యగారికి తొరగా చాయ తీస్కురావాలి" అంటూ లేచి లోపలికి వెళ్ళిపోయింది.

"రావయ్యా అల్లుడూ" గుమ్మందాకా వచ్చిన వరప్రసాద్‌ని సాదరంగా పిలిచింది పరిమళాదేవి.

వచ్చి పరిమళాదేవికి ఎదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాడు వరప్రసాద్.

"శశాంక రాబోతున్నాడు" చెప్పింది పరిమళాదేవి.

అమెరికా వెళ్ళిన వాడు అంత త్వరగా తిరిగి రావడం అంటే బలమైన కారణం వుండాలి. అందుకే అర్థంకానట్లుగా చూశాడు వరప్రసాద్.

"వాడి అమ్మమ్మకి సీరియస్‌గా వుందట" వరప్రసాద్‌ని అర్థంచేసుకున్నట్టుగా చెప్పింది పరిమళాదేవి.

"ఏమయ్యింది? " అడిగాడు వరప్రసాద్.

"తెల్లకామెర్లు"

"అయ్యో, మొదట్నుంచీ ట్రీట్‌మెంట్ తీసుకోలేదా ఏంటీ? "

"పచ్చకామెర్లు ఆరంభంలోనే బయటకి కనబడతాయి. కాని తెల్లకామెర్లు మహాప్రమాదం. కొన్నిసార్లు ముదిరేవరకు రోగం గురించి తెలియదు. ముదిరాక ఎన్ని మందులు వాడినా ప్రయోజనం వుండదు"

"అయ్యో! పాపం"

"ఎవరం ఏంచేస్తాం? పాపం అనుకోవడం తప్ప!"

"మరి మీరు వెళ్తున్నారా అత్తమ్మా? "

"వెళ్ళాలనే వుంది. కానీ మనసు అంగీకరించడం లేదు" కొడుకు,కోడలు గుర్తొస్తుంటే భారంగా అంది పరిమళాదేవి.

"ఇలాంటపుడు వెళ్ళకపోవడమే మంచిది" అన్నాడు వరప్రసాద్.

"నేనూ అదే అనుకుంటున్నాను. కాపోతే ఫోన్ చేసి పలకరించాలి" అని కాసేపాగి "ఆ... ప్రసాద్! కావేరి ఫోన్ చేసిందా? " సంభాషణ మార్చింది పరిమళాదేవి.

"నేనే చేసి మాట్లాడాను. ఎలాంటి వేధింపులు లేవు. అందరూ బాగా చూసుకుంటున్నారు అని చెప్పింది"

"అంతే చాలు"

"కన్నపిల్లల సుఖంకంటే వేరే సుఖం కన్నవాళ్ళకు అవసరం వుండదు. కాని కన్న కూతురి సుఖం మీ కూతురు శకుంతలకు మాత్రం అవసరం లేనట్టుంది" అన్నాడు వరప్రసాద్.

"అదేంటీ? " కనుబొమలు ముడిచింది పరిమళాదేవి.

అనకూడదు అనుకుంటూనే అనేశాడు కాబట్టి, చప్పున మాట మారుస్తూ, "అదే అత్తమ్మా! అత్తింట్లో తన కూతురు ఎన్ని కష్టాలు పడుతోందో ఏంటో అనుకుంటూ రేయింబవళ్ళు బాధపడుతోంది. బాధపడుతూ మనమ్మాయిని మన ఇంటికి తీసుకువచ్చేద్దాం అంటూ నన్ను సతాయిస్తోంది..." అన్నాడు వరప్రసాద్.

"దీన్నే కడుపుతీపి అంటారు. ఇట్లాంటి తీపి వుండటంవల్లే చాలామంది తల్లులు తమ కూతుళ్ళ జీవితాల్ని నాశనం చేశారు.

ఇప్పుడు కష్టాలున్నాయని ఆడపిల్లను అత్తింటినుండి తీసుకువస్తే, రేపొద్దున్న దాని జీవితం ఏం కావాలి? మొగుడనేవాడు వుంటేనే సగటు సమాజంలో స్త్రీకి గౌరవం, మర్యాదలు వుంటున్నాయి. అందుకే ఆడపిల్ల విషయం ఆలోచించి నిర్ణయం తీసుకోవాలి. ఇప్పుడు కష్టాలున్నాయని సుఖంకోసం పుట్టింటికి తీసుకువస్తే తల్లిదండ్రులు వున్నంతవరకే ఆ పిల్లకు సుఖం వుంటుంది. ఆ తర్వాత ఆ పిల్ల గతి ఏం కావాలి? రెండవ పెళ్ళి అనేది ఆడపిల్ల విషయంలో అంత సులభం కూడా కాదు. మరి ప్రస్తుత కష్టాల్ని దృష్టిలో పెట్టుకుని, తప్పటడుగువేసి, తప్పుడు ఆలోచనల్తో ఆ పిల్ల జీవితాన్ని చివరివరకు ఎందుకు కష్టాలమయం చేయాలి? " ఏకబిగిన మాట్లాడుతూపోయింది పరిమళాదేవి.

"నేనూ ఇలాగే చెప్పాను" అన్నాడు వరప్రసాద్.

"నేను మరోసారి చెప్తాను" అంది పరిమళాదేవి.

"వద్దులే అత్తమ్మా! నేను మీ కూతురి దృష్టిలో విలన్ అయిపోతాను"

"నీవు చెప్పినట్టుగా కాదు, సందర్భానుసారంగా చెబుతాను"

"అలా చెప్పండి" వరప్రసాద్ అంటుంటేనే లోపల్నుంచి టీ కప్పులతో వచ్చింది బుచ్చమ్మ.

వరప్రసాద్ మనసులో ఏదో ఆలోచిస్తూ ఒక్కో గుక్క తాగుతున్నాడు. పరిశీలించింది పరిమళాదేవి.

"ఏంటో చెప్పాలనుకుని వచ్చినట్టున్నావు, చెప్పలేకపోతున్నావు" అంది పరిమళాదేవి.

"ఆ... ఏంలేదు అత్తమ్మా! మీ పక్కింటి పెద్దిరెడ్డి వాళ్ళ ఇంటికి వచ్చాను. అట్లాగే ఇక్కడికి రావాలనిపించి వచ్చాను అంతే" మాట దాటవేశాడు వరప్రసాద్.

పరిమళాదేవి మాత్రం అతడి మాటలు అబద్ధం అన్నట్టుగా తనలో తనే చిన్నగా నవ్వుకుంది.

★ ★ ★

"అమ్మమ్మా అమ్మమ్మా" హడావిడిగా పరుగెట్టుకువచ్చింది కస్తూరి.

"ఏంటే హడావిడి? " దేవీ పూజావిధానాన్ని గురించి ఏకాగ్రతగా చదువుతున్న పరిమళాదేవి తలెత్తి చూసింది.

"అమ్మమ్మా! నీవు చాలా చాలా మంచిదా నివికదా?" వచ్చి పరిమళాదేవి పక్కన కూర్చుంది కస్తూరి.

"ఎందుకే? ఏదైనా సందేహమా?" అడిగింది పరిమళాదేవి.

"సందేహం లేకుండా నీవు మంచిదానివే" అంది కస్తూరి.

"మరి ఎందుకు అడిగావు?"

"ఎందుకు అడిగానో చెప్తాను. నాకు ఏమి స్తావు?"

"కేవలం నీ లంచంకోసం అమ్మా వాళ్ళపై చాడీలు చెప్పడానికి వచ్చావుకదూ?"

"నువ్వు ఎప్పుడూ ఇంతే. నిజం చెప్పినా నమ్మవు"

"నీవన్నీ అబద్ధాలని నాకు తెల్సు"

"ఈ సారి మాత్రం నన్ను అబద్ధం అన డానికి వీల్లేదు. నీవు అనలేవు కూడా"

"ఎందుకు అనలేను?"

"ఎందుకు అనలేవో తర్వాత చెప్తాను. ముందు నాకేం ఇస్తావు?"

"దేవుడి దగ్గర అరటిపళ్ళు వున్నాయి. తెచ్చుకో పో"

"అరటిపళ్ళా? మరీ చీపు" చప్పబడిపో యింది కస్తూరి.

"మరేం కావాలి"

"ఆ..." అంటూ కాసేపు ఆలోచించి, "నేను అడిగింది ఇస్తావా?" అడిగింది కస్తూరి.

"ఇస్తాను"

"మాట తప్పవుకదా"

"తప్పను"

"అయితే, నాకు... వంద రూపాయలు కావాలి. ఇస్తావా?"

"వంద రూపాయల్తో నీకేం పని?"

"అదిగో అవన్నీ అడగద్దు"

"చెప్తేనే ఇస్తాను" డబ్బు కారణంగా పిల్లలు చెడిపోతారని కాస్త సీరియస్‌గానే అంది పరిమళాదేవి.

"మన ఊరి కాళికాదేవికి వచ్చేవారం నుంచి అవేవో పూజలు జరిపిస్తారట కదా" అంది కస్తూరి.

"ఆ... బ్రహ్మోత్సవాలు. ఈ పూజలకి, నీ డబ్బుకి ఏమిటి సంబంధం?" పరిమళాదే వికి ఏమీ అర్థంకాలేదు.

"పూజల సమయంలో నాలాంటి పిల్లల కోసం అక్కడ తినుబండారాలు కూడా అమ్ముతారట. మా ఫ్రెండ్స్ చెప్పారు. అందుకే డబ్బు అడిగాను. అమ్మమ్మ అడి గితే ఇవ్వదు కాబట్టి నిన్ను అడుగుతు న్నాను. నీవు మంచిదానివని నాకు తెల్సు. మరి డబ్బు ఇవ్వు" చేయి చాచింది కస్తూరి.

"తినుబండారాలు అమ్ముతారని మీ ఫ్రెండ్స్ కలగన్నారా? అక్కడ ఏవీ అమ్మరు. ఒకవేళ అమ్మితే అప్పుడే డబ్బు ఇస్తాను" చెప్పింది పరిమళాదేవి.

"ఫో..." ఏడుపు ముఖంతో ముఖం చిట్లించి "ఇప్పుడు నేను కూడా నిన్ను చెడ్డ దానివే అంటున్నాను" అంది కస్తూరి.

"సరే, నేను రాక్షసిని" అంది పరిమళా దేవి.

"నిజంగానే రాక్షసివి" అంటూ అక్క డ్నుంచి లేచి వెళ్ళిపోయింది కస్తూరి.

"బంగారుతల్లి" అంటూ వెళ్తున్న కస్తూరినే చూస్తూ చిరునవ్వు నవ్వి, ఆ పిల్ల గుమ్మం దాటి వెళ్ళిపోయాక తిరిగి దేవీపూజా విధా నాన్ని చదవబోయిన పరిమళాదేవి చూపులు కస్తూరి జారవిడిచిన ఫొటోమీద పడ్డాయి. ఫొటో బోర్లా పడివుంది.

"ఫొటోలా వుందే..." అనుకుంటూనే ఫొటోని చేతిలోకి తీసుకున్న పరిమళాదేవి కనుబొమలు అప్రయత్నంగా ముడిప డ్డాయి. ఆ ఫొటో తనదే! కాపోతే అది సహ జంగాలేదు. నిలువునా తీయించుకున్న తన ఫొటో అణువణువునా సూదితో గుచ్చిన రంధ్రాలు వున్నాయి.

"ఏంటమ్మగోరూ! అంత ఇదిగా సూసు కుంటున్నారు" సాయంకాలం వంటచేసి వెలుపలికి వస్తూ, దూరంనుండే అడిగింది

 

బుచ్చమ్మ.

"ఏంలేదుగానీ ఓ గ్లాసు పాలు పట్రా" ఫోటోను బోర్లా కప్పేస్తూ చెప్పింది పరిమళాదేవి.

"ఇప్పుడే తాగారుకదా అమ్మగోరూ! తాగిన గిలాసు కూడా అక్కడే వుంది" అంటూ ఆశ్చర్యపోయింది బుచ్చమ్మ.

"తలనొప్పిగా వుందే" చెప్పింది పరిమళాదేవి.

బుచ్చమ్మ వెనుతిరిగి లోపలికి వెళ్ళిపోయింది. పరిమళాదేవి ఆ ఫోటోను ముక్కలు చేసి సమీపంగా వున్న చెత్తబుట్టలో పడవేసింది. ఆ ఫోటో విషయమై ఆమె ముఖంలో ఎలాంటి భావనలు కనబడడంలేదు.

పాలగ్లాసుతో కొంతసేపటికి వెలుపలికి వచ్చింది బుచ్చమ్మ. నిజానికి పరిమళాదేవికి తలనొప్పిలేదు. ఫోటో బుచ్చమ్మ కంట్లో పడకూడదనే తలనొప్పి అబద్ధం ఆడింది. అందుకే బుచ్చమ్మ తీసుకువచ్చిన పాలగ్లాసు అలాగే పక్కన పెట్టుకుని తిరిగి దేవీపూజా విధానాన్ని చదవనారంభించింది.

"అమ్మమ్మా..." మళ్ళీ వచ్చింది కస్తూరి.

ఏంటన్నట్టుగా పుస్తకంలోంచి తలెత్తిచూసింది పరిమళాదేవి.

"నేను ఇక్కడ ఏదైనా పడేసుకున్నానా? " కళ్ళతోనే అటూఇటూ వెదుకుతూ అడిగింది కస్తూరి.

"ఏంలేదు" చెప్పింది పరిమళాదేవి.

"ఏం లేదా? " సందేహపడుతూ పెదవి కొరుక్కుంటూ తెగ బాధపడిపోయింది కస్తూరి.

"ఏం పడేసుకున్నావేంటి? " ఏం తెలియనట్టుగా అడిగింది పరిమళాదేవి.

"ఫోటో..." నిర్లిప్తంగా చెప్పింది కస్తూరి.

"నాదా? నీదా? " కావాలని అంది పరిమళాదేవి.

ఆమెతీరు కస్తూరికి అనుమానం తెప్పించింది.

"అమ్మమ్మా! ఫోటో నీకు దొరికింది కదూ? " గుచ్చి గుచ్చి చూస్తూ వేలుపెట్టి చూపిస్తూ అడిగింది.

"దొంగా!" అంటూ కస్తూరిని చేయిపట్టి దగ్గరగా లాక్కుని "డబ్బుకోసం నా ఫోటోకి నిలువునా రంధ్రాలు చేసి, పైగా ఆ రంధ్రాలు మరెవ్వరో చేశారని నన్ను నమ్మించాలనుకున్నావు కదూ? నీ అల్లరి నాకు తెలీదనుకోవద్దు. డబ్బు కావాలి కాబట్టి కావాలని అడుగు. అంతేకానీ ఇలాంటి వెధవపనులు చేయద్దు. ఇందువల్ల మనస్పర్థలు ఏర్పడి అనుబంధాలు తెగిపోతాయి. సరేనా? " చల్లని మనసుతో మాట్లాడింది పరిమళాదేవి.

"అదికాదు అమ్మమ్మా" ఏదో చెప్పబోయింది కస్తూరి.

"నువ్వు ఇంకేమీ మాట్లాడొద్దు. డబ్బు అడిగావు కాబట్టి, అంత డబ్బు ఇవ్వనుగానీ ప్రస్తుతం పది రూపాయలు ఉంచుకో" అంటూనే నడుంలో దోపుకున్న పర్సులోంచి పదిరూపాయల నోటుతీసి కస్తూరికి అందించింది పరిమళాదేవి.

పదిరూపాయలు చేతిలోకి తీసుకుని, పరిమళాదేవివైపు కొన్నిక్షణాలు చిత్రంగా చూసి ఆ తర్వాత తనలోతనే ఏదో అనుకుంటూ అక్కడ్నుంచి వెళ్ళిపోయింది కస్తూరి.

"అమ్మగోరూ" పరిమళాదేవికి పాలగ్లాసు అందించి, మరేదో పనిమీద లోపలికి వెళ్ళిన బుచ్చమ్మ ఆదుర్దాగా పిలుస్తూ వెలుపలికి వచ్చింది.

"ఏంటే? " అడిగింది పరిమళాదేవి.

"ఇత్తడి మరచెంబు కనబడ్డంలేదమ్మగారూ" చెప్పింది బుచ్చమ్మ.

"అదేంటీ? రోజూ ఒక వస్తువు కనబడడంలేదని చెప్తున్నావు? ఇన్నాళ్ళూ పోని వస్తువులకి ఈమధ్యే కాళ్ళు వచ్చాయా ఏంటి? " అడిగింది పరిమళాదేవి.

"ఏమో అమ్మగోరూ! నాకు ఏందీ అర్థమైతలేదు. తమరు నన్ను అనుమానిస్తారేమో

నని ఒకటే దడగా వుంది" భయపడ్తూనే అంది బుచ్చమ్మ.

"నువ్వేమయినా కొత్తదానివా? నీమీద నమ్మకం కుదరకపోవడానికి? నీవు ఈ ఇంట్లో ఒకరిగా వుంటూ చాలా ఏళ్ళే అయ్యిందికదా? మరి ఆ పరాయిమాట ఏంటీ? " పరిమళాదేవి గొంతులో గదమాయింపు.

"ఏందో అమ్మగోరూ! నాకంతా బెదురుగా వుంది" బుచ్చమ్మలో కలవరం.

"నువ్వేమీ ఆందోళన పడద్దు. వస్తువుల్ని ఎక్కడో పెట్టి మర్చిపోయుంటావు. తీరిగ్గా వెదుకు. కొన్నిసార్లు అవసరమైన వస్తువులు వెదికినా కనిపించవు. కాబట్టి నువ్వేం కంగారుపడద్దు. సరిగ్గా వెదికితే అవే కన్పిస్తాయి" చెప్పింది పరిమళాదేవి.

బుచ్చమ్మ ఇంకేమీ మాట్లాడలేదు. బాధగా వచ్చి పరిమళాదేవి కూర్చున్న కుర్చీకి సమీపంగా నేలమీద కూర్చోబోతూ పాలగ్లాసును చూసి "అదేంది అమ్మగోరూ! తలనొప్పి అన్నారుగదా? " అడిగింది.

"తాగాలనిపించట్లేదు. నువ్వు తాగెయ్యవే" అంటూనే పాలగ్లాసును బుచ్చమ్మకు అందించింది పరిమళాదేవి.

బుచ్చమ్మ పాలగ్లాసును తీసుకుని లోపలికి వెళ్ళి పాలను తన తాలూకు గ్లాసులోకి ఒంపుకుని, తిరిగి పరిమళాదేవి దగ్గరకు వచ్చి కూర్చుంటూ, "తమరి కడుపులోకి దిగాల్సినవి నా కడుపులోకి దిగుతున్నాయి అమ్మగోరూ" అంది.

"పరిస్థితులు కొన్నిసార్లు ఇట్లాగే వుంటాయి. నీకు తెలీదుగానీ నేను కూర్చోవాల్సిన నేలమీద నీవు కూర్చుంటున్నావు. నీవు కూర్చోవాల్సిన కుర్చీలో నేను కూర్చుంటున్నాను" భావగర్భంగా అంది పరిమళాదేవి.

"అయ్యయ్యో! అమ్మగోరూ" తాగుతున్న పాలగ్లాసును తీసి పక్కకు పెట్టేస్తూ అపచారంగా అంది బుచ్చమ్మ.

"అవునే దగ్గరగా ఉండాల్సిన మనవడు ఎక్కడో దూరంగా ఉంటున్నాడు. నీడలాంటి కొడుకు ఎప్పుడో వెళ్లిపోయాడు. ఇక ఈ ఆత్మీయులు... వీళ్ల గురించి ఏం చెప్పాలి, ఎంత చెప్పాలి... నాకు మాటలు రావడంలేదు. వీళ్లందరిమధ్యా నేనొంటరిదాన్ని. ఎన్ని భాగ్యాల మధ్య గడిపినా ఏం లాభమే? నీకు అందరూ ఉన్నారు. అందుకే నీవు మహారాణివి. నేను నీ అదృష్టంముందు దాసి కంటే అన్యాయమైన దాన్ని" బరువెక్కిన గుండెతో చెప్పుకుపోయింది పరిమళాదేవి.

"ఏంది అమ్మగోరూ! కొత్తగా మాట్లాడుతున్నారు? " కలవరపడిపోయింది బుచ్చెమ్మ.

"ఏం లేదే. మాటవరసకి అన్నాను. నా చెల్లెలి కుటుంబం నాకు ఆసరా లేకపోతే నేను అసలు బతకగలనా? " అంది పరిమళాదేవి.

"నిజమే అమ్మగోరూ" అంది బుచ్చమ్మ.

"సర్లే, సర్లే, ఎక్కడినుండో ఎక్కడికో వెళ్లిపోతున్నాను. నీ పని నీవు చూసుకో. నా పనేంటో నేను చూసుకుంటాను" చెప్పి తిరిగి ఎప్పట్లా అమ్మవారి పుస్తకాన్ని చదువుకోసాగింది పరిమళాదేవి.

బుచ్చమ్మ పాలు తాగుతూ కూర్చుండిపోయింది. ఇప్పుడు ఆమె మనసులో చేయాల్సిన పని గురించి ఆలోచన లేదు. వెళ్లిపోయిన రఘుబాబు గురించిన ఆలోచన మాత్రమే ఉంది.

★ ★ ★

"ఏంటే ఇన్ని వస్తువులు జమ చేశావు? " చిన్న గుట్టగా పోగైన వివిధ వస్తువుల్ని చూస్తూ కళ్లింత చేసింది జానకీదేవి.

"ఆ ముసల్దాని సొత్తు! సొమ్ము ఒకడిది, సోకు ఒకడిది..." ఖుషీగా అంది శకుంతల.

"ఇవి ఇక్కడ ఉంటే బావుండదు. కావేరమ్మకు పంపించు" చెప్పాడు సూర్యప్రకాశరావు.




"దాని అత్తామామల పీడ విరగడై, దాని సంసారం దాని చేతికి వచ్చాక పంపిస్తాను" చెప్పింది శకుంతల.

"అది ఇప్పట్లో అయ్యే పని కాదు" అన్నాడు వరప్రసాద్.

"అయ్యేలా మనం చేస్తాం" ధీమాగా అంది శకుంతల.

అంతలోనే బయట తలుపు శబ్దమైంది. అందరూ అటు చూశారు.

"కస్తూరి కావచ్చు" అనుకుంటూ వెళ్లి తలుపు తీసింది శకుంతల.

ఎదురుగా ఒణుకుతూ, ఏడుస్తూ సర్వం కోల్పోయిన స్థితిలో వుంది బుచ్చమ్మ.

"ఏమైందే? " కంగారు ప్రదర్శించింది శకుంతల. నిజానికి ఆమె మనసులో ఏ కంగారూ లేదు. ఆమె స్థితిని చూడగానే పరిమళాదేవికి ఏదో జరిగి ఉంటుందని క్షణంలో ఊహించింది.

"అమ్మగోరూ! పెద్దమ్మగోరు ఇంగ బతకరు" గుండెలు బాదుకుంది బుచ్చమ్మ.

"ఏమైందే? " తను కూడా ఏడ్వసాగింది శకుంతల.

"సెస్సిబాబుగోరు వొస్తున్న గాలిమోటరు సముద్రంలో పడిపోయిందట" చెప్తూనే పెద్దపెట్టున రాగాలు తీసింది బుచ్చమ్మ.

"అయ్యో! పెద్దమ్మా! ఎంత అన్యాయమై పోతివే? " ఆ వెంటనే గుండెలు బాదుకోవడం మొదలెట్టింది శకుంతల. అప్పటికే వెలుపలికి వచ్చేసిన సూర్యప్రకాశరావు కూడా కూతురితోపాటుగా గుండెలు బాదుకుంటూ ఏడవసాగాడు. వరప్రసాద్ మాత్రం విన్న వాస్తవాన్ని జీర్ణించుకోలేని స్థితిలో శిలాప్రతిమలా నిలబడిపోయాడు. లోపల నడవలేని స్థితిలో వున్న జానకీదేవికి పరిస్థితి వెంటనే అర్థంకాలేదు. అర్థమయ్యాకమాత్రం చప్పట్లు చరుస్తూ శోకాలు పెట్టింది.

జానకీదేవి మినహా మిగతా అందరూ వెంటనే పరిమళాదేవి ఇంటికి వెళ్లారు. మళ్ళా వెళ్ళేసరికే చుట్టుపక్కలవాళ్ళంతా గుమిగూడి వున్నారు. వాళ్ళల్లో కొందరు ఏడుస్తున్నారు, కొందరు సానుభూతి కనబరుస్తున్నారు, మరికొందరు జాలిపడుతున్నారు.

అందరికీ అతీతంగా మధ్య హాల్లో వేచి వున్న ఈజీ ఛెయిర్‌లో తలను వెనక్కి వాల్చేసి జారగిలబడి కూర్చునివుంది పరిమళాదేవి. 'ఆమె వదనం తిమిరం కాటేసిన తేజస్సులావుంది. వ్యర్థమైన ఉషస్సులా ఉంది. నిలువెత్తున నిర్వికార చింతన... అంతా ఒక తీరని వేదన, రోదన. మిగిలింది ఇంకేమీలేదు కాబట్టి ఆమె ఒక జీవశ్చవం... ఆరిన అగ్నిహోత్రం"

"పెద్దమ్మా...". బిగ్గరగా ఏడుస్తూ పరుగున వెళ్ళి పరిమళాదేవిని కావలించుకుంది శకుంతల.

"వదినమ్మా... మనకు ఇంకేం మిగిలింది వదినమ్మా" సూర్యప్రకాశరావు తల బాదుకోసాగాడు.

అంతా చూస్తూ వచ్చిన జనాలు మరింత ఏడవసాగారు. అందర్నీ అలా చూస్తున్నా కూడా వరప్రసాద్‌కి ఏడుపు రాలేదు. "ఏడ్చి ఏం లాభం? " అని తలుస్తున్న అతడిలో కసిమాత్రం క్షణక్షణానికీ పెరుగుతోంది. దయలేని విధిని పట్టి చంపాలన్న కక్ష అతడిని బండరాయిలా మారుస్తోంది. బడబాగ్నిని పెకిలిస్తోంది. తోడుగా మొసలికన్నీళ్ళతో ముసలి ప్రాణాన్ని అనునయిస్తున్న తనవాళ్ళను నిలువునా నరకాలనిపిస్తోంది.

చూస్తుండగానే సాయంత్రం కావచ్చింది. మధ్యాహ్నమనగా తెలిసిన విషాదవార్త. అంతవరకూ కూడా పరిమళాదేవిలో కన్నీళ్ళను రప్పించలేదు. కూర్చున్నచోటునుండి కదిలించలేదు. కనీసం ఒక మాటనైనా మాట్లాడించలేదు.

"అమ్మగోరు ఇంక బతకరు. నేను కూడా ఇంగ బతకను" ఏడ్చిఏడ్చి అలసిపోయిన

బుచ్చమ్మ నిర్లిప్తంగా అంది.

"బుచ్చమ్మా! నీవు ఇక్కడ్నుంచి పక్కకు కదలొద్దు. పెద్దమ్మను అంటిపెట్టుకుని వుండు. నేను ఇంటికి వెళ్ళొస్తాను. అవతల అమ్మ ఎంత ఏడుస్తోందో ఏమో? " బొంగురుపోయిన గొంతుతో చెప్పింది శకుంతల.

సరే అన్నట్టుగా తలాడించింది బుచ్చమ్మ. శకుంతల నడవడానికి శక్తి లేనట్టుగా ఒక్కో అడుగు ముందుకు వేయసాగింది. ఆమె జుట్టు రేగి, కళ్ళు ఎరుపెక్కి శోకదేవతలా కనబడుతోంది. వచ్చిన జనాలు "ఎంతయినా అన్నకొడుకు" అంటూ ఆమె దుఃఖాన్ని చూసి జాలిపడ్డారు జనాలు.

అదే నీరసంతో ఇంట్లోకి వెళ్ళి, మధ్య హాలులోకి వెళ్ళగానే ఎప్పట్లా చలాకిగా మారిపోతూ "అమ్మా" ఆనందంగా పిలిచింది శకుంతల.

"రావే...రావే..." జానకీదేవిలో కూడా వికృతమైన ఆనందం.

"ఆ భగవంతుడు మనకు ఎంత గొప్ప సహాయం చేశాడో చూశావా? " అంటూ కళ్ళనీళ్ళు తుడ్చుకుంది శకుంతల.

"అదేంటే ఏడుస్తున్నావు? మనకు శుభం జరిగిన సందర్భంగా నవ్వాలిగాని" అంది జానకీదేవి.

"ఇప్పుడే కాదమ్మా; నేను మధ్యాహ్నం నుండి ఏడుస్తున్నానే. అదంతా ఏడుపు కాదు, ఆనందం. తనివితీరని ఆనందం! ఇప్పుడు మనకు ఎలాంటి అడ్డంకులు లేవు. మనం కోరుకున్న సామ్రాజ్యం మనదే! ఆ ముసల్ది కూడా అప్పుడో ఇప్పుడో అన్నట్టుగా వుంది. ఆ ఒక్క వూపిరి వెళ్ళిపోతే ఇంకా సంతోషం. వెళ్ళిపోకపోయినా జరిగే నష్టం లేదు" మాట్లాడ్తూనే ఆనందం కొద్దీ ఏడ్వసాగింది శకుంతల.

"నన్ను ఎట్లాగయినా అక్కడికి తీసుకువెళ్ళవే. దాని అవస్థను చూసి ఆనందంగా నేనూ ఏడుస్తాను" కోరింది జానకీదేవి.





"తప్పకుండా తీసుకువెళ్తాను" చెప్పింది శకుంతల.

"అవునే... కస్తూరి అసలు ఇంటికే రాలేదు. తెలిసి స్కూల్‌నుండి నేరుగా అక్కడికే వచ్చిందా ఏంటీ? " గుర్తుచేసింది జానకీదేవి.

"నాకు కనిపించలేదే" అయోమయపడింది శకుంతల.

"మరి ఎక్కడికి వెళ్ళినట్టు? చూడవే! అసలు రోజులు బాగోలేవు" తొందరపెట్టింది జానకీదేవి.

"ఆనందాన్ని హాయిగా అనుభవించకుండా ఈ పిల్ల ఎక్కడికి వెళ్లినట్టు? " అనుకుంటూ హడావిడిగా బయటకి వెళ్ళిన శకుంతలకి గేట్ తెరుచుకుని లోపలికి వస్తున్న కస్తూరి కనబడింది.

"ఇంతసేపు ఎక్కడికి వెళ్ళావే? " గుండెలనిండా ఊపిరి పీల్చుకుంటూ కూతురు దగ్గరగా రాగానే అడిగింది శకుంతల.

"శశి బావ వస్తున్న విమానం సముద్రంలో కూలిపోయిందట కదా! మరి శశి బావ చచ్చిపోయినట్టే కదా! అందుకే నాకు బాధగా వుంది. పాపం పెద్ద అమ్మమ్మ! తన కొడుకూ చచ్చిపోయాడు, మనవడూ చచ్చిపోయాడు. కాబట్టే ఏడుస్తూ ఆ గుడి దగ్గర కూర్చుని ఇప్పుడు వస్తున్నాను" సన్నగా వెక్కుతూ చెప్పింది కస్తూరి.

"అవును నిజమే. అయినా ఇంటికి రాకుండా గుడి దగ్గర కూరోవడమెందుకూ? పద అమ్మమ్మ దగ్గరకెళ్లి ధైర్యం చెప్పాలి " అని శకుంతల కస్తూరితో వేగంగా పరిమళాదేవి ఇంటివైపు నడుస్తుంటే వరప్రసాద్ ఎదురొచ్చాడు హడావిడిగా!

"ఏమండీ? మా అమ్మ ఇక్కడికి వస్తానంటోంది. మా పెద్దమ్మ కారే తీసుకెళ్ళి తీసుకురండి" చెప్పింది శకుంతల.

"సర్లేగాని, నీవు త్వరగా వచ్చెయ్. ఆమె పరిస్థితి హీనంగా వుంది" చెప్తూనే తిరిగి వెనక్కి వేగంగా వెళ్ళిపోయాడు వరప్రసాద్.

తండ్రి వెనకాలే పరుగెట్టింది కస్తూరి.

శకుంతల కూడా వడివడిగా నడవసాగింది. కాగా ఆమెలో ఈసారి మునుపటి కంటే ఆనందం రెట్టింపయ్యింది. కాని ఆ భావాలు మాత్రం ఆమెలో మచ్చుకైనా కనబడట్లేదు.



కూర్చున్నది కూర్చున్నట్టే సొమ్మసిల్లిపోయిన పరిమళాదేవిని పక్క టౌను ఆసుపత్రికి తీసుకువెళ్ళారు. అప్పటికి కావేరి, ఆమె భర్త వరుణ్, మామగారు రామారావులు వచ్చేశారు. ఇక సూర్యప్రకాష్‌రావు కుటుంబం మొత్తంగా అక్కడే వుంది. పేరంటానికి వచ్చిన దానిలా పరిమళాదేవిని తీసుకెళ్ళిన మరుసటిరోజు తీరికగా వచ్చి పలకరించి వెళ్ళిపోయింది కావేరి అత్త కామాక్షమ్మ.

"జానకీదేవికి ఎక్కువ, శకుంతలకి తక్కువ" వచ్చి వెళ్ళిపోతున్న కామాక్షమ్మను చూస్తూ మనసులో అనుకున్నాడు వరప్రసాద్.

కావేరి అక్కడే మిగిలిపోగా, వరుణ్ రామారావులు మాత్రం... పరిమళాదేవిని ఆసుపత్రిలో చేర్పించినప్పటినుండి పూటకి ఒక్కసారి వచ్చి పలకరించి వెళ్తున్నారు.

ముఖ్యంగా పరిమళాదేవికి ప్రాణాపాయం లేదని వరప్రసాద్‌కితెలుసు. కాని ఆ విషయాన్ని ఎవ్వరికీ చెప్పవద్దని డాక్టర్లకు చెప్పాడు. ఎందుకంటే స్వార్థంతో ఆమెను రేయింబవళ్ళు అంటిపెట్టుకునే వుంటున్న తన భార్య శకుంతల, ప్రాణాపాయంలేని పరిమళాదేవికి ప్రాణాపాయం కలిగిస్తుందనేది వాస్తవం! ఇలాగని వరప్రసాద్ నిర్లక్ష్యం వహించలేదు. శకుంతలతోపాటుగా బుచ్చమ్మ వుంటున్నప్పటికీ, భార్యను ఒక కంట కనిపెడుతూ "ఈ ముసల్ది ఇక రేపోమాపో" అంటూ అత్తింటి వాళ్లను అందంగా మభ్యపెడుతున్నాడు.



వారం రోజులు గడిచిపోయాయి. పరిమళాదేవి కొద్దిగా మనుషుల్లోకి రాగలిగింది. కాగా అంతవరకూ కూడా శశాంక ఆచూకీ మాత్రం తెలిసిరాలేదు. శశాంక ఒక్కడిదే కాదు, ఇతర ప్రయాణీకుల జాడ సైతం వీడని ప్రశ్నగానే మిగిలిపోయివుంది! ప్రభుత్వం గాలింపు చర్యల్ని ముమ్మరంగా కొనసాగిస్తున్నప్పటికీ విమాన శకలాల్నే తప్ప, మానవ శవాల వునికి ఎంతమాత్రం అంతుబట్టడంలేదు.

పరిమళాదేవి గొంతు మనవడికోసం మూగపోగా, అక్కడ శశాంక అమ్మమ్మగారి పరిస్థితి దీనావస్థను చేరుకుంది. ఇదేమీ శకుంతలగాని, సూర్యప్రకాష్‌రావుగాని, జానకీదేవిగాని పట్టించుకోలేదు. వీళ్ళ బాధంతా పరిమళాదేవి ఇంకా ఎందుకు చనిపోలేదాని! ఇదే విషయాన్ని ఒకరోజు అనువైన సమయం చూస్కుని భర్తను అడిగింది శకుంతల.

"ఇలా గుండెపగిలిన వాళ్ళు చూడ్డానికి బాగానే వుంటారు కాని చూస్తుండగానే వెళ్ళిపోతారు" చెప్పాడు వరప్రసాద్.

"వెళ్లకపోతే?" తెగ బాధపడిపోతూ అంది శకుంతల.

"అది ఇంపాజిబుల్! ఈ ముసల్ది ఇక ఈ జన్మకు కోలుకోలేదు. ఎందుకంటే తగిలింది చావుదెబ్బ" వికృతంగా అన్నాడు వరప్రసాద్.

"ఇది సరేగాని, ఈ ముసల్ది హరీమన్న తర్వాత, శశాంక అమ్మమ్మ వాళ్ళు ఎవ్వరొచ్చినా వాళ్ళని గుండెధైర్యంతో ఎదురించాలి. ఆడంగి మొహంలా అణిగిమణిగి వుండకూడదు. అయినా వాళ్ళు ఇక్కడికి రాలేరు. వచ్చే అధికారంగాని, హక్కుగాని వాళ్ళకు ఇప్పుడు లేదు. మనమే వారసులం! మనమే విజేతలం!" గతవారం రోజుల్నుండి ఈ మాటల్ని చెప్తూనే వుంది శకుంతల. అందుకే వరప్రసాద్ విసుగ్గా "ఈ మాటలు వినీవినీ విసుగొస్తోంది" అన్నాడు.

"విసుగురావడం కాదు. ఈ మాటలు మీ మెదడులో కణాల్లా నాటుకుపోవాలి"

"నాటుకుపోయాయి"

"నాటుకుపోయాయి అనడం కాదు, పరిస్థితి ఒకవేళ ముంచుకువస్తే, రామాయణం అంతా విన్నాక రాముడికి సీత ఏం కావాలి అన్న చందాన వుండకూడదు. ఒకవేళ వున్నావే అనుకో, ఇక నీకూ నాకూ ఎలాంటి సంబంధం వుండదు"

"సరేలేవే" చెప్పి అక్కడ్నుంచి వెళ్లబోయాడు వరప్రసాద్.

"ఏమండీ..." గోముగా పిలిచింది శకుంతల.

ఏంటన్నట్టుగా ఆగిపోయాడు వరప్రసాద్.

"డాక్టర్‌కి చెప్పి ఆ ముసల్ది తొందరగా చనిపోయేలా చూడకూడదూ?" అతడి షర్టు గుండీలు సవరిస్తూ అడిగింది.

"అది మనకు బ్యాడ్ రిమార్క్! అందరిలో మనం మంచివాళ్ళుగా వుండాలి. మన మంచికోసం ప్రయత్నించాలి" చెప్పాడు వరప్రసాద్.

"అమ్మగోరూ" శకుంతల మరేదో అనబోతుంటేనే దూరంగా బుచ్చమ్మ గొంతు వినబడింది.

"దీని మొహం మండ! ఆ ముసల్దానికి దీనిమీద నమ్మకం పోవాలని, దీన్ని ఇంట్లోంచి వెళ్ళగొట్టాలని, ఆ తర్వాత ఇష్టారాజ్యంగా ఆడించాలని ఎన్నో అనుకున్నాను. కాని ఇంట్లో వస్తువులు పోయినా ఆ ముసలి పీనుగకు దీనిమీద నమ్మకం పోలేదు. ఇప్పటికీ దీని పీడ విరగడకాలేదు. అయినా ఇది మనల్నేం చేస్తుంది? రాజ్యం కూలిపోయాక భటులెవ్వరూ కూడా ఏమీ చేయలేరు" కసిగా అంది శకుంతల.

"ఆపు... అది వచ్చేస్తోంది" వారించాడు వరప్రసాద్.

"సరే సరే నువ్వెళ్ళు" అని, తను ఒక్కతే బుచ్చమ్మ వస్తున్న దిశగా వెళ్ళింది శకుంతల.

వరప్రసాద్ డాక్టర్ చాంబర్‌వైపుగా వెళ్ళాడు.

★ ★ ★

నెలరోజులు గడిచిపోయాయి. పరిమళాదేవి డిశ్చార్జి అయ్యి అప్పటికి వారంరోజులు దాటింది. అప్పటికి జానకిదేవిలో కూడా కొద్దిగా మార్పు వచ్చేసింది. సపోర్టింగ్ స్టాండుతో ఒక్కో అడుగు ముందుకు వేయగలుగుతోంది. అలా నడుస్తూనే మెల్లిగా పరిమళాదేవి ఇంటికి కూడా వెళ్తోంది. పరిమళాదేవి మామూలు మనిషి కాలేదుకాని, తన వాళ్లతో మాత్రం ఒకటి రెండు మాటలు మాట్లాడగలుగుతోంది. ఆమెను మామూలు మనిషిని చేయాలని బుచ్చమ్మ ప్రయత్నిస్తోంది. కాని విఫలం అవుతోంది.

ఇక శకుంతల తమ స్వంతం కాబోయే ఐశ్వర్యాలకోసం ఆసక్తిగా ఎదురుచూస్తోంది. పరిమళాదేవి చావుకోసం ఎప్పటిలా ఎదురుచూస్తున్నప్పటికీ "ఆ ముసల్ది చావకపోయినా ఆస్తి తమదే" అన్న ధైర్యం ఆమెను కొత్త ఆనందాలకి చేరువ చేస్తోంది.

★ ★ ★

"అమ్మా నీకో గుడ్‌న్యూస్ మా




మావయ్యా వాలెంటరీ రిటైర్‌మెంట్ తీసుకుంటున్నారు. దీంతో మీ అల్లుడికి ఢిల్లీలో ఉద్యోగం రాబోతోంది. ఏళ్ళ తర్వాత కాదు. నెల రోజుల తర్వాతే! ఉద్యోగంలో జాయిన్ అయిన వెంబడే ఢిల్లీ వెళ్ళిపోతాం. ఆల్రెడీ మీ అల్లుడి మేనత్త అక్కడే వుంటుంది కాబట్టి అక్కడ మా కొత్త సంసారానికి ఎలాంటి ఇబ్బందులు వుండవు" ఫోన్ చేసి తల్లితో సంతోషంగా చెప్పింది కావేరి.

"నిజమా? " నమ్మలేకపోయింది శకుంతల.

"అవునమ్మా! నా బాధలు ఇంత తొందరగా తొలిగిపోతాయని నేను కలలో కూడా అనుకోలేదు. అసలు ఇందుకు కారణం ఎవరో తెల్సా? మామయ్యగారే! మొదట్లో అతణ్ణి పొరపాటుపడ్డాను గాని అతడు చాలా మంచివాడు. కాపోతే పెళ్ళానికి భయపడి పెదవి విప్పడు. కాని ఏమయిందో ఏమో... ఇప్పుడు పెళ్ళాం అనే సముద్రానికి ఎదురు ఈదుతున్నాడు. అందుకే తన కొడుకు ఒక్కడ్నే ఢిల్లీ పంపించాలనే పట్టుదలతో మా అత్తగారి మాటను ససేమిరా విన్పించుకోవడం లేదు" గలగలా మాట్లాడింది కావేరి.

"ఆ! దాన్ని ఇంకా ఇంకా అణగదొక్కాలి" తన స్థానాన్ని మరిచి కసిని వెళ్ళగక్కుకుంది శకుంతల.

"అవునూ పెద్ద అమ్మమ్మకు ఎలా వుంది? " గుర్తుచేసింది శకుంతల.

"ఆ ముసల్దానికి ఎలాగైనా వుండనీ. దాని గురించి ఇప్పుడు మాట్లాడవద్దు. ఎందుకంటే శుభప్రదమైన మాటల్ని మాట్లాడేటప్పుడు చచ్చేవాళ్ల గురించి మాట్లాడకూడదు" చెప్పింది శకుంతల.

"సరే!" అని "ఆ అమ్మమ్మ వస్తువులు అన్నింటిని ఇప్పుడు ఢిల్లీకి తీసుకువెళ్తాను. అక్కడ ఎవ్వరి గొడవా వుండదు కాబట్టి ఎన్నయినా తెచ్చుకోవచ్చు ఏమైనా తెచ్చుకోవచ్చు" ఆనందంగా అంది కావేరి.

"జమచేసిన వస్తువులు అంటున్నావా? "

"అవును"

"ఆ ఒక్క వస్తువులే ఏం ఖర్మ? ఆ ముసల్దాని ఆస్తిలో సగ భాగం నువ్వే తీసుకుందువుగాని"

"అంటే... మేము కారు, ఇల్లు, అన్నీ కొనుక్కోవచ్చు అన్నమాట"

"ఎంచక్కా అన్నీ కొనుక్కోవచ్చు" అని మళ్లీ...

"అవునే నీవు ఎక్కడ్నుంచి మాట్లాడ్తున్నావేంటి? " అడిగింది శకుంతల.

"రేషన్‌షాపు కోసం బయటకి వచ్చి ఎస్.టి.డి. నుండి మాట్లాడుతున్నాను" చెప్పింది కావేరి.

"హమ్మయ్య!" హాయిగా ఊపిరి పీల్చుకుని, "సరేలేవే! మొత్తానికి నీ సంసారం మనం అనుకున్నట్టుగా వేరుపడింది. మనది ఏం అదృష్టమో ఏమోగాని అన్నీ అనుకున్నవి అనుకున్నట్టుగానే జరుగుతున్నాయి." అంది శకుంతల హుషారుగా.

"ఇంట్లో నాకోసం ఎదురుచూస్తుంటారు. ఇప్పటికే బాగా ఆలస్యం అయ్యింది. అందర్నీ అడిగినట్టు చెప్పు. ఇక నేను వుంటాను" అని చెప్పి, ఆ వెంటనే ఫోన్ పెట్టేసింది కావేరి.

"నా బంగారు తల్లీ!" మురిపెంగా అంటూ తనూ ఫోన్ పెట్టేసి "చూశావా అమ్మా! మనల్ని అదృష్టం ఎంతగా వెంటాడుతోందో? " తల్లివైపు గర్వంగా చూసింది శకుంతల.

"అంతా అర్థమైంది. ఒక్కటి మాత్రం అర్థంకాలేదు" అంది జానకిదేవి.

"ఏవిషయం? "

"అదే, పిల్లాడి చదువు పూర్తయ్యాక వ్యాపారం పెట్టించాలనే ముఖ్యంగా అనుకున్నారు కదా? మరి అనుకోకుండా ఉద్యోగంలో చేర్పిస్తున్నారెందుకో? " జానకీదేవి అంటుంటేనే, వరప్రసాద్ వస్తూ... "కావాలనే ఉద్యోగంలో చేర్పిస్తున్నారు" అన్నాడు.

"మీకెలా తెల్సు? " ఆశ్చర్యపోయింది



శకుంతల.

"నిన్న ఆ ముసల్దాని మందులకోసం టౌన్‌కి వెళ్ళినప్పుడు వియ్యంకుడు కల్సాడు.

"అట్లాగా! ఉద్యోగం గురించి ఏమేమి మాట్లాడాడు? " ఆసక్తిగా అడిగింది శకుంతల. వరప్రసాద్ నుండి వచ్చే సమాధానానికి జానకీదేవిలో కూడా ఆసక్తి కనబడుతుంటే, వరప్రసాద్ మాత్రం గంభీరంగా సమాధానం చెప్పుకుపోయాడు.

"తనది చిన్న ఉద్యోగం కాబట్టి, తన కొడుకును బాగా చదివించి పెద్ద ఉద్యోగంలో చేర్పించాలనుకుని, కొడుకుమీద. ఎన్నో ఆశలు పెంచుకుంటే, తీరా మన అల్లుడుగారు డిగ్రీ సెకెండ్ ఇయర్ సబ్జెక్టుల్నే గట్టెక్కించలేకపోయాడంట! ఇంక పెద్ద ఉద్యోగాలంటూ ఆశ పడటం సబబు కాదని, డిగ్రీ చదవడమే చేతకాని వాడికి వ్యాపారం పెట్టిస్తే లాభాల్ని ఏపాటి తీస్తాడోనని, అన్నివిధాలా భయపడి వాలెంటరీ రిటైర్‌మెంట్ తీసుకున్నాడు. ఇంతే కాదు, ఇంకో బలమైన కారణం కూడా వుంది. ఏంటంటే... డిగ్రీ చదవనంతమాత్రాన వ్యాపారం సరిగ్గా చూసుకోడు అనడానికి ఆస్కారంలేదు. కాపోతే తన పెళ్ళాం మన పిల్లని రాచి రంపాన పెడుతుంటే, చూళ్లేకపోయాడట. ఇట్లాంటపుడు కొడుక్కి వ్యాపారం పెట్టిస్తే, అనువైనచోటు కాబట్టి వూర్లోనే వ్యాపారం పెట్టించాల్సివుంటుంది. అప్పుడు మన పిల్ల తన పెళ్ళాం చేతిలో క్షణక్షణం కీలుబొమ్మ కావాల్సిందే. అందుకే బాగా ఆలోచించి, ఢిల్లీలో ఉద్యోగం వచ్చేట్టు ప్రయత్నించి, మన పిల్లకు తన పెళ్లాం నుండి విముక్తి కలిగించాడు"

"మా నాయనే! మా కావేరమ్మ పాలిట దేవుడివయ్యావు కదా తండ్రీ నీవు!" ప్రేమగా చేతుల్ని కణతలకు అద్దుకుంది జానకీదేవి.

"నిజంగా మన కావేరికి తండ్రిలాంటి మామ దొరికాడు" సంతోషపడిపోయింది శకుంతల.

ఇద్దరి ఆనందాన్ని ఆనందంగానే తిలకిస్తూ మనసులో మాత్రం "నేను కూడా వియ్యంకుడు రామారావుని అనుసరించాల్సిందే ఇక" కసిగా అనుకున్నాడు.

★ ★ ★

"మా రామలచ్చిమి కాన్పు కట్టమై చచ్చిపోయిందమ్మా! నన్ను చెమించు! కట్టకాలంలో వున్న తమరికి తోడుగా వుండకుండా ఎల్తున్నాను" కన్నీళ్లతో చేతులు జోడించింది బుచ్చమ్మ.

ఆ మాటలు విని, ఆ పరిస్థితిలో సైతం ఒక్కసారిగా మ్రాన్పడిపోయింది పరిమళాదేవి. కాని ఆ విషయమై ఏ ఒక్క మాట కూడా బుచ్చమ్మతో మాట్లాడలేకపోయింది. "వెళ్ళవే" అని మాత్రం అనగలిగింది.

"అమ్మా! తమరి మాట వినకుండా సిన్నపాయంలో పిల్లకు పెండ్లిజేసి తప్పుజేసినాము తల్లీ! ఇంక నా రామాలచ్చిమి ఎక్కడవుంది తల్లీ? " పరిమళాదేవి కాళ్ళు పట్టుకుంది బుచ్చమ్మ.

"కష్టమొస్తే ఆదుకునేదాన్ని. కాని చావొచ్చిందికదా! దీనికి ఎవ్వరం ఏమీ చేయలేము. ధైర్యంగా వుండమని నా మాటగా నీ కొడుకూ కోడలికి చెప్పు! నీవు కూడా ధైర్యంగా వుండు" గుండెలోతుల్లోంచి నెమ్మదిగా మాట్లాడగలిగింది పరిమళాదేవి.

"ఎత్తిదించిన పిల్లను మట్టిపాలు చేసి ఎట్లా దయిర్నంగా వుండమంటావు తల్లీ? " ఏడుస్తూనే వుంది బుచ్చమ్మ.

"నేను లేనా? " వెంటనే అంది పరిమళాదేవి.

తన మనవరాలి బాధలో మునిగి, పరిమళాదేవి పరిస్థితిని ఆ క్షణానికి మరిచిన బుచ్చమ్మ; పరిమళాదేవి ఆ మాట అనగానే ఒక్కసారిగా ఏడుపును ఆపేసింది. పరిమళాదేవి వైపు గుడ్లప్పగించి చూసింది.

"ఈ ప్రపంచంలో ఏ మనిషికైనా, తను చేయాలనుకున్నది చేసేటప్పుడు అందులోని




పొరపాటు అసలు కనిపించదు. చేసిన పని సాఫీగా సాగిపోతే ఫర్వాలేదు కానీ వక్రించి నపుడు మాత్రమే పొరపాట్లు తెలిసి వస్తుం టాయి. అందుకే ఒక పని చేసేటప్పుడు ముందుగానే వెనకాముందులు ఆలోచిం చాలి. ఇప్పుడు బాధపడి ప్రయోజనం లేదు! వెళ్లు. వెళ్లి నీ దురదృష్టాన్ని కన్నీళ్లతో ఓదా ర్చుకో" పరిమళాదేవి మాటలు బరువుగా వెలువడ్డాయి.

"అ...మ్మ...గో...రూ..." వణుకుతున్న గొంతుతో పిలిచింది బుచ్చమ్మ.

ఏంటన్నట్లుగా చూసింది పరిమళాదేవి.

"నేను చచ్చిపోవాలనుకున్నాను. కాని తమరికోసం నేను బతుకుతాను అమ్మ గోరూ" అంటుంటేనే కన్నీళ్లు ఉబికివచ్చాయి బుచ్చమ్మకు.

పరిమళాదేవి ఇంకేం మాట్లాడలేదు. ఆమెలో కన్నీళ్లు ఇంకిపోయాయి. హృదయం బండబారింది. జీవితమంటే ఏనాడో విసుగు పుట్టింది. ఇక ఇప్పుడు ఆ జీవితం మీద పూర్తిగా వెగటు పుట్టింది. అందుకే కాబోలు, బుచ్చమ్మ కన్నీళ్లకి సైతం ఆమె కళ్లు తడవడం లేదు.

కాసేపటికి బుచ్చమ్మ వెళ్లిపోయింది. పరి మళాదేవి ఒక్కతే ఆ విశాల భవనంలో ఒంటరి మహారాణిలా కూర్చుండిపోయింది.

ఆమె ఏదో దీర్ఘంగా ఆలోచిస్తోంది. ఆమె బాగా చిక్కిపోయింది. దీంతో వయసుకి మించిన వృద్ధాప్యం ఆమెలో కనబడుతోంది. అన్నీ కోల్పోయిన ఆమె మనసు శోకంతో రగులుతోంది. కసితో ఎగిసిపడుతోంది. పూర్తి తెగింపు, పూర్తి మొండితనం వచ్చే సాయి కాబట్టి మునుపటిలా మాత్రం ఆమె ఎవ్వరితో మాట్లాడలేకపోతోంది. అలాగని ఎవ్వరిపై ఆమెకు కోపంగా లేదు. కోపం ఒక్క విధిమీదే! ఆ కోపం ఆమెను ఒక అతీత చింతన వైపు తీసుకు వెళ్తోంది. కాబట్టే మాన సికంగా ఆమె మునుపటిలా వుండలేకపో తోంది. ఇక మీదట ఉండలేదు కూడా!

ఆమెకు జరిగిన అన్యాయం మర్చిపోవడ మంటే ఆమె మరణించడమే! కాని అంత సులువుగా చావడం ఆమెకు ఇష్టంలేదు. ఏదో చేయాలనుకుంటోంది. ఏదేదో చేసి తన వాళ్ల ఆత్మను శాంతపర్చాలనుకుం టోంది.

"అత్తమ్మా" పిలుస్తూ వచ్చాడు వరప్ర సాద్.

తల ఎత్తి చూసింది పరిమళాదేవి.

"మీ కూతురు గుడికి వెళ్లింది. రావడం ఆలస్యం కావొచ్చు అందుకే నేను తీసుకు వచ్చాను" చెప్తూ టిఫిన్ క్యారియర్‌ని ఆమె ముందున్న చిన్న బల్లమీద వుంచాడు వర ప్రసాద్.

"వద్దంటే వండి తెస్తున్నారు. గత రెండు నెలల నుండి నాకోసం శకుంతల శ్రమపడు తోంది. అటు ఆసుపత్రిలో ఇటు ఇంటిద గ్గర, పాపం దానికి తీరికేవుండటంలేదు" మాట్లాడుతూనే దగ్గసాగింది పరిమళాదేవి. ఆ దగ్గులో ఆయాసం వుంది.

వెంటనే ఆ పక్కగా పెట్టివున్న నీళ్లగ్లా సును అందించాడు వరప్రసాద్. తాగాక కూడా కాసేపటివరకు అలాగే దగ్గింది పరి మళాదేవి.

"ధైర్యంగా వుండండి అత్తమ్మా! ఈమధ్య కాలంలో మరీ పూర్తిగా చితికిపోయారు" చెప్పాడు వరప్రసాద్.

ఆ మాటకు పేలవమైన ఓ చిరునవ్వు నవ్వింది పరిమళాదేవి.

"భోంచేయండి అత్తమ్మా" ఆమెను మును పటిలా ఎలా మాట్లాడించాలో తెలియక, క్యారియర్ సందర్భం తీసుకు వచ్చాడు వర ప్రసాద్.

వద్దన్నట్లుగా చేత్తోనే వారించింది పరిమ ళాదేవి.

"ఇప్పటికే చాలా టైమయ్యింది" గుర్తు చేశాడు.

"కానీలే! తినకపోతే చస్తామా? చస్తే మంచిదేగా? " నిర్లిప్తంగా అంది.

"నిరాశపడొద్దు అత్తమ్మా!" ఆమెకు ధైర్యం చెప్పడం అతడినే బాధపెట్టింది. ఎందుకంటే ఆశపడేందుకు ఆమెకు ఏమీ మిగల్లేదు కాబట్టి

"నిజమే! నిరాశపడకూడదు. మనిషి జీవితం అపురూపమైనది కాబట్టి బతికినన్నాళ్లూ ఆశతో బతకాలి. ఆశతోనే చావాలి కానీ నా వాళ్లను సమూలంగా కోల్పోయిన తర్వాత కూడా నేను ఎవర్ని చూసుకుని ఆశపడాలి? దర్పాన్నే తప్ప ప్రేమను అందివ్వని ఈ ఆస్తి అంతస్థుల్ని చూసుకుని ఆశపడాలా? ఈ ఆశలో నాకు ఎలాంటి సుఖంలేదే? సౌఖ్యం ఇవ్వని ఈ డబ్బును నేను ఏం చేసుకోవాలి? " అని కాసేపాగి, "ఏమో! ఎవ్వరూ లేరని తెల్సీ కూడా నేను ఇంకా బతికే వున్నానంటే నాకు తెలీకుండా నా జీవితంపట్ల నాకు ఆశ వుందేమో!" సందేహంగా అంది పరిమళాదేవి.

"అ...త్త...మ్మా" పిలవలేక పిలిచాడు వరప్రసాద్.

ఏంటన్నట్లుగా చూసింది పరిమళాదేవి.

అతడికి నిజం చెప్పాలని ఆత్రంగా వుంది. కానీ ఒకవైపు భార్య అనే అనుబంధం, మరోవైపు పరిమళాదేవి మంచితనం, అతడ్ని ఇబ్బంది పెట్టేస్తుంటే అటు భార్య గురించి చెప్పలేకపోతున్నాడు. ఇటు పరిమళాదేవికి అన్యాయం జరుగుతుంటే చూళ్లేకపోతున్నాడు.

నిజం చెప్పలేని ధైర్యం, భార్య అనే బంధం ముందు తలవంచుకుంటుంటే ఎన్నోమార్లు అతడు నిజం చెప్పాలని వచ్చి వెనుతిరిగి వెళ్లిపోయాడు. కానీ ఇప్పుడు పరిమళాదేవి నావ నడి సముద్రంలో మునిగిపోయింది. ఇప్పుడు ఎట్టి పరిస్థితిలో మాత్రం మౌనంగా వెళ్లిపోకూడదు. అనుబంధాల్ని కొంచెంసేపు పక్కకుపెట్టి తన లోని మనిషిని మనిషిగా చూపెట్టుకోవాలి.

అటూ ఇటూ ఆలోచిస్తూ వెంటనే ఏం మాట్లాడలేకపోయాడు వరప్రసాద్.

"ఏం ప్రసాద్? " ప్రశ్నించింది పరిమళాదేవి.

"అత్తమ్మా... అదీ... అదీ" అంటూ తడబడి, "ఆ ఏం లేదు అత్తమ్మా! మీరు త్వరగా కోలుకుంటే తిరుపతికి వెళ్లిరావాలి అనుకుంటున్నాను" తోచింది చెప్పేసాడు వరప్రసాద్.

"నిజమా? " నవ్వింది పరిమళాదేవి.

"ఆ!" నిజం అన్నట్లుగా నవ్వలేక నవ్వాడు వరప్రసాద్.

పరిమళాదేవి దాదాపు ఒక్క నిముషం వరకు ఏం మాట్లాడలేదు. ఆ తరువాత వరప్రసాద్ కళ్లు తిరిగి పడిపోయేలా మెల్లగా పెదవి విప్పింది.

"నాకు అన్నీ తెలుసు ప్రసాద్"



"బాబూ... నీవు నా కొడుకులాంటి వాడివి. అందుకే నా బాధను నీతో చెప్పుకుంటున్నాను... నా జీవితం ఎన్నో కలలతో ఆరంభమైంది. ఎన్నో ఆశల గూళ్లను నిర్మించుకుని అడుగులు ముందుకు వేసింది. కానీ అడుగడుగునా ఎన్నో అవాంతరాలు. ఫలితంగా చివరివరకూ నన్ను వీడని కన్నీళ్లు!

అందరూ నావాళ్లు అనుకున్నాను. కానీ





# ఏరిన ముత్యాలు

★ తర్కము శాస్త్రమూ కాదు.... కళా కాదు... అందకుండా తప్పించుకునే మార్గము.

– బెంజిమిన్ జోవిట్

★ ఓర్పు, పట్టుదల ఉంటే పర్వతాలనైనా జయించవచ్చు

– లాఫాంటెన్

★ మానవుడు శ్రమించేటప్పుడు పొందే ఆనందాన్ని వ్యక్తం చేసేదే నిజమైన కళ.

– విలియం మోరిస్

★ ప్రకృతే వ్యాధికి వైద్యుడు.

– హిప్పో క్రేటిస్

★ మంచి మనిషి ఆలోచన ఎప్పటికీ వృధా కాదు.

– మహాత్మాగాంధీ

★ శరీరానికి వ్యాయామం ఎంత అవసరమో మనసుకు గ్రంధ పఠనం అంత అవసరం.

– స్టేల్

★ అన్యాయాలు, అక్రమాలతో రాజీ పడడమే ఘోరమైన నేరం.

– నేతాజీ

★ జ్ఞానం లేని వాడే ప్రతిమాటా నమ్ముతాడు

– కింగ్ సాల్‌మన్

★ మానవుడు కల్పించుకునే భయం వల్లనే తన భవిష్యత్తును స్వయంగా నాశనం చేసుకుంటాడు.

– బెర్ట్రాండ్ రస్సెల్

★ విప్లవం లేని జీవితం మృత్యువుతో సమానం.

– ఇక్బాల్

★ ఉపాధ్యాయుడు తానింకా నేర్చుకుంటూ వుంటే తప్ప యధార్థంగా చదువు చెప్పలేడు.

– రవీంద్రనాథ్ ఠాగూర్

★ పురుషులు చట్టాలు చేస్తారు, స్త్రీలు నడవడి నేర్పుతారు.

– డెసిగర్

★ గొప్ప రచయిత పాఠకులకు మిత్రుడు... ఉపకారి.

– మెకాలే

సేకరణ : తరిగొప్పుల వి.ఎల్. ఎన్.మూర్తి

అందరూ నన్ను పరాయిగా అనుకున్నారు. నా ప్రాణంకంటే మిన్నగా భావించిన నా కన్నకొడుకు, శారీరకంగా తన ప్రాణాల్ని వదిలి మానసికమైన నా ప్రాణాల్ని కూడా తన వెంటే తీసుకువెళ్లాడు. ఇంటికి దీపం పెట్టాల్సిన కోడలమ్మ నా కొడుకు వెంటే వెళ్లిపోతూ "నా మొగుడు లేని నీ ఇంట్లో నాకేం పని?" అంటూనే నా మనవడి బాధ్యతను నాకు అందచేసింది. వాడి కోసమే నేను పునర్జన్మ ఎత్తినట్లుగా జీవించ గలిగాను. వాడు నా కోసమే బతికి వున్నా డన్న ఒక్క ధైర్యమే నన్ను బతికించిందేమో! అందుకే వాడిలో నా కన్న కొడుకు కనిపి స్తుంటే నా ప్రాణాల్ని వాడిమీద పెట్టుకు న్నాను!

నా వైవాహిక జీవితంలోని అసంతృప్తి నన్ను ఈ లోకానికి ఒక రాక్షసిలా మొదట్లో చూపెట్టింది. ముఖ్యంగా ఎవరి విష యంలోనైనా వైవాహిక జీవితం తృప్తితో ఆరంభమైతే ఆ తరువాత ఒకవేళ కష్టన ష్టాలు వస్తే ఎదుర్కొని రాజీపడగలరు. అంటే నచ్చిన భర్త అలాంటివాళ్లను రాజీకి బానిసచేస్తాడు. కాని అసంతృప్తితో మొద లైన నా వైవాహిక జీవితంలో ఇష్టంలేని భర్త నా ఆశల్ని తొలిసారిగా కుప్పగా కూల్చేశాడు. ఇక్కడ నా తండ్రి స్వార్థం నన్ను బలిచేసింది. నా భర్త అమాయ కుడు. అతడ్ని అసహ్యించుకోవడం సబబు కాదు. ఇలాగని అతడిని కొన్నాళ్ల తర్వాత యినా మనస్ఫూర్తిగా మనసు దిటవుచేసు కుని ప్రేమించలేకపోయాను. కానీ అతడి సంసారాన్ని మాత్రం గుండె ధైర్యంతో ముందుకు నడిపించగలిగాను. మగవాడిలా రాణించగలిగాను.

ఆ తర్వాత నన్ను క్రమంగా అర్థం చేసు కున్న సమాజం నామీద సానుభూతి కనబ ర్చింది. ముఖ్యంగా ఎవ్వరి సానుభూతి నాకు అవసరం లేదు. నాది అనుకునే నా ఆత్మీయ ప్రపంచం నన్ను ప్రేమిస్తే చాలు అనుకున్నాను. కానీ మొదటి నుండీ నాకు నమ్మకద్రోహమే ఎదురైంది. తల్లులు వేరైనా తండ్రి ఒక్కడే కాబట్టి నా చెల్లెలు జానకీదేవిని నేను ఎంతో ప్రేమించాను. ఆమె కూతుర్ని సైతం నా కూతురిగా భావించాను. ఆమె భర్త సూర్యాన్ని అన్నీ తెలిసిన వ్యక్తిగా గౌరవించాను. ఆ తర్వాత నా చెల్లెలి మనవరాళ్లని నా మనవరాళ్లుగా భావించాను. స్వచ్ఛమైన ప్రేమను అందిం చాను. ఇంత చేసినా వాళ్లంతా నాలో 'అవ సరాన్ని' మాత్రమే చూశారుగాని ఆత్మీయ తను అందివ్వలేదు.

ఈ రంగుల ప్రపంచంలో రకరకాల స్వార్థాలు వున్నాయి. ఇందులో నా చెల్లెలి కుటుంబానిది దురాశతో కూడిన స్వార్థం! నా అనురాగాన్ని ఆసరాగా తీసుకుంటూ నన్ను ఆటబొమ్మను చేసి ఆడించాలనుకున్న నా చెల్లెలి కుటుంబాన్ని నేను ఎప్పుడూ 'పాలి'వాళ్లుగా భావించలేదు. వాళ్లే నన్ను శత్రువుగా భావించారు.

శకుంతల రాక్షసత్వం నన్ను అనేక విధా లుగా మభ్యపెట్టాలని ప్రయత్నించింది. ఆమె తన పిల్లల్ని సైతం నామీదకు ప్రేమ పేరుతో ఉసిగొల్పింది. "వదినా, వదినమ్మా" అంటూ ఎంతో ఆత్మీయతను నటించే మరిది సూర్యం తన కూతుర్ని వెనకేసుకు వస్తుంటే రక్తం పంచుకున్న నా చెల్లెలు సైతం అనుబంధాన్ని మరిచి అసురత్వాన్ని నాపై రుద్దింది. అంతా తెల్సినప్పటికీ అన్నీ ఓర్చుకున్నాను. నా వాళ్లల్లో మార్పు ఎప్పటి కైనా రాకపోతుందా అని ఎదురుచూస్తూ ఆశపడ్డాను.

కావేరి పెళ్లి విషయంలో ఎలాంటి 'ప్రేమ' లేదని తెల్సినా ఆ పరిస్థితికి నేను నియం తను కాదల్చుకోలేదు. కాబట్టి మౌనంగా వుండిపోయి అందరికీ సహజంగా కనిపిం చాను. ఇక కస్తూరి అల్లరిపిల్ల! ఇంట్లో తను విన్న, చూసిన నిజాల్ని చెప్పి నా నుండి ఏదో ఒకటి ఆశించే అమాయకురాలు. కానీ





అది చెప్పే చేదు నిజాల్ని నేను ఎప్పటిక ప్పుడు అబద్ధాలుగా కావాలని కొట్టి పడే శాను. ఎందుకంటే పట్టింపులకి పోతే మిగి లేది మనస్పర్థ మాత్రమే! కాబట్టే ఎన్ని కుట్రలు చేసినా ఎన్ని కుతంత్రాలు జరిగినా, ప్రతిసారీ క్షమాగుణంతో ఓర్చుకుంటూ వచ్చాను. నన్ను నేను కాపాడుకోగలిగాను.

బాబూ! ఇటువంటి పద్మవ్యూహంలో వున్న నాకు నీవు ఆప్తుడివో ఆత్మీయుడివో శ్రేయోభిలాషివో తెలియదుకాని, నేను నీలో నిజమైన మనిషిని చూశాను. కాని నీవు నిస్సహాయుడివి. నేను పెద్దగా చదువుకో లేదు. చదువుకోవాలనే నా ఆశను అప్పట్లో కూడా పరిస్థితులు వెనక్కినెట్టేశాయి. అయి నప్పటికీ జీవితం నేర్పిన అనుభవాలు నాకు కొంత భాషను నేర్పాయి. ఆ భాషతో నా బాధను రాస్తున్నాను. అర్థం చేసుకో నాయనా!

ఈ మనుష్యులు నన్ను ఆస్తికోసం దగా చేయాలనుకోవడం నా మనవడు శశాంక పసిగట్టాడు. కాబట్టే వాడికి నా చెల్లెలి కుటుంబం మీద ఎనలేని ద్వేషం పెరిగిపో యింది. వాడి వయసు ఎదగలేదు కాని వాడి తెలివితేటలు ఎదిగాయి. వయసుకి మించి ఆలోచించే శక్తి పెరిగింది. అందుకే వాడు మహామనిషి అవుతాడని మనస్ఫూ ర్తిగా నమ్మాను. ఇంతేకాదు, వాడిలోని ద్వేషాన్ని చల్లార్చి వాడిలో పరిపూర్ణమైన ప్రేమానురాగాలు నింపాలని ప్రయత్నిం చాను. కాని వాడిలో మార్పు రాలేదు. ఏది ఏమైనప్పటికీ వాడు నా అపూర్వమైన ఆస్తి! ఆ ఆస్తినే నేను ఇప్పుడు కోల్పోయాను. ముఖ్యంగా కావేరి, కస్తూరి, విషయాల్లో పెళ్లికోసం డబ్బు ఇవ్వడం... ఇవ్వాలనుకో వడం... నా మనవడికి ఇష్టంలేదు. కాని నేను వాడి ఇష్టాన్ని వ్యతిరేకించగలిగాను. వ్యతిరేకించాల్సిన అవసరం నాకు లేదు. కాని ఆ పిల్లలూ నా పిల్లలే అనుకున్నాను కాబట్టి నా మనవడి మనసు నొప్పించాను.

కావేరి అమాయకురాలు. కాని చెప్పుడు మాటలు దానిమీద మంచి ప్రభావాన్ని చూపించాయి. అయితే ముఖ్యంగా నా చుట్టూ మూగివున్నవి రాబందువుల్లాంటి ఆత్మీయతలు. కాబట్టి ఆలోచించి అడుగువే యడం అనేది నాకు మొదట్నుండి అలవా టైన ప్రక్రియ! కాని కావేరిని కట్నం అడిగా రని కళ్లనీళ్లు పెట్టుకున్నప్పుడు, కామాక్షమ్మ దబాయించి మాట్లాడినప్పుడు నేను నిజం గానే అమాయకురాలినైపోయాను. అయితే ఆ తర్వాతే శకుంతల మాటల్నిబట్టి అదీ ఒక నటనేనని అర్థమయ్యాక సూర్యుడి కంట్లో మట్టిజల్లబోయిన శకుంతల తెలివి తక్కువతనానికి జాలివేసింది. ఏదైతేనేం? ఎలా అయితేనేం? అది నటనైతేనేం? నిజ మైతేనేం? డబ్బు ఇవ్వాలి కాబట్టి ఇవ్వగలి గాను. లేదంటే దాని సంసారం విచ్ఛిన్నమై పోదూ? అవును! పరిస్థితులు కొన్నిసార్లు అబద్ధంగా మొదలై నిజంగా జీవం పోసు కుంటాయి.

ఏ జన్మలో ఎవరికి ఏం పాపం చేశానో నాకు తెలియదు కాని ఈ జన్మలో మాత్రం నాకు ఏ పాపం తెలియదు. కాని విధి బలీ యమైనది. నన్ను కఠినంగా శపించింది. అయినప్పటికీ గట్టిగుండెతో జీవించాను. బండరాయిలా బతకగలిగాను. నా మీద ఆ దేవుడికే జాలిలేదు. ఇక ఈ మనుషులకు ఏం జాలివుంటుంది? అందుకే తేనెటీగల్లా నన్ను వెంబడిస్తూనే వున్నారు. వీళ్లందరికీ అతీతుడివి నీవు! అందుకే నిన్ను మనఃస్ఫూ ర్తిగా అభినందిస్తూ నీలో ఓ అపూర్వబం ధాన్ని చూసుకుంటున్నాను.

బాబూ! నేను ఇక ఈ జీవితాన్ని భరిం చలేను. నేను ఎక్కడికైనా వెళ్లిపోవాలి. లేదా చనిపోవాలి. నా తరువాత నా ఆస్తి పాస్తులు ఎవరికి చెందాలో వాళ్లకే చెందాలి. ఈ విషయంలో నాకు ఎలాంటి అభ్యంతరంలేదు. ఇంత జరిగినా ఇన్ని చేసినా ఎవ్వరిపై నాకు ఎలాంటి కోపం

లేదు. నా కోపం అంతా నా పుట్టుకమీదే!

ఎందుకు నాకు ప్రేమరాహిత్యం ఏర్పడు తోంది? ఎందుకు నాకు ఇలాంటి ఆత్మీయ తలు వున్నాయి? కనీసం నా రక్తసంబంధాలు నా దగ్గర వుండీ కూడా నేను ఒంటరిదాన్ని అయ్యాను? మనిషికి డబ్బు దర్పాలకంటే ముందుగా కావాల్సింది ప్రేమ! ఈ ప్రేమ నాకు దక్కనప్పుడు నేనెం దుకు పుట్టాను? ఇది నా అనంతమైన బాధ! ఈ బాధతోనే నేను నిన్ను ఒక సహాయం కోరుకుంటున్నాను. ఏమిటంటే "నిజాయితిగా బతికిన నా జన్మగాని నా పిల్లల జన్మగాని ఎలాంటి సార్థకత లేకుండా అన్యాయమై పోయాయి. ఇలాగని మా జీవి తాలు కాలగర్భంలో కలిసిపోవడం నాకు ఇష్టంలేదు. అందుకే నా ఆస్తి మొత్తం అంటే ఇల్లు, పొలాలు, డబ్బు, అంతా కలిపి యాభై లక్షల వరకు వుంది. ఇది మొత్తంగా నా మనవడికే దక్కుతుందేమో నన్న స్వార్థం, ద్వేషం, కుతంత్రం నా అను కున్న వ్యక్తులను విచక్షణారహితులుగా మార్చింది. నా దృష్టిలో మనిషి అంటే కొంతవరకైనా మానవత్వాన్ని కలిగి వుండాలి! ఈ కొంత మానవత్వం అనేది తన వాళ్ల విషయంలో ప్రదర్శించుకోవడం కాదు. ఎదుటవాళ్ల విషయంలో కూడా ప్రద ర్శించుకోగలగాలి!

కాలంతోపాటుగా మనుషులు మారారో, మనుషులతోపాటుగా కాలం మారిందో తెలి యదుకాని ఇప్పుడు ఈ మానవ ప్రపంచం ఒక మహావ్యూహంగా మారిపోయింది. తమ తెలివితేటలతో ఎవరు ఎవర్ని నాశనం చేస్తారో, ఎవరు ఎవర్ని ఎలా తమకు అనుగుణంగా మార్చుకోవాలని చూస్తారో, అర్థం కానట్టుగా గందరగోళంగా వుంది! ఈ గందరగోళంలో నేను పావును అయ్యానో లేక ఎదురు ఈదుతున్న మొండి జీవిని అవుతున్నానో తెలియడంలేదు.

ఇటువంటి నా వ్యర్థ జీవితానికి నీలాంటి వ్యక్తి స్నేహితుడిగానో, ఆప్తుడిగానో బహి రంగ అండదండలు అందించి వుండుంటే ఎంత బాగుండు అని అన్పిస్తుంది. కాని బాబూ! నా శ్రేయోభిలాషివి అయి వుండీ కూడా నాతో అనురాగాన్ని పంచుకోలేకపో యావు ఎందుకు?

నా చెల్లెలు జానకీదేవిలో నేను నా చిన్న ప్పటినుండి చలాకీతనాన్ని చూస్తున్నాను. కాని ఆ చలాకీతనంలో విద్రోహపు బుద్ధిని మాత్రం నేను తట్టుకోలేకపోయాను. ప్రతీదీ తనకే కావాలనుకుంటూ ఏదైనా ఏ విష యంలో అయినా తన తర్వాతే నేను వుండాలనుకుంటూ స్వార్థంగా ప్రవర్తించే నా చెల్లెలిలో మార్పుకోసం నేను ఈ నా చివరి రోజులవరకూ ఎదురు చూసినా నాకు ఫలితం దక్కలేదు.

జీవితం అనే ఎడారిలో చలివేంద్రాల్ని వెదుక్కున్న నా అవివేకానికి, అజ్ఞానానికి శకుంతల మంచి సమాధానమే చెప్పింది. ఇలాగని తనని ద్వేషిస్తే నాకు పాపమే అవుతుంది. ఇలాగని సహిస్తే విషం పెరి గిపోతుంది. అయితే ఇప్పుడు నేనేం చేయాలి? అదీ నా బిడ్డే అని ఊరుకో వాలా? ఏది ఏమైనా నామీది కుట్ర, కసి, పగ అన్నీ ఏకమై నా ఆత్మీయుల అంతరం గాల్ని దహించివేశాయి. చివరికి ఆ భగవం తుడే నన్ను దహించివేశాడు. ఈ పరిస్థి తిలో నేను కోరుకుంటున్నది ఒక్కటే! అది ఏంటంటే నా తరువాత నా మనవడి పేరిట అనాథశరణాలయం నిర్మించబ డాలి. వాడి కోవెలలో ఎందరో అనాథలు సేదతీరాలి"

రాస్తున్న పరిమళాదేవి, ఎవరో వస్తున్న అలికిడి కావడంతో అప్రయత్నంగా తల ఎత్తి చూసింది. బయట గుమ్మం దగ్గర చెప్పుల్ని వదులుతున్న వరప్రసాద్ కిటికీ లోంచి కనిపించాడు.

"వచ్చావా అల్లుడూ! నీకే ఉత్తరం రాస్తు న్నాను" అతడ్ని చూస్తూ పైకే అనుకుంది




పరిమళాదేవి.

"అత్తమ్మా" పిలుస్తూ లోపలికి వచ్చాడు వరప్రసాద్.

"రా బాబూ..." ఆమె గొంతులో లోతైన ఆర్తి.

"ఆరోగ్యం ఎలా వుంది అత్తమ్మా?" రాగానే ఆమె నొసలు పట్టి చూశాడు వరప్రసాద్.

"బాగుంది" చెప్పింది పరిమళాదేవి.

"ఏమైనా తిన్నావా?" బాధ్యతగా అడిగాడు వరప్రసాద్.

"ఇందాక శకుంతల వచ్చి ఆ చపాతీ ఇచ్చి వెళ్లింది" సమీపంగా వున్న స్టూలుమీద పెట్టివున్న హాట్‌బాక్స్ వైపు చూపిస్తూ చెప్పింది పరిమళాదేవి.

"మరి తిన్నారా?" అంటూనే హాట్‌బాక్స్ తెరిచాడు వరప్రసాద్.

"ఆకలిగాలేదు. కాసేపయ్యాక తింటాను" చెప్పింది పరిమళాదేవి.

"తింటాను అని చెప్పడం కాదు, తినాలి" అంటూ హాట్‌బాక్స్‌ని తిరిగి మూసి పెట్టి ఆమె చేతిలోని పెన్నూ, పేపర్లను చూస్తూ "ఏదో రాస్తున్నారు అత్తమ్మా?" అడిగాడు వరప్రసాద్.

వెంటనే పరిమళాదేవి ఏం మాట్లాడలేదు. తను రాసిన కాగితాలను ఒకమారు బరువైన చిరునవ్వుతో చూసుకుని ఆ తరువాత వరప్రసాద్‌వైపు చూసింది. అతడు ఆమె వైపే చూస్తున్నాడు.

"నీ కోసమే రాస్తున్నాను. మధ్యలోనే వచ్చావు" చెప్తూ సగం రాసి వుంచిన కాగితాలను వరప్రసాద్‌కి అందించింది పరిమళాదేవి.

అతడు ఆదుర్దాగా, ఆసక్తిగా ఆ కాగితాలను అందుకుని చదవసాగాడు. ఆ సమయంలో ఆమె కళ్లు మూసుకుని నిశ్శబ్దంగా కూర్చుండిపోయింది.

కొన్ని నిముషాల తర్వాత...

"అత్తమ్మా..." ఉత్తరం మడిచి పెడుతూ బరువుగా పిలిచాడు వరప్రసాద్.

ఆమె నెమ్మదిగా కళ్లు తెరిచి చూస్తూ "చదవడం అయ్యిందా?" అంతే నెమ్మదిగా అడిగింది.

"ఆ" పూర్తయ్యింది అన్నట్లుగా అని "మీ నిర్ణయం చాలా బాగుంది" ప్రశంసిస్తున్నట్టుగా అన్నాడు.

"ఆ నిర్ణయాన్ని వీలునామాగా రాయాలనుకుంటున్నాను" చెప్పింది పరిమళాదేవి.

"తప్పకుండా రాయండి" గుండెలనిండుగా అన్నాడు వరప్రసాద్.

"రాసే ముందు నీతో కొంచెం మాట్లాడాలి" అంది పరిమళాదేవి.

"మాట్లాడండి అత్తమ్మా" అంటూనే ఆమెకు ఎడంగా కొద్ది దూరంగా వున్న కుర్చీని ఆమెకు సమీపంగా జరుపుకుని కూర్చున్నాడు వరప్రసాద్.

ఆమె కొన్ని క్షణాలు మౌనం వహించి ఆ తరువాత వరప్రసాద్‌వైపు చూస్తూ "బాబూ! మనసులోని బాధను ఒకరితో చెప్పుకుంటే మనసు తేలిక అవుతుంది అంటారు. కాని నా బాధను ఎందరితో చెప్పుకున్నా, ఎవ్వరు ఎంత ఓదార్పు అందించినా అది పూడ్చుకోలేని లోటు! అయినా ఈ పరిస్థితిలో నాకు ఓదార్పుగాని, అండదండలుగాని అవసరం లేదు. మరణం ఒక్కటే నాకు ఇక మిగిలింది" గద్గదమైన గొంతుతో అంది పరిమళాదేవి.

"అ...త్త...మ్మా" అతడి హృదయం ఆమెలో కనిపిస్తున్న దైన్యానికి విలవిలలాడింది.

"అవును అల్లుడూ! నాకు మిగిలింది చావు ఒక్కటే! అయితే మరణించే ముందు నా ఇన్నాళ్ల బాధనంతా నీతో చెప్పుకోవాలనిపించింది. నీవు నా కన్న కొడుకులాంటివాడివేనని నేను అనుకుంటాను. కాబట్టే నీతో నా ఆవేదనను చెప్పుకోవాలనుకున్నాను. నీవు నీ భార్యకు, అత్తామామలకూ భయపడ్డావో లేక దారిలేక రాజీపడ్డావో

నాకు తెలియదుకాని నీవు నా పాలిటి దేవుడివి! ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగా నా పక్షం వహిస్తూ ఒకటి రెండుమార్లు నన్ను ప్రాణాపాయం నుండి కాపాడావు! నిజంగా నీవు చేసిన సహాయానికి చిన్నదాన్ని అయివుండుంటే చేతులు ఎత్తి నమస్కరించేదాన్ని. కాని పెద్దదాన్ని కాబట్టి చల్లగా బతకమని ఆశీర్వదిస్తున్నాను" అంది పరిమళాదేవి. ఆ సమయంలో ఆమె గొంతు అస్పష్టంగా వణకడం ఒక్కటే కాదు, ఆమె కళ్లల్లో నీటితెర సన్నగా కమ్మేసింది కూడా!

"బాధపడొద్దు అత్తమ్మా! ఇక మీదట నేను ఎవ్వరికీ భయపడకుండా మీకోసం మీ కన్నకొడుకుగా మీ ఆశయాన్ని సాధిస్తాను" అన్నాడు వరప్రసాద్.

"అదే నాకు చాలు" బాధలోనే తృప్తి కలిసిన చిరునవ్వు ఆమె ముఖంలో తొణికిసలాడింది.

వరప్రసాద్ మరేదో మాట్లాడబోయాడు. అంతలోనే పరిమళాదేవి "బాబూ" ఏదో చెప్పాలన్నట్టుగా అంది.

"అత్తమ్మా చెప్పండి" అన్నాడు అతడు.

"ఎక్కువగా మాట్లాడే శక్తిలేదు కాబట్టి, నేను చెప్పాలనుకున్న అన్ని విషయాల్ని నీతో మాట్లాడలేను. అందుకే ఉత్తరం రాశాను. అదైనా పూర్తిగా రాయలేదు. రాయాలనుకున్నదంతా చెప్తాను విను" అని కాసేపు ఆగి "నా ఆస్తిపాస్తుల కోసం నా సొంత ఆత్మీయులే నన్ను అనేక విధాలుగా దగా చేయాలనుకున్నారు. ఈ మనుషులకు వంతపాడుతూ ఆ భగవంతుడు కూడా నాకు అన్యాయమే చేశాడు. ఇలాగని నా వాళ్లు ఎవ్వరిమీదా నాకు కోపం లేదు. వాళ్లది ప్రయత్నం మాత్రమే! శపించింది భగవంతుడు ఒక్కడే! ఈ పరిస్థితిలో నేను నా ఆస్తిలో సగం నా బంగారుకొండ శశాంక పేరిట నిర్మించబడే అనాథశరణాలయానికి ఇస్తాను. మిగతా ఆస్తిలో కొంత భాగం కావేరి, కస్తూరిల కోసం ఇస్తాను.

చిన్నతనం నుంచి నన్ను నమ్మి అభిమానించిన బుచ్చమ్మకి కూడా కొంత ఇవ్వాలనుకుంటున్నాను. ఇదొక్క పని నెరవేర్చుకోవడం కోసమే ఆ దేవుడు నన్ను ఈ లోకంలో ఇంకా ఉంచాడు. అందుకే ఈ విషయాన్ని వీలునామాగా రాసి నేను ఇక వెళ్లిపోవాలనుకుంటున్నాను" భారంగా చెప్పుకుపోయింది పరిమళాదేవి.

ఆమె నిర్ణయం విని ఒక్కసారిగా అవాక్కయిపోయాడు వరప్రసాద్. ఎందుకంటే ఇందాక ఆమె ఉత్తరం చదివి ఆస్తంతా అనాథశరణాలయానికి అనుకున్నాడేకాని మళ్లీ వాటికోసం తన కూతుళ్ల పేరు వినిపిస్తుంది అనుకోలేదు. అందుకే కొంతసేపటి వరకు చలించిన హృదయంతో చలనం లేని వాడిగా నిలబడిపోయాడు.

"ప్రసాద్..." పిలిచింది పరిమళాదేవి.

"ఆ..." తేరుకున్నాడు వరప్రసాద్.

"నా నిర్ణయాన్ని ఈ రోజే వీలునామాగా రాస్తాను" అంది పరిమళాదేవి.

"రాయండి అత్తమ్మా! కాకపోతే రాసే ముందు నా మాట ఒకసారి విన్పించుకోండి" అన్నాడు వరప్రసాద్.

ఆమె ఏంటన్నట్లుగా చూసింది.

"మీరు మీ చావు గురించి దయచేసి మాట్లాడొద్దు. ప్రస్తుతం మీరు చావు అంచుల్లోకి వెళ్లి వెనక్కి తిరిగి వచ్చారు. కాబట్టి మళ్లీ చావు గురించి మాట్లాడుతూ నన్ను బాధపెట్టవద్దు" అన్నాడు వరప్రసాద్.

అందుకు పేలవంగా ఆమె పెదవుల మీద ఓ చిరునవ్వు పరుచుకుంది.

"అవును అత్తమ్మా! మీరు బతకాలి" ఆమె జీవితం వ్యర్థమైనదని తెలిసినా, ఆమె బతికి తీరాలనే ఆశకొద్దీ శ్రేయోభిలాషిగా అన్నాడు వరప్రసాద్.

"ఎవరి కోసం? " సూటిగా అడిగింది పరిమళాదేవి.

"ఎవరి కోసమో అని నేను చెప్పలేను




అత్తమ్మా! నీకోసం నీవు బతకాలి. నీవు మరణిస్తే ఆనందించే ఆత్మీయులు వున్నారు. కానీ బాధపడే నేను కూడా వున్నాను. ఈ రెండు విషయాల్ని వదిలి వేస్తే శశాంక పేరిట నిర్మించబడే అనాథశరణాలయం ఆరంభానికి నీ అమృతహస్తాల స్పర్శ కావాలి. అందుకే నీవు బతకాలి" ఆమె మనసు మార్పించే ప్రయత్నం చేశాడు వరప్రసాద్.

"ఆ!" ఆమె అవును అన్నట్టుగానో, కాదన్నట్టుగానో చిన్నగా తలను మాత్రం పంకించింది.

"అత్తమ్మా! ఇంకో విషయం!" అని కాసేపు ఆగి "మీ ఆస్తిలో చిల్లిగవ్వ కూడా నా కూతుళ్లకు వద్దు. దయచేసి నన్ను అర్థం చేసుకోండి" అంటూ ఆమె చేతుల్ని ప్రాధేయపూర్వకంగా పట్టుకున్నాడు వరప్రసాద్.

ఆమె అతడివైపు నమ్మలేనట్టుగా చూసింది.

"అవును అత్తమ్మా! నా కూతుళ్లకు తండ్రిగా కాదు, మీకు ఆప్తుడిగా చెప్తున్నాను. మీ నిర్ణయాన్ని దయచేసి మార్చుకోండి" అన్నాడు వరప్రసాద్.

ఆమె అట్లాగే చూస్తోంది.

"ముఖ్యంగా మీ స్థానంలో మరొకరు వుంటే తమ ఆస్తిని మొత్తంగా అనాథలకే చెందాలని వీలునామా రాస్తారు. ఎందుకంటే ఇటువంటి రాక్షసుల్ని ఎవ్వరూ క్షమించలేరు. కానీ మీకు అన్యాయం జరిగిన తరువాత కూడా మీరు శాంతమూర్తిగా, క్షమాధాత్రిగా వున్నారు. మీరు నిజంగా మానవరూపంలో ఉన్న దేవత" మనస్ఫూర్తిగా ఆమెను కొనియాడాడు వరప్రసాద్.

"నా కూతుళ్లకు తండ్రిగా మాట్లాడితే కావేరి ఇప్పుడు ఒక ఇంటిది అయ్యింది. కస్తూరికోసం కొద్దోగొప్పో ఆస్తి వుంది. అది చాలు"

"..."

"ముఖ్యంగా మీకు అన్యాయం జరగడంలో మీరు అనుకున్నట్టుగా ఆ పైవాడే కారణం అయివుంటే నేను మనస్ఫూర్తిగా మీ ఆస్తిలో నా కూతుళ్లకోసం కొద్దోగొప్పో ఆశించేవాడినేమో? కానీ కారణం పైవాడు కాదు. అందుకే మీకు జరిగిన అన్యాయాన్ని మీరు సవాల్ చేయాలీ అంటే మీ ఆస్తిలో పైసా కూడా నా కూతుళ్లకు చెందకూడదు" ఆమె కళ్లల్లోకి సూటిగా చూస్తూ ఉద్వేగంగా మాట్లాడాడు వరప్రసాద్.

ఆమెకు నిజంగా ఏమీ అర్థంకాలేదు. అందుకే ఆమె భృకుటి నెమ్మదిగా ముడిపడింది.

"అవును అత్తమ్మా! నా భార్య గురించి, అత్తామామల గురించి నీకు తెల్సింది చాలా తక్కువ! వాళ్లు నీ దృష్టిలో కేవలం ప్రయత్నించి విఫలమౌతున్న వాళ్లు! కానీ మీకు తెలియని ఓ భయంకరమైన నిజం చాలా కాలం తర్వాత నాకు తెల్సింది" ఆమె పక్కనే అలాగే కూర్చుని చెప్పాడు వరప్రసాద్.

"ప్ర...సా...ద్?" అప్పటికికూడా ఆమెకు విషయం సూటిగా అర్థం కాలేదు.

"ఆస్తి పంపకం విషయంలో మీరు పొరపాటుగా నిర్ణయం తీసుకోవడం... అటు నీ కొడుకూ కోడలి ఆత్మకుగాని మనవడి ఆత్మకు గాని శాంతిని అందివ్వవు! కాబట్టి నిజం తెల్సుకున్నాక అయినా మీ నిర్ణయాన్ని మార్చుకోండి" అని కాసేపు ఆగి "అత్తమ్మా... రఘుబాబు దంపతులు యాక్సిడెంట్ రూపంలో చనిపోవడం విధిరాత కాదు. అది శకుంతల కుట్ర" గుండెను దిటవుచేసుకుని తన భార్య అసలు స్వరూపం గురించి నెమ్మదిగా చెప్పాడు వరప్రసాద్.

"ఆ..." ఆమె ఒక్కసారిగా ఉలిక్కిపడింది. ఆ తర్వాత గజగజా వణికిపోయింది. ఇంకాతర్వాత ముచ్చెమటలకు తడిసిపోతూ గిలగిలా తన్నుకుంటున్న

గుండెపట్టుకుని వరప్రసాద్ చేతిని అప్రయ త్నంగా, గట్టిగా పట్టుకుంది.

ఎంత నెమ్మదిగా నిజాన్ని బయటపె ట్టాడో అంతకంటే నెమ్మదిగా ఆమె ముఖం లోకి చూశాడు వరప్రసాద్.

ఆమె ముఖం ఇప్పుడు యుద్ధం తర్వాత రణభూమిలో మిగిలివున్న శ్మశాన నిశ్శ బ్దంలా వుంది. ప్రకృతి బీభత్సం తర్వాత ఆనవాళ్లుగా మిగిలివున్న మహాగాయంలా వుంది.

ఎవరైనా తనని చెంపదెబ్బకొట్టిన వాడ్ని చెప్పు దెబ్బ కొట్టాలనుకుంటారు. కానీ ఇందుకు భిన్నంగా చెప్పు దెబ్బ తినీ కూడా చిదానందస్వరూపంగా చిరునవ్వునే పూయించిన ఆమె పవిత్రస్వరూపాన్ని అతడు ఇంకా అట్లాగే చూస్తుండిపోయాడు.

ఆమె శిలా ప్రతిమగా, మంత్రించిన బొమ్మగా స్తంభించిపోయి వుంది.

నిజాన్ని బయటకి కక్కేసిన తర్వాత అత డికి ఇంకేం మాట్లాడాలో అర్థం కావడం లేదు. కానీ మాట్లాడి, ఆమెను మాట్లాడిం చాలనుకుంటున్నాడు. అందుకే కాసేపు ఏం మాట్లాడాలా అన్నట్టుగా తననితాను సిద్ధం చేసుకుని ఆ తరువాత "అత్తమ్మా..." మెల్లగా పిలిచాడు.

"..."

అతడు ఆమె మౌనాన్ని జాలిగా చూస్తూ "అత్తమ్మా! గాయం పాతదైతే మామూలు అవుతుంది అంటారు. కానీ పాతదైన నీ గాయం తాలూకు బాధ ఇప్పుడు మళ్లీ తిర గబెట్టింది కదూ? యముళ్లు ఎవరో తెలియ గానే చచ్చిన మనసు మళ్లీ చస్తున్నట్లుగా వుంది కదూ? వుంటుంది! ఎందుకు వుండదు?" మనసులో అనుకోబోయి పైకే అనేశాడు వరప్రసాద్.

ఆ మాటలు ఆమెలో ఏవిధమైన సంచ లనం కలిగించాయో తెలియదుకాని అప్ప టికే భయపడిన ఆమె కళ్లు మరోసారి భయపడినట్టుగా అన్పించింది.

"మరి! ఇప్పుడేమంటావమ్మా? శకుంతలా నా బిడ్డేనని వూరుకుంటావా? లేక నీ బాధను కేవలం కాగితాలకు పరిమితం చేసి నిస్సహాయురాలిగా మిగిలిపోతావా? చూడమ్మా! నువ్వసలే గాయపడ్డావు! ఆ గాయాల్ని చూస్తూ బాధపడుతూ కూర్చుంటే సాధించేది అంటూ ఏదీ వుండదు! ఇందాకా ఉత్తరంలో నా భార్య శకుంతల విషయంలో ఊరుకోవాల్సిం దేనా? అని నిస్సహాయంగా మిమ్మల్ని మీరు ప్రశ్నించుకున్నారు. ఇంతక్రితం వరకు మీకు ఈ ప్రశ్న విషయంలో సమాధానం దొరకదని నాకు తెల్సు! మంచితనం కొన్ని సార్లు చేతకానితనం కూడా అవుతుంది. అందుకే చెప్తున్నాను. మీ అనుబంధాల విషయంలో అంటే నా భార్య, అత్తామా మల విషయంలో మీరు చేతకానివాళ్లుగా మిగిలిపోవడం అనేది ఇక ఇప్పుడు మాత్రం కాకూడదు. సరేనా అత్తమ్మా!" ద్రోహాన్ని ద్రోహంతోనే జయించే నిజమైన సైనికుడిలా మాట్లాడాడు వరప్రసాద్.

అప్పటికీ ఆమెలో చలనంలేదు. అలాగే, అదే నిశ్శబ్దంతో సుదీర్ఘ విరామంలా, నిశ్చల నిరాడంబరంలా, పాట మరిచిన వేసవి కాలపు కోయిల్లా, ఓ పాడుబడిన రాజ్యంలో చైతన్యం తర్వాత సాంద్రంగా మిగిలివున్న శిథిల స్తబ్దతలా వుంది.

"అత్తమ్మా" ఆమెను అలాగే చూస్తూ మళ్లీ పిలిచాడు వరప్రసాద్.

సమాధానంగా ఆమె కళ్లలోంచి కన్నీళ్లు మౌనంగా రాలిపడ్డాయి.

"భార్య అనే ఒక్క అనుబంధంతో ఇన్నాళ్లూ ఈ నిజాన్ని నాలో దాచుకు న్నాను. కాని ఇప్పుడు అవసరమైతే ఆ నిజాన్ని చట్టానికి కూడా తెలియజేయడానికి నేను వెనుకాడను.

సహనం అనేది కొంతవరకు మాత్రమే వుంటుంది. వాళ్లు ఇన్నాళ్లూ నా ఈ సహ నాన్ని పరీక్షించారు. ఇప్పుడు నేను సహనం




చచ్చిన వాడిని. అందుకే అనుబంధాలు పక్కకు పెట్టి కేవలం ఒక నీతినిజాయితి లున్న వ్యక్తిగా మాత్రమే ప్రవర్తించాలనుకుంటున్నాను" తెగింపుగా చెప్పాడు వరప్రసాద్.

ఆమె మౌనంగా రోదిస్తూనే వుంది.

"శశాంకను సైతం చంపించాలని కంకణం కట్టుకున్న మహా పిశాచం శకుంతల! కాబట్టి దీన్ని ఎట్టి పరిస్థితిలోనూ క్షమించే ప్రసక్తిలేదు. ఇప్పుడు శశాంక విధివశాత్తు మరణించి వుండొచ్చు. కాని వాడి మరణాన్నికై ఎదురు చూసిన రక్తపింజరి నా భార్య! దానికి తగిన శాస్తి జరగాల్సిందే" ఈమారు వరప్రసాద్ గొంతులో తీవ్రమైన కసి.

"బా...బూ..." అప్పటికి నెమ్మదిగా పిలిచింది పరిమళాదేవి.

"చెప్పండి అత్తమ్మా..." అన్నాడు వరప్రసాద్.

"ఈ నిజాన్ని నాకెందుకు చెప్పావయ్యా?" దైన్యంగా నిలదీసింది పరిమళాదేవి.

"చెప్పకూడదనే అనుకున్నాను. ఎందుకంటే ఈ ముసలి వయసులో ఇటువంటి నిజాలు తెలియడంవల్ల మీరు అసహాయులుగా మిగిలిపోవడమే తప్ప సాధించేది ఏమీ వుండదు. పైగా అశాంతి, నరకం, అంతకుమించిన దుఃఖం! అయినప్పటికీ నిజాన్ని ఎందుకు చెప్పానో తెల్సా? నేను ఈ నిజాన్ని చెప్పకపోతే మీరు మీ ఆస్తి విషయంలో మీ నిర్ణయాన్ని మార్చుకోలేరు" అన్నాడు వరప్రసాద్.

"ఇందుకోసమని నా గుండెల్ని బద్దలు చేశావుకదయ్యా?" ఆమె గొంతు వణికింది.

వరప్రసాద్ ఏం మాట్లాడలేదు. నిజాన్ని చెప్పిన తర్వాత ఒక విధమైన టెన్షన్‌కి అతడు గురౌతున్నాడు.

"ఈ నిజాన్ని నాకు చెప్పకపోయినా అంతా విధిరాత అనుకుంటూ కనీసంగా తృప్తిగా చనిపోయేదాన్నేమో! కాని ఇప్పుడు? నేను తట్టుకోలేనయ్యా!" ఆమెకు ఏడ్వడం కూడా చేతకాక గుండెల్ని బలంగా గుద్దుకుంటూ అట్లాగే వెనక్కి వాలింది.

"అత్తమ్మా" ఆదుర్దాగా ఆమెను పట్టుకున్నాడు. ఆమె ఆయాసపడుతూ అలాగే పడుకుండిపోయింది.

"తప్పు చేశానా?" తనలో తనే ప్రశ్నించుకున్నాడు వరప్రసాద్.

కానీ అతడికి, తప్పు చేయలేదనే అన్పిస్తోంది. ఆమెకు ఇప్పుడు ఏం జరిగినా ఫర్వాలేదు. ఆస్తిమాత్రం తన కూతుళ్ళకు దక్కకూడదు అనే గట్టి పంతంతో మనసు పరిపరివిధాలా తొందరపడుతోంది.

"బాబూ ప్రసాద్! నాకోసం నీ వాళ్లను కాదనుకోవడం గొప్పగా వుందయ్యా! కానీ నీ వాళ్లను కాదనుకోవడంకోసం నన్ను చివరిక్షణాల్లో మరింత గాయపర్చావుకదా?" ఆయాసంగానే అంది పరిమళాదేవి.

అతడు ఈమారు తనని తాను ధైర్యపరుచుకుంటూ, "అత్తమ్మా! నీ వాళ్ళందరూ లేరన్నదే నీకు భయంకరమైన గాయం. ఆ భయంకరాన్ని కొన్ని ఏళ్ళ తరబడిగా మీరు భరిస్తున్నారు. ఇప్పుడు ఈ నిజం తెలియడం మీరు అనుకున్నట్టుగా పెద్ద గాయం ఏం కాదు" అన్నాడు వరప్రసాద్.

అతడి మాటల్లో ఆమెకు నిజం తోచింది. తెలియని నిజం ఒక్కసారిగా తెలిసేసరికి తన హృదయం విలవిలలాడిపోతూ తనకు ఆ విధంగా అన్పించిందేమోకానీ, నిజానికి ఆ నిజం తెలియడం అనేది ప్రస్తుతం తను వున్న పరిస్థితిలో అది మరొక గాయం కాదు. కేవలం వున్న గాయమే రెట్టింపుకావడం, అంతే. ముఖ్యంగా తను ఇప్పుడు పూరు వదిలిన పక్షి. అరణ్యంలో తన పయనం ఎటువైపు అయితేనేం?

"అత్తమ్మా..." ఆమెను తట్టాడు వరప్రసాద్.

"ఆ..." ఆలోచనల్లోంచి తేరుకుంటూ అతడివైపు చూసింది ఆమె.

"నేను నిజాన్ని చెప్పి తప్పు చేసినట్లయితే నన్ను క్షమించండి. క్షమించిన తరువాత ఆస్తి విషయంలో దయచేసి మీ నిర్ణయాన్ని మార్చుకోండి" చెప్పాడు వరప్రసాద్.

ఆమె కొన్నిక్షణాలు అతడివైపు మౌనంగా చూసి, ఆ తర్వాత నెమ్మదిగా "తప్పుచేసింది తల్లి అయినప్పుడు, ఆ పిల్లలు ఎంతవరకు బాధ్యులు? " అని ప్రశ్నించింది.

"అంటే? " ఆమె ఉద్దేశ్యం అతడికర్థ మైంది.

"పిల్లలు ఏ పాపం ఎరుగనివాళ్ళు కాబట్టి నేను ఇవ్వాలనుకున్నది ఏదో వాళ్లకిచ్చే స్తాను" చెప్పింది పరిమళాదేవి.

"మీరు వాళ్ళకు ఆస్తి ఇవ్వడం వల్ల అందుకు సంతోషించేది ఆ పిల్లలు కాదు, ఆ తల్లి. ఆ విషయాన్ని మీరు మర్చిపోతు న్నారు" గుర్తుచేశాడు వరప్రసాద్.

"కావచ్చు అనుభవించేది ఆ పిల్లలే కదా? " అంది పరిమళాదేవి.

"అని మీరనుకుంటున్నారుకానీ ఆ పిల్లల కంటే ముందుగా ఆ ఆస్తిని తన షోకుల కోసం కచ్చితంగా ఆవిడగారు వినియోగించు కుంటారు"

"నీవు ఏమైనా చెప్పు ప్రసాద్. పిల్లలు దేవుళ్ళతో సమానం" అతడితో ఇక వాదన అనవసరం అన్నట్టుగా తేల్చిచెప్పింది పరిమ ళాదేవి.

ఆమె మంచితనం ఇప్పుడు మూర్ఖత్వంగా గోచరిస్తుంటే, వరప్రసాద్‌కి ఆమెమీద ఎక్కడో ఓ మూలన వద్దనుకున్నా కూడా కోపం వచ్చేసింది. అలాగని ప్రదర్శించుకునే ధైర్యం అతడికి లేకపోయింది. అందుకే సంయమనం పాటిస్తూ, "కట్టుకున్న భార్యగా సైతం ఆమెను నేను క్షమించలేక పోతున్నాను. ఇలాంటపుడు మీ కడుపుశో కాన్ని ఆనందంగా తిలకించిన ఆ నరరూప రాక్షసి కూతుళ్లకోసం మీరెందుకు ఆలోచిస్తు న్నారు? ఇది మీ మంచితనంకాదు, మంచి తనాన్ని వెక్కిరిస్తున్న మూర్ఖత్వం" సున్ని తంగానే అయినప్పటికీ సూటిగా అన్నాడు వరప్రసాద్.

అందుకు ఆమె ఏమనుకుందో తెలీదు కానీ, వరప్రసాద్‌వైపు గుడ్లప్పగించి చూస్తుం డిపోయింది. ఇక వరప్రసాద్‌కి ఆమె తన మనసులో ఏమనుకుంటుందనేది అనవ సరం అన్పించింది. అందుకే తను చెప్పాల నుకున్న విషయాన్ని గట్టిగా చెప్పేశాడు.

"చూడండి అత్తమ్మా! మీరు ఇప్పటికీ మారకపోతే నేను చెప్పేది ఒక్కటే. నేను మంచితనాన్ని ప్రేమిస్తాను. గౌరవిస్తాను. ఇన్నాళ్ళూ పిరికివాడుగా వుండిపోయానేమో కానీ ఇప్పుడు తెగించినవాడినే అవుతు న్నాను. నా మాట విని మీరు మంచిత నాన్ని బతికిస్తే సరి, లేదంటే మీ కూతురు, అదే నా భార్య శకుంతల, తన తల్లిదండ్రు లతో కలిసి మీ కొడుకూ, కోడల్ని హత్య చేయించిందనే విషయాన్ని బయటికి చెప్పే స్తాను. అప్పుడు వాళ్ళు జైలుకి వెళ్ళడం, మీరు ప్రేమించే మీ మనవరాళ్ళు తల్లి ఎడ బాటుతో విలవిలలాడిపోవడం అదంతా మీరు అనుభవించే మరో నరకం అవు తుంది. ఆలోచించండి"

"భయపెడుతున్నావా ప్రసాద్"

"కావచ్చు"

అతడి సమాధానం ఆమెను నివ్వెరపో యేలా చేసింది. అందుకే అతడ్ని గుడ్లప్ప గించి చూడసాగింది. ఆమె మనసులో అత డిపట్ల ఏ వ్యతిరేకతా లేదు. తనని ప్రేమించే, తనకి అండగా నిలిచే, ఒక ఆత్మీ యుడు తనకోసం వున్నాడన్న భావన ఆమె అణువణువునూ స్పందింపచేస్తోంది.

"ఇంకో విషయం అత్తమ్మా! ఇప్పటికీ మీరు చలించకపోతే నేను తీసుకునే నిర్ణయం ఒక్కటే! అదే నా చివరి నిర్ణయం! అందులో మార్పు అంటూ వుండదు. ఏంటంటే... మీకన్న ప్రేమను తెంచేసిన ఆ శకుంతల కన్నప్రేగుని నేను తెంచేస్తాను. ఆ తర్వాత నేనూ మరణిస్తాను. అవును

అత్తమ్మా! నాశనాన్ని నాశనంతోనే జయించి మీకు న్యాయం జరిపిస్తాను" కావాలని ఆమెను వణికింపజేసాడు వరప్రసాద్.

"బా... బూ..." ఆమె ఒక్కసారిగా కదిలిపోయింది. తను అనుకున్న స్పందన ఆమెలో కనిపించేసరికి వరప్రసాద్‌కి కొండంత ధైర్యం వచ్చేసింది. అందుకే నెమ్మదిగా అన్నాడు.

"ఇంక నేను ఏమీ మాట్లాడదల్చుకోలేదు. అంతా మీ ఇష్టం"

అతడి మాటలు ఆమెను బందీని చేశాయి. అందుకే ఆతడు చెప్పిన ప్రకారం చేద్దాం అనుకుని ఆ తర్వాత నెమ్మదిగా- "ప్రసాద్! తెలిసి నేను పాపం చేస్తున్నానేమో అన్పిస్తోంది" గుండె లోతుల్నుంచి అంది పరిమళాదేవి.

"ఇది పాపంకాదు, తగిన శిక్ష" అన్నాడు వరప్రసాద్.

"భగవంతుడా" తనలోతనే నిట్టూర్చింది పరిమళాదేవి.

"అత్తమ్మా! వాస్తవానికి నేను ఏమనుకున్నానంటే ఆ శకుంతలను కటకటాలకు పంపించాలనుకున్నాను. ఆమె అన్యాయాన్ని బహిరంగం చేసి ఆమెకు బతుకులేకుండా చేయాలనుకున్నాను..." అన్నాడు వరప్రసాద్.

"అది తప్పుడు ఆలోచన! ఎంతయినా భర్తవి! నీ భార్యను నీవు రచ్చకు ఎక్కిస్తే అది నీ కుటుంబాన్ని నాశనం చేస్తుంది. పైగా మనది పరువుగల కుటుంబం. ఇట్లాంటప్పుడు రహస్యంగా జరిగిపోయిన విషయాలు రహస్యంగానే వుండనివ్వు.

"ముఖ్యంగా విషయం శశాంక మేనమామ ధనుంజయకు తెలిస్తే అతడు ఇక వెనకాముందూ ఆలోచించడు. ఏకంగా నిన్ను, నీ భార్యను, నీ పిల్లల్ని తన చెల్లెలి చావుకు ప్రతీకారంగా నాశనం చేసేస్తాడు. నీది తప్పులేదని తెలిసినా సరే ఆవేశం అతడిని ఆగనివ్వదు. అప్పుడు నీ వంశం సమూలంగా నిర్మూలమైపోతుంది. అప్పుడు నీ నీతినిజాయితీ ఎందుకూ పనికిరావు. కాబట్టి మేలు కలిగించని నిజాన్ని బహిరంగం చేసేకంటే, మేలు కలిగించే అబద్ధాన్ని నీ భార్య విషయంలో మనసారా గౌరవించు" అంత జరిగినా ఆమెలో నిగ్రహశక్తి, మంచితనం తొలిగిపోలేదు.

"నేను కూడా ఇదే ఆలోచించాను అత్తమ్మా! అందుకే దానికి తగిన శాస్తికోసం ఆస్తిలో కించిత్ కూడా దక్కకుండా చేయాలన్నది నా ఉద్దేశం. లేకపోతే నా ఆలోచనని మార్చుకుని ఏం జరిగినా ఫర్వాలేదనుకునేవాడ్ని" అన్నాడు వరప్రసాద్.

"మీరు రాసే వీలునామా ఆ రాక్షస హృదయాలకి కేవలం శాస్తి మాత్రమే. కాగా, మరొకటి మిగిలివుంది అది... కనువిప్పు. ఈ కనువిప్పు అనేది ఒక్క శకుంతలకి జరిగితే చాలదు మిగతా ఇద్దరికీ కూడా జరగాలి. కాపోతే ఆ కనువిప్పుకు మార్గం మాత్రం దొరకడంలేదు. దొరక్కపోయినా జరిగింది చాలు" అన్నాడు వరప్రసాద్.

"... ... ..."

"ఇక మీరు బాధపడొద్దు. బాధపడాల్సిన అవసరం లేదు కూడా. వజ్రాన్ని వజ్రంతోనే కోయాలి అన్నట్టుగా ఆస్తంతా ఇక తమదేనని అవతల విర్రవీగుతున్న ఆ కిరాతకులకి సరైన దెబ్బకొట్టాలి. ఆ దెబ్బతో ఇక వాళ్ళు కుప్పకూలాల్సిందే" ఇన్నాళ్ళూ తనని ఒక బానిసను చేసి ఆడించిన తన వాళ్ళను తను కసితీరా సాధించాననే ఆనందం అతడిలో స్పష్టంగా కనిపించింది.

"... ... ..."

"అదేం అత్తమ్మా మౌనమైపోయారు? "

"... ... ..."

"అత్తమ్మా"

ఏం లేదన్నట్టుగా ఆమె ఈ మారు తల అడ్డంగా ఊపింది.

"మరి అదోలా అయిపోయారేం? "



"ఏం లేదు" ఈసారి నెమ్మదిగా పెదవి విప్పింది ఆమె. అతడికి ఆమె అర్థమైపోయింది. వద్దనుకున్నా ఆమెలో తన కూతుళ్ళ తాలూకు బాధ ఎగిసిపడుతోందని, అనుబంధాలమధ్య ఆమె హృదయం కొట్టుమిట్టాడుతోందని. అటు తన కడుపు తీపి, ఇటు జరిగిన అన్యాయం రెండింటి మధ్యా నియంతలా నిలబడిన కాలం ఆమెను దహించివేస్తోందని, ఆమె పరిస్థితిని బట్టే అతడికి తెల్సిపోయింది. అందుకే మనసులో ఇలా అనుకున్నాడు.

'నీ గురించి నేను ఇప్పుడు ఆలోచించడం లేదు అత్తమ్మా! ఎందుకంటే... నీ మంచితనం మరీ ఎక్కువై నిన్ను ఒక పావును చేసి ఆడిస్తోంది. ఇటువంటి పరిస్థితిలో నిన్ను ఒకవిధంగా బాధపెట్టినా కూడా నిన్ను సంపూర్ణంగా గెలిపించదలచాను. ఇక నీ ఇష్టం. నీవు ఎంతయినా బాధపడు'



మరుసటిరోజు ఉదయమే బుచ్చమ్మ పరిగెత్తుకుంటూ వచ్చింది.

"అమ్మగోరూ! అమ్మగోరూ! పెద్దమ్మగోరు మాటామంతీ లేకుండా వుంది. నాకు ఎందుకో భయంగావుంది"

బుచ్చమ్మ గొంతులోని ఆదుర్దా వరప్రసాద్‌ను కంగారుగా ఆ ఇంటికి పరుగెత్తించింది. శకుంతల, సూర్యప్రకాష్, జానకీదేవి లోలోపల సంతోషిస్తూనే బయటకు కంగారు కనబరిచారు.

"అయ్యో! ఏం జరిగిందే? ఎందుకు మాట్లాడ్డంలేదే? " అని ఒకరి తరవాత ఒకరు ప్రశ్నల వర్షం కురిపించసాగారు.

"నాకు తెలవదు అమ్మగారూ. ఎల్లి పిలిస్తే కండ్లు కూడా తెరిసి చూడకుండా పండుకున్నది. ఓలమ్మో... నా తల్లికి ఏం జరిగిందో ఏమో? " గుండెలు బాదుకుంది బుచ్చమ్మ.

"అయ్యో! దేముడా!" తల పట్టుకుంది శకుంతల.

"బుచ్చమ్మా! నువ్వెళ్ళు. నేను మన ఆచారిని తీసుకుని వచ్చేస్తాను" అంటూనే సూర్యప్రకాశరావు ఊళ్ళోని నాటువైద్యుడి ఇంటి వైపు బయలుదేరి వెళ్ళాడు.

బుచ్చమ్మ ఇంకొక్క నిమిషం కూడా అక్కడ నిల్చోలేదు. తన యజమానురాలికి ఏం జరిగిందోనన్న ఆందోళన ఆమెను చప్పున ఇంటికి పరుగెత్తించింది.

శకుంతల తనలోతనే నవ్వుకుంటూ తల్లి జానకీదేవికేసి చూసింది. ఇద్దరిలోనూ ఆనందం పెల్లుబికుతోంది. ఈ దెబ్బతో ఈ ముసల్ది మంచం పట్టడం ఖాయం. పదిరోజులనుంచీ ఒంట్లో నలతగా వుందని చెబుతోంది కదా. 'మందేసుకోకూడదా పెద్దమ్మా' అంటే 'వేసుకుంటున్నానే అంది'" అని నవ్వుతూ తల్లితో చెప్పింది శకుంతల.

"సరేలే! మాటలకిది సమయంకాదు. పద అక్కడికి వెడదాం అసలేమయిందో బావుండదు" అంటూ కర్రతో నెమ్మదిగా నడుస్తూ వీధిలోకి దారితీసింది జానకీదేవి.

అప్పటికే అక్కడకి చేరిన ప్రసాద్ ఆమె ఆత్మహత్య చేసుకున్న విషయం గ్రహించి విలవిలలాడాడు. పక్కనే ఉన్న వీలునామా చూడగానే అతని గుండె కలుక్కుమంది. రెండుమూడు రోజులుగా ఆమెచేత ఈ

వీలునామా రాయించడానికి తాను శాయశక్తులా ప్రయత్నించి చివరిగా ముందురోజు రాత్రి దాన్ని రాయించగలిగాడు. కానీ ఆమె మనసు ఒప్పని ఆ పని ఆమెను ఇంత భయంకర నిర్ణయం తీసుకునేలా చేస్తుందని ఊహించలేకపోయాడు.

అటువంటి వీలునామా రాశాక బహుశా ఆ ఉన్నత మనస్కురాలు తన చెల్లెలు, ఆమె కూతురు, మనవల మొహాలు చూస్తూ జీవించలేననుకుందేమో. లేక తన వాళ్ళందరూ అంత నిర్దాక్షిణ్యంగా బలయ్యాక తను కూడా అలాంటి అసహజ మరణాన్నే ఎదుర్కోవాలనుకుందో. ఆత్మీయతలకి, బాంధవ్యాలకి, సున్నిత భావాలకి అతీతులైన శిలా సదృశులమధ్య... పుష్పకోమల హృదయయై నిరంతరం అనురాగ పరిమళాలను వెదజల్లే ఆమె ఎలా మనగలదు అనుకోగానే ఒక్కసారి అతడి కళ్ళలో నీళ్ళు నిండాయి. అయినా సంభాళించుకున్నాడు. ఏడుపుకిది సమయంకాదు. అవతల బుచ్చమ్మ వచ్చేస్తోంది. చప్పున వీలునామా తీసి జేబులో దాచాడు.

★ ★ ★

విషయం క్షణాల్లో పాకిపోవడంతో గ్రామ ప్రజలు తండోపతండాలుగా అప్పటికే కదిలి వచ్చారు. ఆరోజుటికి తమతమ పనుల్ని కూడా మానుకుని పరిమళాదేవి దగ్గరే వుండిపోవడానికి వాళ్ళంతా సిద్ధంగా వున్నారు.

"శత్రువులకి కూడా ఇట్లాంటి పరిస్థితి రాకూడదు"

"అయ్యో పాపం! వంశం నిర్వంశమైపోయినప్పుడు ఇంతకంటే ఇంకేం చేస్తుంది? "

"ఈ తల్లిని దేవుడు ఎందుకు పుట్టించాడో? పుట్టించకపోయినా ఈ బాధలు వుండేవి కాదు"

"కొందరి జీవితాలు ఇంతే"

"మంచివాళ్ళకే అన్యాయం జరుగుతుంది"

"మంచోళ్ళకి ఆ గుడ్డిదేవుడు ఎప్పుడూ కూడా కష్టాలే తెచ్చిపెడ్తాడు"

"అయ్యో నా తల్లీ"

"ఏ జన్మలో ఎవరికి ఏం పాపం జేశావమ్మా? "

"వూరి దేవత కన్నుమూసింది"

"మా తల్లి! మా కుటుంబాన్ని సగం ఆదుకుంది"

"ఈ అమ్మగారు సాయం సేయకపోయి వున్నింటే ఈరోజు నా కొడుకు మిలట్రిల సిపాయిగా వుండేవోడే కాదు"

"మా తాగుబోతు సచ్చినోడు సంపాదనంతా తాగుడుకు తగలేస్తుంటే, ఇప్పటివరకూ నేనూ నా పిల్లలూ ఈ అమ్మగారి సొత్తు తినే బతుకుతుండం! ఇప్పుడు అమ్మగారు ఎల్లిపోయింద్రు! మా బతుకులు గూడా ఎండిపోవల్సిందే"

"గుడిలో దీపం ఆరినట్టుగా అమ్మగారు కన్నుమూయడం అనేది చాలాచాలా విచారించాల్సిన విషయం"

వచ్చిన జనాలు తమ బాధను, సానుభూతిని, ఒక్కోకోణంలో వివరించుకుంటున్నారు. అందరి మాటలు వింటున్న వరప్రసాద్‌లో బాధ అనేది క్షణక్షణానికి రెట్టింపు అవుతోంది! కాని గుంభనం పాటిస్తూ విషణ్ణవదనంతో ఎటూ తోచనివాడై అటూ ఇటూ తిరుగుతున్నాడు.

బుచ్చమ్మ వేదనకు అంతులేకుండాపోయింది. గూడు చెదిరిన అల్పప్రాణిలా ఆమె తల్లడిల్లిపోతోంది. చివరివరకూ నమ్మకంతో పరిమళాదేవిని అంటిపెట్టుకుని వున్న ఆ ముసలిప్రాణం ఇప్పుడు గుండెలు బాదుకుంటూ శోకిస్తుంటే, అది చూసి వచ్చిన జనాల్లో కూడా కొందరు కళ్లనీళ్ళు తుడ్చుకోసాగారు. మరికొందరు జనాలు అంతకుముందునుండే ఏడుస్తున్నారు. ఇంకొందరు జనాలు ఏడుపు రాకపోయినప్పటికీ నిజమైన బాధతో ఏడుపు ముఖాలతో ఏదో ఒక క్షణంలో ఏడ్చేందుకు

సిద్ధంగా వున్నారు.

ఏడుస్తున్న శకుంతలను, జానకీదేవిని కొందరు ఓదార్చడం మొదలెట్టారు. ఓదార్పు మాటలు విన్పించేకొద్దీ ఆ ఇద్దరిలో దుఃఖం ఎక్కువైపోసాగింది.

"ఏడ్వొద్దు బిడ్డా! పెద్దమ్మకు కాలంతీరింది కాబట్టి వెళ్ళిపోయింది!"

"అందరం వెళ్ళిపోయేవాళ్ళమే!"

"ఎంత ఏడ్చినా పోయినవాళ్ళు మాత్రం తిరిగిరారు. ఏడ్చీ ఏడ్చీ మీ నోర్లు పోవాల్సిందే"

"మా తల్లి దేవత! మీలో తన పిల్లల్ని చూసుకుని బతికివుణ్ణింటే ఎంత బాగుణ్ణు?"

"ఏడ్వొద్దమ్మా! నీ అక్కకు ఇంక నూకలు చెల్లిపోయాయి. అందుకే దేవుడు పిలించుకున్నాడు"

"వూరుకోండమ్మా శకుంతలా... జానకమ్మా...! మీరు గుండె దిటువు చేసుకుని పిల్లల్ని కాపాడుకోండి"

"అయ్యో రామా! చెప్తే కూడా వినరెందుకమ్మా?"

ఆ తల్లీ కూతుళ్ళను జనాలు ఓదార్చడం వరప్రసాద్‌లో కంపరం పుట్టిస్తోంది. అయినప్పటికీ బయటపడకుండా సంయమనం పాటిస్తూ, ఏదో గుర్తుకువచ్చినవాడిలా చప్పున లోపలికి వెళ్లాడు.

భర్త అలా చప్పున లోపలికి వెళ్ళగానే "ఎందుకా?" అన్నట్టుగా ఒకవైపు ఏడుస్తూనే మరోవైపు తీక్షణంగా గమనించింది శకుంతల.

కాసేపటి తర్వాత మట్టిప్రమిదతో, అగర్ బత్తీ పాకెట్టుతో నెమ్మదిగా వెలుపలికి వచ్చాడు వరప్రసాద్.

"హూ! ఈ ముసల్దానికి ఇక ఆ గౌరవం ఒక్కటి తక్కువైంది" ముక్కు చీదుతూ మనసులో గొణిగింది శకుంతల.

జానకిదేవి కూడా కూతురికి సరైన జోడీ. అల్లుడిని చూస్తూ 'ఉద్దెర మనిషి వచ్చి ఊరికి తోరణం కట్టినట్టు, ఈ అయ్యగారికి ఆ గౌరవాలు గురించి భలే గుర్తుంది' మనసులోనే అనుకుంది.

"వదినా... ఎంత పని జరిగిపోయింది వదినా..." అంతలో పెద్దపెట్టున శోకాలు తీస్తూ, గుండెలు బాదుకుంటూ, పరిమళాదేవికి సమీపంగా వచ్చాడు సూర్యప్రకాష్ రావు.

"ఏడ్వండి! ఈ దొంగ ఏడుపులు... వీలు నామా చూశాక నిజమైన ఏడుపులు అవుతాయి" ఆ ముగ్గురి విషయంలో తనలోతనే కసిగా అనుకుంటూ, పరిమళాదేవి తలదగ్గర అగర్‌బత్తీలు వెలిగించి పెట్టాడు వరప్రసాద్. ఆ తర్వాత అక్కడ్నుండి లేచి కాసింత ముందుకు వెళ్ళి జనాల్లోకి చూస్తూ, పరిమళాదేవికి పొలంపనుల్లో చేదోడువాదోడుగా వుండే వెంకటస్వామి అనే యువకుడ్ని "వెంకటీ..." పిలిచాడు.

"అయ్యగారూ..." మౌనంగా ఏడుస్తున్నవాడల్లా, వెంటనే వచ్చాడు వెంకటస్వామి.

"టౌన్‌కి వెళ్లి పెర్ఫ్యూమ్ బాటిల్స్ తీసుకునిరా! ఎందుకంటే విషం తాగిన శరీరం కాబట్టి వాసనవచ్చే ప్రమాదం వుంది" డబ్బులు తీసి ఇస్తూనే చెప్పాడు వరప్రసాద్.

"అట్లాగే అయ్యగారూ..." అంటూ డబ్బులు అందుకుని చొక్కాజేబులో పెట్టుకుని, కళ్లనీళ్ళు తుడ్చుకుంటూ వెనుతిరిగి వెళ్ళిపోయాడు వెంకటస్వామి.

"వీడికెందుకు ఈ బాధ్యత? డబ్బులు ఎక్కువైతే ఒకపూట విందు ఏర్పాటుచేసుకోవచ్చు కదా!" మనసులోనే కసిగా అనుకుని, కాసేపు ఆగి "ఆ! చేయి చేయి! ఈ లోకం మనకు అనుకూలంగా మారాలన్నా, ఈ లోకం మన మంచితనాన్ని గుర్తించాలన్నా, నీవు ఈ పనులన్నీ చేయాల్సిందేలే? లేదంటే **ఆస్తి తినే వాళ్ళు అక్కరకురాని వాళ్లుగా వుండిపోయారని** నిందరాదూ?"




రాజీకి వచ్చింది శకుంతల.



పరిమళాదేవి వీలునామా కాగితాన్ని కలెక్టర్‌కి కొరియర్ ద్వారా చేరవేశాడు వరప్రసాద్. అంతా రహస్యంగా జరిగిపోయింది. ఆ రహస్యపు సంఘటన తాలూకు ఘాటైన చురక, తన వాళ్ళను ఎలా క్రుంగదీస్తుందో ఎలా దెబ్బకొడుతుందో చూడాలనే ఆతృత... అంత బాధలోనూ అతడిని ఉన్నట్టుండి చుట్టేయడంతో భార్యను, అత్త జానకీదేవిని వెంటనే తలతిప్పి చూశాడు వరప్రసాద్.

అదే క్షణంలో "అమ్మమ్మా..." ఏడుస్తూ పరుగెట్టికు వచ్చింది కస్తూరి. ఆ పిల్లలో నిజమైన వేదన నిస్వార్థంగా కనిపిస్తోంది. ఆ పిల్లను అలా చూడగానే అందరూ ఒక్కసారిగా గగ్గోలుపెట్టి ఏడ్వసాగారు. అంతా చూస్తూ వస్తున్న దుఃఖాన్ని పళ్ళబిగువన అదిమిపెట్టుకున్నాడు వరప్రసాద్.

"అమ్మమ్మా... ఎందుకు చచ్చిపోయావే? బతికిరావే... నీతో నాకు హాయిగా వుంటుంది. అమ్మమ్మా... బతికిరావే... బతికిరావే...! నీవు రాకపోతే గనుక నేనూ చచ్చిపోతాను" కిందపడి దొర్లుతూ ఏడుస్తున్న కస్తూరి ఏడుపు దిగంతాలను అంటుతోంది. అది చూసి భరించలేని వాళ్ళుగా ఎవరో వచ్చి కస్తూరిని ఓదారుస్తూ బయటకి తీసుకువెళ్ళి పోయారు.

పెరిగిన వయసు, తరిగిన ఆరోగ్యం, తోడుగా మోతాదుకి మించిన విషాన్ని తీసుకోవడంతో ఆమె శరీరం పూర్తిగా నల్లగా మారిపోయివుంది. అయినప్పటికీ... అనంతమైన వేదనని ఒక్కసారిగా మరిచిపోవాలని ప్రయత్నించిన మహాశక్తిలా ఆమె ముఖం నిద్రపోతున్నట్లుగా గంభీరంగా వుంది. ఆమెను అలాగే చూస్తూ ఒక పక్కగా నిలబడిపోయిన వరప్రసాద్ ఆలోచనలు వున్నట్టుండి పరిపరివిధాలా పయనించడం మొదలెట్టాయి.

తన భార్య కుట్ర గురించి తను ముందుగానే తెల్సుకోలేకపోయినా కాలం తనకు అనుకూలంగా నిలబడింది. లేదంటే ఈ దెయ్యాలు అన్నీ కలిసి, పరిమళాదేవి జీవితానికి సార్ధకతలేకుండా చేసేవాళ్ళు. అప్పుడు తను అసహాయుడిగా మిగిలిపోయేవాడు? ఏది ఏమైనప్పటికీ ఇప్పుడంతా తను అనుకున్నట్లుగానే చేసినప్పటికీ, శకుంతలలో మార్పు అనేది వస్తుందా? శూన్యం!

"ఏమండీ..." మెల్లగా వచ్చి భర్తను పిలిచింది శకుంతల.

"ఆ...! ఆలోచనల్లోంచి తేరుకుంటూ పలికాడు వరప్రసాద్.

"పెద్దమ్మ... అంత్యక్రియలు" గుర్తుచేసింది శకుంతల.

"ధనుంజయ వాళ్ళకు ఫోన్‌చేశాను. వాళ్ళు వచ్చాకే అన్నీ" చెప్పాడు వరప్రసాద్.

శకుంతలకు కోపంవచ్చింది. కాని ఆ కోపాన్ని బయటకు కనబడనీయకుండా "మీరు ఒకసారి లోపలికి రండి" పిలుస్తూనే లోపలికి నడిచింది.

"ఏంటే?" అడుగుతూ వెనకే వెళ్ళాడు వరప్రసాద్.

"తమరు గొప్ప మనసున్న వాళ్లు..."

# ఏరిన ముత్యాలు

★ చెట్లకు వేళ్లు ఎంత ముఖ్యమో మన పనులకు మన సదుద్దేశాలు అంత ముఖ్యం.

– జె. టేలర్

★ సర్వోత్కృష్టమైన సౌందర్యం మానసికమైన సహజజ్ఞానం వల్లే లభ్యమౌతుంది.

– వివేకానంద

★ పుస్తకాలు లేని గది ఆత్మలేని శరీరం వంటిది.

– సిసిరో

★ గొప్ప త్యాగాల వల్లనే గొప్ప కార్యాలు సాధించబడతాయి.

– స్వామీ వివేకానంద

★ ఒక సమస్యను అలక్ష్యం చేస్తే మనకెన్నో సమస్యలు ఉద్భవిస్తాయి.

– జె. కార్టిన్

★ మనసును ఆలోచన అనే వల వేసి పట్టుకోవడం పుస్తకాల వల్ల ఒనగూడే ఒక నిజమైన ప్రయోజనం

– క్రిష్టఫర్ మోర్లే

★ ఓర్పులేని మనిషి నూనె లేని దీపం వంటివాడు.

– సెగోనియా

★ మాటలవల్ల మనోభావాలు వెల్లడవుతాయి.

– సెనేకా

★ శాంతంగా నిబ్బరంగా ఉండగలగడమే నిజమైన శక్తికి నిదర్శనం.

– వివేకానంద

★ ఆదర్శవంతులు మరణించినా ఆదర్శాలు జీవించి వుంటాయి.

– థామస్ ఫుల్లర్

★ బ్రతుకూ... బ్రతకనివ్వు... అనేది సాధారణ న్యాయం.

– విస్ట్రేంజ్

★ ముళ్లూ, రాళ్లూ ఎన్నున్నా ముందు దారి మనది.

– శ్రీశ్రీ

★ వివేకవంతులు శత్రువుల నుండి కూడా నేర్చుకుంటారు.

– అరిస్టాఫినేజ్

సేకరణ : కె.పద్మావతి

లోపలికి వెళ్ళగానే వ్యంగ్యంగా భర్తను దెప్పి పొడిచింది శకుంతల.

"ఎందుకే? " ఆమె ఉద్దేశ్యం అర్థమైనప్పటికీ అర్థంకానట్టుగా చూశాడు వరప్రసాద్.

"తమరు ఈ ముసల్దానికి ఊడిగం చేస్తుంటే చేయనీలే అంతా మంచికే అని పూరుకున్నాను. కాని ఇప్పుడు ఆ ధనుంజయగాడిని పిలవడం దేనికి? వాడసలే బాగా పేరున్న వ్యక్తి! వాడు ఇక్కడికి వస్తే గనుక ఇంకేమైనా వుందా? ఆస్తి విషయంలో కలగజేసుకోవడం ఖాయం" బెంబేలు పడిపోయింది శకుంతల.

"ఓసీ నా పెళ్ళామా! ఆ విషయం నాకు తెలియదా ఏంటీ? తేలికగా అన్నాడు వరప్రసాద్.

"ఏంటి మీకు తెల్సింది? " ఆమెలో పరిహాసం.

"అన్నీ ఆలోచించిన తర్వాతే ఆ ధనుంజయకి ఫోన్ చేశాను. ఎందుకంటే మనంతట మనమే ఈ ముసల్దానికి అంత్యక్రియలు జరిపిస్తే అది చూసేవాళ్ళకు బాగుండదు. అయిన వాళ్ళందరినీ పిలవాలి. అప్పుడే ఈ లోకం కూడా మన ఆశను పసిగట్టలేదు.

అయినా పిచ్చి మొద్దూ! మనం ఆ ధనుంజయగాడిని పిలవనంతమాత్రాన వాడు రాకుండా వుంటాండా ఏంటీ? ఈ ముసల్దాని ఆస్తి విషయంలో జోక్యం చేసుకోవాలనే ఉద్దేశ్యం వున్నవాడు పిలిచినా, పిలవకపోయినా తప్పనిసరిగా వస్తాడు. అయినా వాడికి ఏం హక్కు వుందని కల్పించుకుంటాడు. **తన పలుకుబడిని ఉపయోగించి, మరణించిన తనవాళ్ళకోసం** స్మృతి చిహ్నాం నిర్మించాలని ఒకవేళ భావించినా... ఆస్తిలో కొంత భాగమైనా మనకు రానేవస్తుంది. ఈ విషయంలో నీవు ఎంత మాత్రం బెంగపెట్టుకోవద్దు" భార్యకు ధైర్యాన్ని అందించాడు వరప్రసాద్.

"నిజమే! **కాపోతే** వాడు అసలు ఈ ఛాయలకు రాకూడదు అన్పిస్తుంది. ఏదోలే... ఆ ముసల్దాని పీడ మాత్రం విరగడైపోయింది" అని కాసేపు ఆగి "ఇక మనం బయటకి వెళ్దాం పదా! చూసేవాళ్ళు మనం ఏదో మాట్లాడ్తున్నాం అనుకుంటారు" అంది శకుంతల.

'ఎందుకు అనుకుంటారూ? అంతా చూసే దృష్టినిబట్టి, ఊహించే మనసునుబట్టి వుంటుంది' మనసులోనే అనుకుని "పదా" అన్నాడు వరప్రసాద్.



పరిమళాదేవి అంత్యక్రియలు జరిగి రెండ్రోజులు కావొచ్చింది. అందుకు ధనుంజయ ఒక్కడే హాజరు అయ్యాడు. అతడి వాలకాన్నిబట్టి చూస్తే 'తనవాళ్ళే లేనప్పుడు తనవాళ్ళకు చెందిన ఈ ఆస్తితో నాకెందుకు జోక్యం' అన్నట్టుగా కన్పించాడు కాబట్టి శకుంతల, సూర్యప్రకాష్‌రావు, జానకీదేవిల ఆనందానికి అవధులు లేకుండా పోయింది.

పరిమళాదేవి విషయంలో దీర్ఘంగా ఆలోచిస్తూ తీవ్రంగా మధనపడిపోతున్నాడు వరప్రసాద్. ప్చ్! దేవతలాంటి మనిషి! బతికివున్నప్పుడు మనసును ముక్కలు చేసుకుంది.

చనిపోయాక శరీరాన్ని ముక్కలు చేసుకుంది!

ఇక శకుంతల మాత్రం ఆశించిన స్వప్నం ఫలించిందనే ఆనందం కొద్దీ లోలోపలే లెక్కలు వేసుకోసాగింది. ఇలా వుండగానే వారం రోజులు గడిచిపోయాయి.

అనూహ్యంగా ఒకరోజు... సూర్యప్రకాష్‌రావు ఇంటి ముందుకు ఒక టాటాసుమో, ఒక జీప్ వచ్చి ఆగాయి. అవి ప్రభుత్వావాహనాలుగా చూడగానే అర్థమౌతున్నాయి. వాటిలోంచి ముగ్గురు పోలీసు కానిస్టేబుళ్లు, ఒక ఎస్సై, మరో ఇద్దరు సివిల్ డ్రెస్సుల్లో వున్న అధికారులు వెనువెంటనే దిగారు.

వాళ్లందరినీ ఒక్కసారిగా చూడగానే వరప్రసాద్‌కి మినహా ఎవ్వరికీ ఏమీ అర్థంకా లేదు. అయినప్పటికీ తనకూ ఏమీ తెలియదు అన్నట్లుగానే ఎక్స్‌ప్రెషన్ ఇచ్చాడు.

వచ్చిన వాళ్లల్లో సిన్సియారిటీ కొట్టొచ్చినట్లుగా కనబడుతుండగా వాళ్లంతా నేరుగా లోపలికి వచ్చేశారు. రాగానే సివిల్ డ్రెస్సులో వున్న ఒక అధికారి వరప్రసాద్ వద్దకు సరాసరివచ్చి "సర్! పరిమళాదేవిగారికి సంబంధించిన వ్యక్తులుగా ఆమె ఆస్తిపాస్తులు గురించి మీకు తెలియజేయవలసిన బాధ్యత మాకు వుంది కాబట్టి మేము ఇక్కడికి రావడం జరిగింది" హుందాగా చెప్పాడు.

"కూర్చోండి సర్" అతడు చెప్పింది విన్న తర్వాత వచ్చిన వాళ్లందర్నీ చూస్తూ అక్కడ వేసివున్న కుర్చీలను చూపించాడు వరప్రసాద్. వెంటనే ముగ్గురు కానిస్టేబుళ్లు మినహా మిగతా ముగ్గురూ కూర్చున్నారు.

వరప్రసాద్‌కి లోలోపల ఆనందంగా వుంది. శకుంతల, సూర్యప్రకాష్‌రావులకు మాత్రం ఏం అర్థంకాలేదు. అందుకే అధికారులు ఏం మాట్లాడ్తారా అని వాళ్లు టెన్షన్‌గా ఎదురు చూస్తున్నారు.

"చూడండమ్మా! ఇది పరిమళాదేవిగారు తన స్వహస్తాలతో రాసిన వీలునామా ప్రతి" అంటూ ఇందాకటి అధికారి ఆ కుటుంబ సభ్యులు ముగ్గుర్నీ ఒకమారు చూసి పరిమళాదేవి రాసిన వీలునామాను చదువుతూ పోయాడు.

"నేను అనగా పరిమళాదేవి, వైఫాఫ్ చంద్రమోహన్‌రావు, కొత్తకోట మండలం, వనపర్తి తాలూకా, కొత్తపల్లి గ్రామం నివాసిని! నా భర్త చంద్రమోహన్‌రావుకి సంబంధించి అంటే అతడికి పెద్దలద్వారా సంక్రమించిన ఆస్తి మాగాణి రూపంలో పదిలక్షల రూపాయల వరకు ఉంది. మరియు నా సొంత తెలివితేటలతో మరో పది లక్షల విలువచేసే మాగాణి సంపాదించుకున్నాను. ఇందులోనే నిమ్మ, జామ, బత్తాయి, చింత, మామిడి, కొబ్బరి తోటలు వున్నాయి. నా తోటల ద్వారా, నా పంటల ద్వారా ప్రతి ఏటా నేను సంపాదించుకునే డబ్బులో కొంత నా మొక్కుబడులకు, నేను చేసే దానధర్మాలకు వెచ్చింపబడింది. మరికొంత నన్ను అభిమానించే ప్రజలకు అప్పుల రూపంలో వెళ్లిపోయింది. ఇంకొంత గేదెలు, ఎద్దులు, గొర్రెలు, మేకలు, నగలు అంటూ అదనపు ఆస్తిని సంపాదించుకోవడానికి ఉపయోగపడింది. ఇక చివరగా మిగిలిన డబ్బు పొదుపుగా వుండిపోయింది. ఆ డబ్బు, పొలాలు, ఇల్లు, మిగతా అన్ని ఆస్తిపాస్తులు కలిపి యాభై లక్షల రూపాయల వరకు వుంది. కాగితాల ఆధారంగా కూడా అప్పు తీసుకుని ఇవ్వలేక పోయిన వారెవర్నీ బాధ పెట్టొద్దు, కష్టపెట్టొద్దు! ఇక నా మొత్తం యాభై లక్షల ఆస్తిలో పైసా కూడా పక్కకు పోనివ్వకుండా అంతా అమ్మివేసి ఆ డబ్బును నా చిన్నారి తండ్రి, నా ఆశల దీపం నా మనవడు శశాంక పేరిట అనాథ శరణాలయం నిర్మించడానికి ఉపయోగించండి! వాడు భౌతికంగా ఈ లోకంలో లేకపోయినా చిరస్మరణీయుడిగా పదిమంది హృదయాల్లో మిగిలిపోవాలనేదే నా చివరి కోరిక! నా ఈ కోరికను కలెక్టరుగారు సమ




ర్థవంతంగా నెరవేరుస్తారని నా మనవడి పేరును తరతరాలకు వ్యాపింపచేస్తారని వాడి పేరిట వెలసే కోవెలలో వాడినే ప్రతిష్ఠింపజేస్తారని కన్నీళ్లతో వేడుకుంటున్నాను. ఆఖరిగా చెప్పే మాట మరొకటి. నన్ను చివరి వరకూ ఆదరాభిమానాలతో చూసుకున్న బుచ్చమ్మ జీవితం అనాథశరణాలయంలో తృప్తిగా గడిచేలా చేయాలని కోరుతున్నాను.

ఇట్లు
అభాగ్యురాలు
పరిమళాదేవి

వైఫాప్/ చంద్రమోహన్‌రావు

అధికారి ఉత్తరం చదవడం పూర్తవ్వగానే తండ్రీకూతుళ్ల గుండెలు ఒక్కసారిగా జల్లుమన్నాయి. ప్రపంచం అనూహ్యంగా తల కిందులై పోయినట్టుగా కళ్లు కూడా గిర్రున తిరిగాయి. అయినప్పటికీ శకుంతల తమాయించుకుని "ఆమె మా పెద్దమ్మ! కన్నతల్లి కంటే ఎక్కువ!" ఆదుర్దాగా హడావిడిగా అధికారులను ఉద్దేశించి అంది.

"అయితే? " ఎస్సై ప్రశ్నించాడు.

బంగారు స్వప్నం కళ్లముందే ఛిద్రమై పోతూ నిలువెత్తు శరీరాన్ని కల్లోల పరుస్తుంటే శకుంతలకు ఇంకేం మాట్లాడాలో తెలీలేదు. అందుకే భర్తవైపు చూస్తూ "మాట్లాడండి" కంగారుగా అంది.

"ఏం మాట్లాడ్తారమ్మా? " వరప్రసాద్ గొంతు పెగలకముందే మరొక అధికారి సూటిగా ప్రశ్నించాడు.

"అది మా పెద్దమ్మ రాసిందేనా? " ఎటూ మాట్లాడలేక ఏం తోచక పద్మవ్యూహంలో చిక్కుకున్న అల్పప్రాణిలా విలవిలలాడి పోతూ వీలునామా చదివిన అధికారివైపుకు వేగంగా వెళ్లింది శకుంతల.

"అవును, చూడండి" అంటూ తన చేతుల్లోంచే శకుంతలకు వీలునామా ప్రతిని చూపించాడు ఆ అధికారి.

"కాదు మా వదినమ్మ ఏం రాసినా, ఏం చేసినా అది మాకు ఖచ్చితంగా తెలియజేస్తుంది. మరి మాకు తెలియకుండా ఆ వీలునామాను ఎప్పుడు రాసినట్టు? ఎప్పుడు మీకు పంపినట్టు? " అందాకా మౌనంగా వుండిపోయి తనలోతనే కదిలిపోయిన సూర్యప్రకాష్‌రావు నెమ్మదిగా గొంతు విప్పాడు.

"అంటే మీ ఉద్దేశ్యం ఏంటండీ? " సూర్యప్రకాష్‌రావువైపు అనుమానంగా చూశాడు ఎస్సై.

"ఆ ఉత్తరం ఎవరో కావాలని మా మీది కక్షతో రాశారు" అంది శకుంతల.

"కక్షా? " ఎస్సై భృకుటి ముడిపడింది.

"అవును..." అని భర్తవైపు చూసి "చెప్పండి" ఆదేశించినట్టుగా అంది శకుంతల.

"ఏం చెప్పమంటావు? " అన్నాడు వరప్రసాద్.

అందుకు శకుంతల ఒక్కసారిగా భర్తవైపు వేగంగా వెళ్లి "ఏం చెప్పమంటావని అంత అమాయకంగా అంటావేం? " అని కాసేపు ఆగి "ఒకమారు ఇంట్లోకి రండి" గొంతు తగ్గించి పళ్లబిగువన పిలిచింది.

"సార్! ఒక్క నిముషం" వెంటనే వరప్రసాద్ అధికారులని రిక్వెస్ట్ చేసి లోపలికి నడిచాడు. వెనకే వెళ్లిన శకుంతల అలా లోపలికి వెళ్లిందోలేదో ఇలా భర్త చొక్కా కాలర్‌ని పట్టుకుని నాకు ఆ ధనుంజయగాడిపై అనుమానంగా వుంది. వాడు తిమ్మిని బమ్మిని చేయగలడు. వాడే మనమీది కుట్రతో ఆ ముసల్దాని చేతి రాతనే కాదు సంతకాన్ని కూడా ఫోర్జరీ చేసి వుంటాడు" రహస్యాన్ని గ్రహించినట్టుగా మాట్లాడింది శకుంతల.

"కాదు ఆ వీలునామా ఆమే రాసింది" అన్నాడు వరప్రసాద్.

"ఎప్పుడు రాసింది? మనవడు చచ్చినప్పటినుండి అది కూడా జీవశ్చవమైపో

యిందికదా? ఈ పరిస్థితిలో అది వీలు నామా రాయడం, రాసి కలెక్టర్‌కి పంపించడం అంతా కాని పని" కొట్టిపారేసింది శకుంతల.

"ఎప్పుడైతే శశాంక మరణించాడో అప్పుడే ఆమెలో మార్పు వచ్చిందన్నావు కదా! అప్పుడే ఆ వీలునామా రాసివుంటుంది" అన్నాడు వరప్రసాదు.

"హలో సార్" అంతలో బయటనుంచి కేక వినిపించింది.

"వస్తున్నాం" అంటూ అందర్నీ పదమని హాల్లోకి నడిచాడు వరప్రసాద్.

"మీరు ఆలోచించుకోడానికి ఇది సమయం కాదుసార్! ఎందుకంటే మేం వచ్చింది ఈ వీలునామా చదివి వినిపించడానికి" అన్నాడాయన.

"ఓ. కే. సార్!" తలాడించాడు వరప్రసాద్.

★ ★ ★

కాలగమనంలో ఎన్నో మార్పులు. మనుషుల ఆలోచనా ధోరణులలో కూడా మార్పులు. ఆస్తి పోయిందన్న బాధతో అతలాకుతలమవుతున్న భార్యను ఓ రాత్రి లాలనగా పిల్చి దగ్గర కూర్చోపెట్టుకున్నాడు వరప్రసాద్. పరిమళాదేవి చెప్పిన విషయాలన్నీ ఆమెకు చెప్పాడు. ఆమె రాసిన ఉత్తరాన్ని ఆమెకిచ్చాడు. అది చదివి షాక్ తింది శకుంతల. నోట మాట రాలేదామెకు. ఇన్నాళ్ళూ ఆమెకు తెలియకుండానే తమ నాటకాలన్నీ నడిచాయనుకుంది. అప్పుడు వరప్రసాద్ అదే సమయమనుకుని ఎన్నో విషయాలను ఆమెకు తెలియచెప్పాడు. చెల్లెలు, మరిది, కూతురు... అందరూ ఆమెయందు ఎన్ని కుతంత్రాలను ప్రయోగించినా మౌనగంభీరమూర్తిలా సహించి, జీవితంలో వచ్చిన కష్టాల కెరటాలకెదురీదిన ఆ మహామనీషికి మనం ఏం చేసినా రుణం తీర్చుకోలేమని చెప్పాడు భార్యకి. ఆమెకున్న ఆర్థిక బలంతో తలుచుకుంటే క్షణాల్లో మనమీద కేసులు పెట్టగల సత్తా వుందనీ, అయినా ఆమెలో క్షమాగుణమే తప్ప ప్రతీకారవాంఛ లేదన్నాడు. భర్తలోని ఔన్నత్యాన్ని, సంస్కారాన్ని ప్రపథమంగా అర్థం చేసుకుని అతడిముందు తానొక పిపీలికంగా, విషపు పురుగుగా భావించుకున్న ఆమెలో కొత్త ఆలోచనలకు ద్వారాలు తెరుచుకున్నాయి. మొదటినుంచీ తాను చేసిన పనులను భర్త మనసా, వాచా సమర్థించలేదనీ, కేవలం నిస్సహాయతతో, అధైర్యంతో కొన్నిటికి తోడ్పడినట్లు నటించాడని తెలుసుకున్న శకుంతలలో మార్పుకు బీజం పడింది. పశ్చాత్తాపం ఆమెను దహించడం ప్రారంభించింది. అయినా వరప్రసాద్‌కి ఆనందం అనిపించలేదు. జరగవలసిన నష్టం జరగనే జరిగింది. అలాంటి మానవతామూర్తిని పోగొట్టుకున్నామనుకుంటున్న అతడు తన చేతకానితనానికి మరోసారి సిగ్గుపడ్డాడు.

★ ★ ★

రెండు సంవత్సరాల తర్వాత...

శశాంక సదనం....

ఓ పెద్ద అధునాతన భవంతి తాలూకు శిఖరాగ్రాన్ని అలరించిన పాలరాతి తల్పాంపై, నల్లని, పెద్దని అక్షరాలు నిరాడంబరంగా నిత్యచైతన్యపు కాంతితో శోభిస్తున్నాయి.

సాయంకాలం కావొస్తోంది కాబట్టి నీరెండఛాయ దోరవర్ణాన్ని ఆరబోస్తుంటే, ఆ వింతకాంతి వెలుగులో ఆ భవనం మరీ అందంగా మెరుస్తోంది. ఆ భవన ప్రాంగణం రకరకాల పూలమొక్కలకు వేదికయై 'ఐక్యతను' ఆవిష్కరిస్తోంది. ఆ పూల మొక్కల మధ్య రంగురంగుల సీతాకోకచిలుకల్లా ఎందరో చిన్నారులు ముద్దుగా అల్ల




రిచేస్తూ ఆడుకుంటున్నారు.

కాసేపటికి ఒక అంబాసిడర్ కారు ఆ భవనం తాలూకు గేటు లోపలికి నెమ్మదిగా దూసుకువచ్చింది. అక్కడికి వచ్చే చాలామంది రకరకాల వాహనాల్లో వస్తుంటారు. వాళ్ళంతా ఆ చిన్నారులకు రకరకాల ఆహార పదార్థాల్ని... కానుకల్ని అందిస్తూ తమ సహృదయతను చాటుకుంటుంటారు. అందుకే కారు రాగానే ఆడుకుంటున్న చిన్నారులంతా ఒక్కసారిగా ఆటలు మాని, ఆశనిండిన కళ్ళతో ఆత్రంగా కారువైపే చూడసాగారు.

ఒకపక్కగా వచ్చి ఆగిన కారులోంచి వరప్రసాద్ దంపతులు కిందకు దిగారు. ఆ తర్వాత బుచ్చమ్మ దిగింది. ఆమె చేతిలో ఓ పెద్ద అట్టపెట్టె వుంది. అందులో ఆ చిన్నారుల కోసం తెచ్చిన ఖరీదైన చాక్లెట్లు, చిన్న చిన్న కానుకలు వున్నాయి.

ఆమధ్యనే ప్రారంభోత్సవం జరిగిన ఈ శరణాలయానికి నెల, రెండు నెలలకు ఒక మారు వచ్చి ఆ పిల్లలకు ఏదో ఒకటి ఇచ్చి వాళ్ళల్లో ఆనందాన్ని మనసారా చూడాలని వరప్రసాద్ మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాడు. భర్త కోరికను భార్య శకుంతల నిస్వార్థంగా గౌరవిస్తున్నట్టుగా వెంటే నీడలా కదిలివచ్చింది.

ఏ రాగం తెలియని వెదురు... గాయపడి కమ్మని గానమైనట్టుగా శకుంతలలోని మార్పు ఆమె చిరునవ్వులోనే స్పష్టమౌతుంటే భర్త వెనకే నెమ్మదిగా అడుగులు ముందుకు వేసింది.

చూస్తుండగానే పిల్లలంతా ఒక్కుమ్మడిగా పరుగున వచ్చి వాళ్ళను చుట్టుముట్టి "ఆంటీ... అంకుల్..." అంటూ ఆనందంగా, ఆశగా కాళ్ళా వేళ్ళా పడసాగారు. ఆ ఆరాటాన్ని చిరునవ్వులతో చూస్తూ పక్కనే బుచ్చమ్మ చేతుల్లో వున్న అట్టపెట్టెలోని చాక్లెట్లని, కానుకల్ని చేతుల్లోకి తీసుకుని పిల్లలు ఒక్కొక్కరికీ పంచిపెట్టసాగారు వరప్రసాద్ దంపతులు.

"అంకుల్... ఆంటీ... చాక్లెట్లు బాగున్నాయి. గిఫ్టులు మరీ మరీ బాగున్నాయి. మరి థాంక్స్ మీ ఇద్దరిలో ఎవరికి చెప్పుకోవాలి? " వున్నట్టుండి వచ్చీరాని మాటలతో ముద్దుగా అడిగింది ఓ చిన్నపాప.

"ఇద్దరం ఇస్తున్నాం కాబట్టి, ఇద్దరికీ చెప్పుకోవాలి" అమాయకంగా కనిపిస్తున్న ఆ చిన్నారి బుగ్గల్ని కాసింత ముందుకు వంగి మృదువుగా పిండింది శకుంతల.

"కాదు" అన్నాడు వరప్రసాద్.

"మరి? " భర్తవైపు ప్రశ్నార్థకంగా చూసింది శకుంతల.

"మరి ఎవరికి చెప్పాలి? ఆ అవ్వకా? " బుచ్చమ్మవైపు చూసింది ఆ పాప.

"అవ్వకు కూడా కాదు" అంటూ ఆ చిన్నారి బుగ్గల్ని తను కూడా ఓ మారు సుకుమారంగా పిండి, శకుంతలవైపు చూస్తూ "ఈ చిన్నారులకు ఆశ్రయం ఇచ్చింది ఎవరు? మనం ఎవరి పేరిట ఈ సత్కార్యాన్ని తలపెట్టాం? వాళ్ళకే చెప్పాలి" అన్నాడు.

"ఆ!" అవును అన్నట్టుగా శకుంతల చిరునవ్వుగా తలాడించింది. వరప్రసాద్ ఇక ఆ వెంటనే ఆ చిన్ని పాపవైపు ముచ్చటగా చూస్తూ తన సమాధానం కోసమే ఎదురు చూస్తున్న ఆ పాపకు మరో కానుకను అదనంగా ఇస్తూ నిండుగా చెప్పాడు.

"పరిమళాదేవిగారికి"

**అంకితం**

ప్రియమైన అమ్మకు...

- శ్రీదేవి

# చతుర కతలు

## మహారాజయోగం

"బ్రహ్మాండమైన అవకాశం. ఎవరి జాతకమైనా గ్రహాలు, హస్తరేఖల ఆధారంతో ఖచ్చితంగా చెప్పబడును. మంచి అవకాశం మళ్ళీ మళ్ళీ దొరకదు. జ్యోతిష రత్న, జ్యోతిషసామ్రాట్, ప్రపంచ ప్రసిద్ధ శ్రీశ్రీశ్రీ వీరవెంకట సత్యవరహా వల్లభాచార్యులుగారు హర్ష లాడ్జిలో వేంచేసియు



న్నారు. జాతకాలు, భవిష్యత్ చెప్పించుకోదలచినవారు హర్ష లాడ్జిలో జ్యోతిష్యుడ్ని కలుసుకోండి. జాతకం ఫీజు కేవలం... ఐదువందల రూపాయలు మాత్రమే" రిక్షాకు అమర్చిన టేప్‌రికార్డర్ మైకు హోరు పెడుతోంది.

అలాంటి మైకులు అమర్చిన రిక్షాలు టౌన్‌లో నాలుగు తిరుగుతున్నాయి.

ప్రచారంతో పాటు ప్రజలలో కూడా జ్యోతిష్యుడి పేరు మారుమోగిపోతోంది.

ఎక్కడ చూసినా, ఎవరి నోట విన్నా జ్యోతిష్యుడి ప్రస్తావనే! అతను చెపుతున్న జాతకానికి తిరుగులేదనీ, ఖచ్చితంగా సరిపోతుందని టౌను అంతా చెప్పుకుంటున్నారు.

ఉద్యోగం వస్తుందా, రాదా, వస్తే ఎప్పుడొస్తుంది అని నిరుద్యోగులూ, జన్మలో అప్పులు తీరే మార్గం వుందా అని టౌనుకి వచ్చిన రైతులూ, వ్యాపారాలు సజావుగా నడుస్తాయా అని వ్యాపారులూ, తమ ఉద్యోగాలు ఉంటాయా, ఊడతాయా అని ఫ్యాక్టరీల్లోని కార్మికులూ, తాము తీసుకుంటున్న లంచాలవలన ఏసీబీ వాళ్ళకి చిక్కే ప్రమాదం ఏమైనా వుందా అని ప్రభుత్వోద్యోగులూ- ఇలా ఒకరేమిటి అందరూ జాతకం చెప్పించుకోడానికి హర్ష లాడ్జిలో క్యూలో నిలబడ్డారు.





"ఒరేయ్... జాతకం చెప్పించుకుంటే ఐదొందలంట్రా! మనం కూడా జాతకం చెప్పించుకుందాంరా! ఎలా వుందో మన అదృష్టం? " అన్నాడు రాంబాబు.

ఎగిరి రెండు గెంతులు వేసి, "ముందు వెళ్ళి చూసి, కొద్దిగా జనం తగ్గిన తరువాత ప్రశాంతంగా మన జాతకం చెప్పించుకుందాంరా!" అన్నాడు హరిబాబు.

రాంబాబు, హరిబాబు మంచి మిత్రులు. వాళ్ళు కలిసే ఉద్యోగం చేస్తున్నారు.

ఆరోజు సాయంత్రం జ్యోతిష్యం చెప్పించుకోవడానికి మిత్రులు ఇద్దరూ హర్ష హోటల్‌కి వెళ్ళారు. జనం రద్దీ!

థర్డ్ ఫ్లోర్‌లో రూంనెంబర్ థర్టీత్రీలో జ్యోతిషరత్న! మకాం! వరండా అంతా జనంతో నిండిపోయివుంది.

ఇద్దరూ రాత్రి తొమ్మిది గంటలవరకూ చూసి, జనం రద్దీ తగ్గకపోవడంతో వెనక్కి తిరిగివచ్చారు.

తరువాత రోజు కూడా వెళ్ళారు. రద్దీ తగ్గినా అడపాదడపా జనం వస్తూనేవున్నారు.

జనం ఎవరూ లేని సమయంలో ఏకాంతంగా, ప్రశాంతంగా, తీరుబడిగా జ్యోతిష్యం చెప్పించుకుందామని మిత్రుల ఆలోచన.

అలా మూడురోజులు హర్ష లాడ్జికి వెళ్ళి, పడిగాపుల అనంతరం రాత్రి 9 గంటలవేళ మిత్రులు ఇద్దరికీ జాతకం చెప్పించుకునే అవకాశం లభించింది.

పాలనురుగులాంటి తెల్లటి వస్త్రాలు ధరించి ఎర్రగా పండిపోయిన దోసపండులా వున్నాడు జ్యోతిష్యుడు. మెడలో బంగారుగొలుసు, రుద్రాక్షమాల, చేతికి బంగారుకడియం, ముఖంనిండా విభూది రేఖల మధ్యలో కుంకుమబొట్టు! సన్నగా వున్న ఆకర్షణీయరూపం!

మిత్రులు ఇద్దరూ కలిసి జాయింటుగా వెయ్యి రూపాయలు సమర్పించారు.

ఆ డబ్బు తీసుకుని జ్యోతిష్యరత్న టేబిల్ సొరుగులో భద్రంగా దాచిపెట్టుకున్నాడు.

"నాకు చెప్పండి సార్" అని రాంబాబు చేయి అందించాడు.

"ముందు నాకు చెప్పండి సార్" అని రాంబాబు చేతిని వెనక్కినెట్టి హరిబాబు చేతిని చాపాడు. ఇద్దరికీ తొందరగా, ఉత్సాహంగా వుంది.

ఇద్దరూ నాకు చెప్పండి అంటే నాకు చెప్పండి అంటూ ఒకర్ని ఒకరు తోసుకోవటం మొదలుపెట్టారు.

"ఆగండి అబ్బాయిలూ! ఇద్దరికీ చెపుతానుకదా! ఐదు నిముషాలు ఓపిక పట్టండి. మీ ముఖవర్చస్సులు చూసి మీ జాతకం చెప్పవచ్చు. మీకు స్పీడు జాస్తి! మీకు మహారాజయోగం వుంది. మీరు పట్టింది బంగారం అవుతుంది. చేతులు కూడా చూడాల్సిన అవసరంలేదు. ముఖాలు చూసి జాతకం చెప్పగల శక్తి నాకు వుంది. కొద్దిగా ఓపిక పడితే మీకు బ్రహ్మాండంగా జాతకం చెపుతాను!" అంటూ జ్యోతిష్యుడు వాళ్ళని వారించబోయాడు.

ఆయన మాటల్ని వినిపించుకోకుండా ఇద్దరూ మహాపట్టుదలగా ఉన్నారు. చివరకు చేయిచేయీ కలిసే పరిస్థితి వచ్చింది.

జ్యోతిష్యుడు ఇద్దరి మధ్య చేరి వాళ్ళని తప్పించబోయాడు.

ఇంతలో హఠాత్తుగా ఇద్దరూ కలిసి జ్యోతిషరత్న మీదకి విజృంభించారు. హరిబాబు మహావేగంతో ఆయన పెడరెక్కలు విరిచిపట్టుకుంటే రాంబాబు నోట్లో గుడ్డలు కుక్కాడు. ప్లాస్టిక్ తాడుతో చేతులూ, కాళ్ళూ కట్టిపడేశారు.

రాంబాబు గదిలోని సూట్‌కేసూ, బ్యాగూ, టేబుల్ సొరుగూ అన్నీ గాలించి

జ్యోతిష్యుడు వారంరోజుల్లో సంపాదించిన వేలాది రూపాయలు వెంట తెచ్చుకున్న బ్యాగ్‌లో సర్దుకున్నాడు.

పెనుగులాడుతున్న జ్యోతిష్యుడ్ని నాలుగు దెబ్బలు కొట్టి హరిబాబు ఆయన మెడలోని గొలుసూ, చేతి కడియం, వాచీ, ఉంగరం లాక్కున్నాడు.

జ్యోతిష్యుడ్ని టాయిలెట్‌లోనికి నెట్టి గడి పెట్టారు. బయటకి వచ్చి రూంకి కూడా లాక్‌చేసి ఇద్దరూ రీవిగా నడుచుకుంటూ వెళ్ళిపోయారు.

జ్యోతిషరత్న ఇప్పుడు తను ఎలా బయటపడాలా అని భవిష్యత్ తెలియక లావెటరీ గదిలో విలవిలలాడిపోసాగాడు.

**– మొలకలపల్లి కోటేశ్వరరావు**

---

## విభూతి పొట్లం

జనరల్ స్టోర్స్‌లోకి అడుగుపెడుతున్న శాస్త్రి, "హల్లో శాస్త్రిగారూ ఏం ఇలా వచ్చారు? " అన్న శర్మ గొంతువిని ఉలికిపడి, "ఈరోజు కూడా ఇంతే ఇక" అనుకుంటూ ఏడుపులాంటి నవ్వొకటి నవ్వుతూ, "హలోసార్ హౌ ఆర్యూ!" అన్నాడు.




"మీవాడు ఎంసెట్ కోచింగ్‌కి వెళ్తున్నాడా? " అన్నాడు శర్మ పర్స్‌లోంచి డబ్బులు తీసి లెక్కపెడుతూ.

"హమ్మయ్య! ఈయనిక వెళ్తాడు. మన పని సులువు" అనుకుంటూ శాస్త్రి నవ్వుతూ, "ఆc వెళ్తున్నాడు సార్ అన్నట్లు అమ్మాయి హైద్రాబాద్‌లోనే ఉందా? " అన్నాడు ఉత్సాహంగా.

"అవునండి. అన్నట్లు ఇల్లు మారాక నాకు చాలా సౌకర్యంగా ఉంటోంది. మీరు మంచి ఇల్లే చూపెట్టారు. మీరున్న... అదే మనం ఉన్న లోకాలిటి ఎక్సలెంట్‌గా ఉంది" అంటూ సామాను ప్యాక్ చేస్తున్న షాపతనితో, "బాబూ ఆ విభూతి పొట్లాలు జాగ్రత్త నాయనా!" అంటూ హెచ్చరించాడు.




వింతగా చూస్తున్న శాస్త్రితో, "ఇంట్లో పూజలవీ ఎక్కువ కదండి. విభూది పొట్లాలందుకే" అని సామాను సంచి తీసుకొని "మీరు కూడా తీసుకోండి శాస్త్రి గారూ! ఇద్దరం కలిసి వెళ్దాం" అన్నాడు.

శాస్త్రి గతుక్కుమని "మీరు వెళ్ళండి సార్. నాకు వేరే పని ఉంది" అని ఆయన అటు వెళ్ళగానే గట్టిగా ఊపిరి పీల్చుకొని "ఏమయ్యా! రెండు ఆదివారాలనుండి షాపులేదు. మాకు అవసరమయ్యేది, అందరూ ఇంట్లో ఉండేది ఆదివారాలే. ఒక అరడజను మంచి కోడిగుడ్లు ప్యాక్ చెయ్యి" అని...

"ఎవరున్నా లేకున్నా ఆ శర్మ లేకుంటే చాలు ఇవి కొనేటప్పుడు. రేపు ఆఫీసంతా టాంటాం వేస్తాడు 'శాస్త్రిగారు కోడిగుడ్లు తింటాడహో' అని" అన్నాడు షాపతనితో ఉన్న చనువుకొద్దీ.

షాపతను నవ్వుతూ, "భలేవారే సార్! మీకా భయం అక్కర్లేదు. మీకెప్పుడు కోడి గుడ్లు కావలసినా విభూది పొట్లాలు కావాలి అని అడగండి. కట్టిచ్చేస్తాను. ఎవరికీ అనుమానం రాదు. అంతెందుకు సార్! ఇప్పుడు వెళ్ళారే శర్మగారుగారు... ఒక నాలుగు విభూది పొట్లాలు తీసికెళ్ళారే! అవి ఏమిటనుకున్నారు? కోడి గుడ్లు. మీ ముందే తీసుకున్నారుగా? " అన్నాడు.

అది విని శాస్త్రికి తలతిరిగినట్లయి తమాయించుకున్నాడు.

**– అరుణా రవికుమార్**

---

## పౌడర్

**పో**స్ట్...!

లేచివెళ్ళి రిజిష్టర్ పోస్ట్ రిసీవ్ చేసుకున్నాడు "బెంబేల్ రావ్".

ఏదో పొట్లాంలా వుంది.

"ఏమిటండీ అది!" ప్రశ్నించింది భార్యామణి.

"అబ్బ... వుండవే... నన్ను చూడనీ..."

"అంతేలెండి... నాకు తెలియకుండా సెకండ్ సెటప్ మెయిన్‌టైన్ చేస్తున్నారు కదూ! అది ఏ పూవులో, అత్తరో పంపించివుంటుంది"



"చాప్లిన్ ముఖం కలవాడ్ని... నన్ను నీలాంటి ఆడది తప్పితే ఎవరు లైక్ చేస్తారే... నోరు మూసుకో అసలీ పొట్లం ఏమిటో విప్పనీ"

"మీరు మున్సిపల్ హెల్త్ ఆఫీసర్ కదా! ఏ కంపెనీ వాడన్నా 'గిఫ్ట్' పంపించాడ్రాండీ!? " మళ్లీ అడిగింది కుతూహలంగా.

"ఏమిటిది తెల్లటి పౌడర్ వుంది!? "

అప్పుడే రేడియోలో ఓ ఎడ్వర్‌టైజ్‌మెంట్... ట్రింగ్... ట్రింగ్... 'తెల్లటి పౌడర్ పొట్లాలేమైనా వస్తే... వాసన పీల్చకండి, ముఖానికి పూసుకోకండి. అది 'ఆంత్రాక్స్' కావచ్చు'

ఇద్దరూ షాక్ కొట్టినట్లు పౌడర్‌ని వదిలేశారు. వెంటనే హడావుడిగా పోలీస్‌స్టేషన్‌కి ఫోన్ చేశారు. పత్రికా విలేకరుల్ని ఆహ్వానించారు. ఎట్టకేలకు ఆ పౌడర్‌ని కెమికల్ పరీక్ష కోసం లేబరేటరీకి పంపించారు. తెల్లారే పేపర్లో కూడా పడిందా వార్త.

రబ్బరు బంతి గోడకు తగిలి రకాలున తిరిగివచ్చినట్లు 'రిపోర్ట్' వచ్చింది. దాన్ని చూసి అందరూ ముక్కున వేలేసుకున్నారు.

అది ఆంత్రాక్స్ కాదు... వట్టి పౌడర్... అది ఆకతాయిల చేష్ట.

"ఎవరు నాకా పౌడర్ పంపి నన్ను టెన్షన్‌కు గురిచేసింది? " కాసేపు గుంటూరు మిరపకాయల్ని నమిలాడు రావ్.

ట్రింగ్... ట్రింగ్.

ఫోన్ ఎత్తాడు రావ్... "హలో... హలో..."

"మున్సిపల్ హెల్త్ ఆఫీసర్‌ని మాట్లాడుతున్నాను. ఎవరు మాట్లాడేది? "

"సర్... నేను పదకొండో వార్డులో వుండే ఓ సామాన్యుడిని. మీరు మురుగు నీటిలో రోడ్లపక్కన జల్లించే 'బ్లీచింగ్ పౌడర్' కల్తీది సార్... అసలేమీ పనిచేయడంలేదు"

"ఎలా చెప్పగలవు? "

"మీకు నేను పంపిన పౌడర్‌ని పరీక్ష చేయించారుగదా సార్! అది వొట్టి పిండి అని తేలిందిగదా సార్!? "

రావ్ షాక్ తిన్నాడు.

– డా॥ కె. శివసుబ్బారావు

---

## బెరా...!

విద్యాబోధన మాట ఎలా వున్నా, దేశంలో ఎక్కడ ఏ అవాంతరం సంభవించినా, విరాళాల సేకరణకోసం రోడ్డున పడవేసేది విద్యార్థులనేనంటే అతిశయోక్తి కాదు. ఉత్తరాదిన ఎక్కడో వచ్చిన భూకంపం దేశంలోని స్కూళ్ళలో ప్రకంపనలు రేపిన కారణంగా 'హుండీ'లతో వీధులకెక్కారు స్టూడెంట్సందరూ. భూకంప బాధితుల సహాయనిధి సేకరణ కోసం స్కూలుకు ఇంతని ప్రభుత్వం టార్గెట్స్ నిర్ణయించిన కారణంగా సీలువేసిన హుండీలను చేతుల్లో పెట్టి స్టూడెంట్స్‌ని ఊరిమీద వదిలాయి స్కూల్సు విరాళాలకోసం, వారికి పాఠాలు చెప్పడం తమ ప్రాథమిక బాధ్యత అన్న విషయాన్ని విస్మరించి!

ఫిఫ్త్ క్లాస్ చదువుతున్న చంద్రానికి ఇంటింటికీ వెళ్ళి చందాకోసం హుండీ చాచడం ఇబ్బందిగా తోచింది. వాడి అవస్థ గ్రహించిన తల్లి జాలిపడి ఓ సలహా ఇచ్చింది. ఆ ప్రకారం ఇంట్లో రవ్వ లడ్డూలు తయారుచేసి కొడుక్కి ఇచ్చిందామె. వాటిని పంచిపెడుతూ, ఒక్కోదానికీ కనీసం అయిదు రూపాయలు చొప్పున విరాళంగా హుండీలో వేయించమని చెప్పింది. అలా చేయడంవల్ల ఇతరులవద్ద ఉచిత విరాళాలు కోరడమన్న





సమస్య వుండదు. పైగా లడ్డూల రూపంలో వారిచ్చే విరాళానికి కొంతవరకైనా ప్రతిఫలం ముట్టిందన్న సంతృప్తి కలుగుతుంది వారికి. అంతేకాదు, తమ వంతు కంట్రిబ్యూషన్ లడ్డూల రూపంలో ఆ 'నిధి'కి ఇచ్చినట్లూ వుంటుంది చంద్రం కుటుంబానికి.

చంద్రం ఓ చేతిలో రవ్వలడ్డూల టిన్నూ, మరో చేతిలో 'హుండీ' పట్టుకుని బయలుదేరాడు. విరాళాల సేకరణకు ఆ కుర్రాడు అవలంభించిన కొత్త పద్ధతికి గొప్ప రెస్పాన్సే వచ్చింది. ఫలితంగా సరుకంతా అయిపోయింది. చివరికి ఓ లడ్డూ మిగిలింది. దాన్ని కూడా ఎవరికైనా ఇచ్చేయాలనుకుంటుండగానే ఓ ఇంటి అరుగుమీద కూర్చుని న్యూస్ పేపర్ చదువుకుంటున్న వృద్ధుడొకడు కనిపించాడు చంద్రానికి.




ఆ కుర్రాడు వచ్చిన పని ఆలకించి, వాడు అవలంభించిన నూతన పద్ధతికి ముచ్చటపడి, హుండీలో యాభై రూపాయలు వేశాడతను.

చంద్రం ఇచ్చిన లడ్డూని తీసుకుని, "ఐ నీడ్ యువర్ హెల్ప్ మై బాయ్" అన్నాడు.

"ఏం చేయాలో చెప్పండి" అన్నాడు చంద్రం హుషారుగా.

"నేను షుగర్ పేషెంటుని. ఈ లడ్డూని నా బదులు నువ్వు తినాలి" అన్నాడతడు నవ్వుతూ.

"సారీ, తాతగారూ! నాకొద్దు" అన్నాడు చంద్రం.

"ఫరవాలేదు, తీసుకో" అన్నాడతను లడ్డూ వాడిచేతిలో పెట్టబోతూ.

చంద్రం తీసుకోలేదు. "ఊహూ... కొత్త వ్యక్తులిచ్చే ఏ వస్తువూ తినకూడదని చెప్పింది మా అమ్మ" అనేసి అక్కణ్ణుంచి తుర్రుమన్నాడు.

"ఆ..." అంటూ నోరు వెళ్ళబెట్టాడతడు.

– తిరుమలశ్రీ



# FORM IV (See Rule 8)

Statement about ownership and other particulars of CHATURA.

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 082. |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 082. |
| 4. Publisher's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 082. |
| 5. Editor's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 082. |
| 6. Name and address of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital. | : | **VASUNDHARA PUBLICATIONS** 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 082. |

I, RAMOJI RAO, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**for VASUNDHARA PUBLICATIONS**
**Sd / - RAMOJI RAO**
Publisher

Date: March 1, 2002

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060; Cuddapah: 70011; Tadepalli gudem: 28881; Warangal: 59933.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd. No. H/HD/965- RN1/32186/78






## అసలైన రుచికి
## సిసలైన జోడింపు

# ప్రియ మసాలాపేస్ట్!

అన్ని మసాలా దినుసుల అతి చక్కని మేళవింపుతో నోరూరించే రుచు
మీకందిస్తాయి ప్రియ మసాలా పేస్టులు. మీరువండే
వెజిటేరియన్, నాన్‌వెజిటేరియన్ కర్రీ అయినా, లే
బిరియాని అయినా - మీరు చేయవలసినద
ప్రియ నాణ్యతను జోడించడవే
ఆ తరువాత అసలైన రుచులు
అందరిని అలరిస్తాయి. మిమ్మ
అభినందనలు ముంచెత్తుతాం



**priya**

*Masala Paste*

• బిరియాని మసాలా పేస్ట్ • వెజ్ కర్రీ మసాలా పేస్ట్ • నాన్‌వెజ్ కర్రీ మసాలా పేస్ట్

Ushodaya Enterprises Limited (Priya Foods Division), Eenadu Complex, Somajiguda, Hyderabad - 500 082, (A.P.)
Phone : +91-40-3323717, 3324727 Fax :+91-40-3393640 E-mail: priyaexp@hd1.vsnl.net.in www.priyafooc